# అంకితము

1948 – 50 సంవత్సరాల మధ్యకాలంలో భూసంస్కరణల కోసరం, బంజర్ల పంపకం, న్యాయమైన కూలిరేటు కోసరం, పౌరసత్వ ప్రజాస్వామ్య హక్కుల కోసరం వీరోచితంగ పోట్లాడి కాంగ్రెస్ ప్రభుత్వ క్రూర నిర్బంధ విధానానికి, తుపాకి కాల్పులకు ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలో ఆహుతి అయిపోయిన వందలాది రైతు, వ్యవసాయకూలి, యువజన, విద్యార్థి, కమ్యూనిస్టుపార్టీ ప్రముఖ కార్యకర్తలకు –

# కృతజ్ఞత

ఈ పుస్తకాన్ని 1949 వ సంవత్సరంలో ప్రారంభించి 1950 సంవత్సరం మార్చి నెలలో పూర్తి చేసాను. 1953 వ సంవత్సరం వరకు కాలేజీలో విద్యార్థిగ వుండిపోవడం వలన ఆరోజులలో దీని ప్రచురణకు పూనుకోలేక పోయాను. తరువాత ప్రయత్నిస్తే ఆర్థిక యిబ్బందులు అడ్డంవచ్చాయి. యీ పుస్తకం ఆంధ్ర ప్రజానీకానికి అందజేయగల భాగ్యము నేటికి చాలమంది మిత్రులు, పెద్దల సహాయం వలన సాధ్యమయింది. తమకు కావాల్సిన పుస్తకాలకి ముందే డబ్బుయిచ్చి ఆ డబ్బుతో ప్రచురణకు పూనుకోవలసినదిగ చాలమంది మిత్రులు నన్ను ప్రోత్సహించారు. ఆవిధంగా మిత్రులు 4 వందల రూపాయలదాకా సమకూర్చిపెట్టారు. వీరందరికి నేను సర్వదా కృతజ్ఞుడను. చిత్తుప్రతిని చదివి యీ పుస్తకాన్ని అచ్చువేయించవలసిన అవసరముందని ప్రోత్సహించి తగిన సలహాలు యిచ్చి సహాయపడిన శ్రీ కవిరావు, శ్రీ శివరాము గార్లకు కృతజ్ఞుడను. పుస్తకం మరలా సవరించి వ్రాయాల్సి వచ్చింది. యీ సందర్భంలో పుస్తకం కొన్ని పేజీలు పెరిగింది. చివరి రెండు అధ్యాయాలు మాత్రం పూర్తిగ మార్చివేసి వ్రాయడం జరిగింది. మిగతా కథావస్తువు 1949 వ సంవత్సరంలో వ్రాసింది యథాతథంగ వుంచాను.

— రచయిత.

# 1

పాడుబడ్డ భూముల్లో మురికి గుంటల్లో ఆ పల్లెను నిర్మించారు. దయ్యాలు తిరిగే ప్రదేశంలో ఆ ప్రజలు కాపురం చేస్తున్నారు. వారిని గ్రామానికి దూరంలో వుండాలని ఎవరో ఏనాడో శాసించారు. మనిషికి మనిషికి మధ్య అంటు భేదం సృష్టించారు. భావుల్లో నీళ్ళు తోడితే నేరం. పేరుని పిలిపించుకోడానికి నోచుకోని నిర్భాగ్యులు. రెక్కాడితేగాని డొక్కాడని నికృష్ట పేద ప్రజలు. సమాజంలోని కొద్దిమంది స్వార్థపరుల భోగలాలసాలను కాపాడడానికి రచించిన రాజకీయ, ఆర్థిక శాస్త్రాలు వాళ్ళ విద్యా బుద్ధుల్ని అరికట్టి అజ్ఞానాంధకారంలో వుంచాయి. అబ్బా! ఏమి సమాజము. ఒక్క గ్రామంలో ఎన్నిమతాలు! కులాలు, ధనికులు, పేదలు, స్వార్థం, మోసం, దోపిడి సమాజాన్ని సవాలుచేసి పాలిస్తున్నాయి. ఆ పల్లె ప్రజల్ని ఆదిలో ఛండాలురని, పంచములని పిలిచేవారు. తరువాత మాల మాదిగలుగ వ్యవహరిస్తున్నారు. పల్లెల చుట్టు సారవంతమైన భూములు, పచ్చిక బయిళ్ళు వున్నాయి. ఆ పొలాల్లో కూలిపని చేయడానికే వారికి హక్కు వుంది. పొలాలు వారివి కావు.

పల్లెకు కొంచెం దూరంలో కృష్ణా జలాలతో నిండిన పెద్ద పంటకాలువ ప్రవహిస్తుంది. పల్లెలో మొత్తం మూడు

వందల యిండ్లున్నాయి. ఇండ్లన్నీ తాటియాకులతో కప్పబడినవే. కొద్దిమందిగ వున్న క్రైస్తవులు మాత్రం మిషనరీల సాయంతో పెంకుతో నేయబడిన చక్కని దేవాలయాన్ని కట్టించుకున్నారు. నడిబజారులో వయస్సుమళ్ళిన పెదఅంకమ్మ చెట్టు వుంది. ఆ చెట్టు పెదగాలివానకు పూర్వం కొన్ని సంవత్సరాల ముందే పడిమొల్చి వూహించలేనంత పెద్దదయింది. ఆ చెట్టు వద్దనే పల్లెలో భయంకర వ్యాధులు వ్యాపించినప్పుడు అమ్మవారికి కొలుపులు, జాతర్లు చేస్తుంటారు. లెక్కలేనన్ని ఎనుబోతులు, మేకలు ఆ చెట్టు క్రిందనే అమ్మవారికి బలియివ్వబడ్డాయి. పశువుల బలితో ప్రజల రోగాలు పోకపోయినప్పటికి, ఆ అంకమ్మ చెట్టు క్రింద పశువుల వధవల్ల కారిన రక్తంతో ఆ చెట్టు మరింత చావఎక్కింది.

పల్లెలో ఒకే ఒక ఎలిమెంటరీ పాఠశాల వుంది. ఈ బడిలో ఒకే ఒక పంతులు, పంతులమ్మ పనిచేస్తు వుంటారు. ఇద్దరు టీచర్లు కలిసి పది పదిహేను మంది పిల్లల్ని ముందర కూర్చోబెట్టుకొని చదువు చెప్పుతూవుంటారు. పల్లెలోని మిగతా పిల్లలంతా చిన్నపాలేళ్ళుగ, గొడ్ల కాపరులుగ జీవితం సాగిస్తుంటారు.

రామయ్యాది పిల్లలుగల సంసారం. అప్పటికే నలుగురు మగపిల్లలు ముగ్గురు ఆడపిల్లలు. రామయ్య భార్య పేరు సీత. యీమెకు యింకా అరడజను పిల్లల్ని కని పెంచడానికి కావాల్సిన వయస్సు ఆరోగ్యము వుంది. రామయ్య పల్లె కంతటికి పెద్ద – యీ పెద్ద మాలతనం తన కుటుంబానికి వంశానుగతంగ

సంక్రమిస్తూంది. కడుబీదవాడు. కూలివలన జీవనం. వ్యవసాయపు పనులు లేనిరోజుల్లో రామయ్య యింటిలోని స్త్రీ-పురుషులు చేనేత మగ్గాల మీద చీరెలు, ధోవతులు తయారుచేసి జీవనం చేస్తుండేవాళ్ళు. మిల్లు బట్టల పోటీకి, ఇంగ్లీషు వాడి వ్యాపారపు నక్కజిత్తుల మోసపు తెలివితేటల పుణ్యాన చేనేత పరిశ్రమ దేశంలో దెబ్బతింది. అనేక చేనేత మగ్గాలు మూలబడ్డాయి. రామయ్య మగ్గానికి కూడ అదేగతి పట్టింది. చివరకు మగ్గాన్ని లాకల్ని అమ్ముకుని పూర్తిగ వ్యవసాయ కూలిగ మారిపోయి జీవనాన్ని కూలినాలి పనుల వలన సాగిస్తున్నారు.

రామయ్య పెద్దకుమారుడు జగ్గయ్య. పదేళ్ళకుపైగా వయస్సుంటుంది. ఏడు సంవత్సరాలు నిండిన తరువాత బడికి పంపబడ్డాడు. 'అ ఆ 'లు వచ్చినంత త్వరితంగా 'ఇ ఈ' లు జగ్గయ్యకు రాలేదు. ఈ రెండక్షరాలు తప్పుగ వ్రాసినందుకు బడిపంతులు తీవ్రంగ కొట్టాడు. కొట్టిన సందర్భంలో పంతుల్ని బూతుమాట అన్నాడు. దీని ఫలితంగ గోడకుర్చి, పైకి వ్రేలాడ గట్టటంలాంటి కఠిన శిక్షలకు గురిఅయ్యాడు. అక్షరాలు పూర్తిగ రావడానికి చాలకాలం పట్టి పేరుల్లో ప్రవేశించాడు. కొంతకాలానికి రెండవ తరగతిలో ప్రవేశించాడు. ఈ తరగతిలో మంచి తెలివితేటలు ప్రదర్శించాడు. మూడవ తరగతి మధ్యలో ప్రవేశించాడు. జగ్గయ్యకు పెంకితనం మహాలావు. ఆటలంటే బహు చెడ్డ సరద. తనతోటి పిల్లలందరితో ఆడినంతసేపు ఆడి, జగ్గయ్య ఓడిపోయేటట్లున్నా లేక అవతలి వాడు జగ్గయ్య విజయాన్ని చూచి ఆట విడిచిపోడానికి ప్రయ

త్నించిన జగ్గయ్యకు తన పోటీదారులతో తగవు తప్పదు. ఈ పోట్లాటలు అమ్మ, అక్క, ఆలి బూతులతో ప్రారంభమయి చివరకు ఒకరినొకరు తీవ్రంగ కొట్టుకునేటంత వరకు పోతుంటాయి. జగ్గయ్య అనేకమంది పిల్లల చేతిలో చావుదెబ్బలు తిన్నాడు. మరికొంతమందిని తీవ్రంగ కొట్టాడు.

పల్లెలలోని పిల్లల జీవితం మహా దారుణంగావుంటుంది. ఒంటినిండా గుడ్డవుండదు. అధిక సంఖ్యాకులు గోచిపీలికలతో తిరుగుతుంటారు. రెండుపూటలు తినడానికి యింటివద్ద తిండి దొరకదు. ఒకేయింట్లో నలుగురు పిల్లలుంటే వారిలో వారు పోట్లాడుకుంటు, బూతులు తిట్టుకుంటారు. వీరిని సముదాయించడానికి తలిదండ్రులకు తగిన విశ్రాంతి సమయము దొరకదు. పిల్లలతో బాధపడలేక బజారువెంట ఆడుకోమని పంపుతారు. బజార్లవెంట యీ పిల్లలు కూనిరాగాలు తీసుకుంటు, అతి మొరటు ఆటలాడుకుంటు, చెట్లవెంబడి కాయ కమ్మ తింటు కాలక్షేపం చేస్తుంటారు. పల్లెల్లోని అధిక సంఖ్యాక పిల్లల జీవితం పందుల జీవితంకంటె కొంచెం మెరుగు అని చెప్పడం ఏమాత్రం అతిశయోక్తి కాదు.

జగ్గయ్యకు గోలీకాయలు, బిళ్ళంగోడు, చెడుగుడు, చెరపట్టి ఆటలంటే బహు సరదా. ఉదయం, సాయంత్రం బడికి పోతుంటాడు. మధ్యాహ్నం వాళ్ళకున్న రెండు గేదెల్ని మేపుకొస్తుంటాడు.

నాట్లు వేయడం పూర్తి అయింది. వర్షాలు పడుతూనే వున్నాయి. ఊడ్పులు అయిన కొన్ని దినాలవరకు రామయ్య

కుటుంబం రెండు పూటలూ గంజో కడుగో త్రాగుతూనే వున్నారు. ఇంటి కప్పు వర్షానికి తట్టుకోలేకపోయింది. మట్టి గోడలు వర్షానికి నాని అక్కడక్కడ పెల్లలు పెల్లలుగ విరిగి క్రిందబడిపోతున్నాయి. సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు మాసాల్లో యీ ప్రాంతపు కూలీలకు పనులుగాని, మరితర పనులుగాని దొరకవు. రామయ్య కుటుంబం కొన్నిదినాలు ఒకపూట తిండితో కాలంగడిపారు. అర్ధాకలితో అవస్థపడుతున్న పిల్లల స్థితి చూడలేక రామయ్యకున్న రెండు గేదెల్ని తన అవసరాన్నిబట్టి తక్కువధరలకే అమ్మివేశాడు. యీ డబ్బు చేతికి వచ్చిరావడంతో పాతబాకీలవాళ్ళు వచ్చి కంఠం మీద కూర్చున్నారు. కొన్ని బాకీలు తీరగ మిగిలిన కొద్ది డబ్బుతో కొన్నాళ్ళు సంసారాన్ని పోషించాడు. అంతలోనే కార్తీకమాసం వచ్చింది. కార్తీకమాసంలోని అన్నిదినాలు కూలీలకు బహు గడ్డురోజులు. వేలకొలది కూలి కుటుంబాలు కటిక పస్తులతో కాలంగడపాలి. యీ రోజుల్లోనే ఆకలి బాధకుతోడు రకరకాలైన భయంకరమైన జబ్బులు వ్యాపిస్తూ వుంటాయి. వడ్డీవ్యాపారులు, భూస్వాములు యీ మాసాన్ని తమపాలిటి దేవతగ భావిస్తారు. మానెడు గింజల అప్పుకు అరమాసికె నాము పద్ధతిపై భూస్వాములు వ్యవసాయ కూలీలకు అప్పుగ ధాన్యం యిస్తారు. ఇళ్ళు, వాకిళ్ళు తాకట్టు పెట్టించుకుంటారు. రూపాయికి అణా, బేడ వడ్డీలతో కూలీలకు అప్పులు పెట్టి వారి భార్యల మెడలోని పుస్తెలు వడ్డీ వ్యాపారస్తులు త్రెంచుకుపోతుంటారు. యీ నెలపేరే కరువు మాసం అని పిలిస్తే బాగుంటుంది. ఈ నెలపేరు వింటే పసి

పాపలు పాలు త్రాగరు. వయోవృద్ధులకు గుండెలు జారిపో తాయి. గ్రామీణ ప్రాంతంలోని కొలది భూస్వామ్య దోపిడి గాళ్ళకు ధనరాసులు క్రుమ్మరించి పేదప్రజలకు ఆకలి బాధలు, అంటుజాడ్యాలు ప్రసాదించి తరలిపోతుంటుం దీ కార్తీక మాసం.

వందల ఎకరాల భూస్వామి బాపయ్య. ఆ గ్రామంలో బాపయ్యను మించిన మోతుబరి యింకెవ్వరు లేరు. మొత్తం భూమిలో మూడు వంతులకు పైగా మాగాణి భూములు. కృష్ణానది ప్రసాదించే దివ్య జలాలతో యీ భూముల్లో బాపయ్య బంగారంలాంటి పంటలు పండిస్తాడు. మిగతా మెట్ట పొలాల్లో పసుపు, పొగాకు లాంటి వ్యాపార పంటలు పండిస్తాడు. బాపయ్య యింట్లో డబ్బు విపరీతంగా మూల్గు తుంది. ఆయన యింట్లో వున్న బంగారాన్ని గూర్చి నమ్మ శక్యంగాని కథలుకూడ వ్యాప్తిలో వున్నాయి. దివ్యమైన మూడంతస్తుల మేడ స్వగ్రామంలో వుంది. గుంటూరు, బెజ వాడ పట్టణాల్లో పెద్ద మేడలు కట్టించి అద్దెకొంపలుగా మార్చాడు. తనకున్న పొలంలో కొంతభాగాన్ని స్వయంగా నే పాలేళ్ళ సాయంతో సేద్యం చేయిస్తాడు. మిగతాది కౌలుకు యిచ్చి పొలాలమీద లాభాలు గడిస్తాడు. బాపయ్య యింత పెద్ద డబ్బు కూడబెట్టడానికి, భూములు కొనడానికి మూలం వడ్డీవ్యాపారం, నాము, జట్టీలు. బాపయ్య భార్య పేరు సరళాదేవి. వీరికి ఒకే ఒక కుమార్తె గలదు. ఆమె పేరు స్వర్ణకుమారి. సరళాదేవి బాగా వెనకబడిన మెట్టప్రాంతా నికి చెందిన ఒక ధనిక భూస్వామి కూతురు. సరళాదేవి వివా

హానికి సంబంధించిన ఒక చిన్నకథ గ్రామస్తులు నేటికీ చెప్పు కుంటుంటారు.

సరళ యుక్తవయస్సులోనే అంతపెద్ద అందగత్తె కాదట. ఆమె తండ్రి పెద్ద కట్నాలు ఆశ చూపించినప్పటికి వచ్చిన సంబంధాలు ఆమె అందవికారాన్ని చూచిన తరువాత తిరిగి పోయారు. సరళ చెల్లెలు అందగత్తెట. ఆమెకూడ యుక్త వయస్సు వచ్చి పెండ్లికి సిద్ధంగావుంది. సరళకు వయస్సు నానాటి ముదిరిపోవడం, పెద్దపిల్లవలన రెండో అమ్మాయి పెండ్లి ఆగిపోవడం తలిదండ్రులను తీరని ఆందోళనకు గురిచే శాయి. సరళకు పెండ్లికాదనే భయం తలిదండ్రుల్లో వ్యాపిం చింది.

బాపయ్య అందగాడే. తగిన కట్నాలు రావడంలేదని ఆయన తలిదండ్రులు వయసు ముదిరినదాకా పెండ్లికి తలపడ లేదు – సకాలంలో బాపయ్య పెండ్లి జరగకపోవడం వలన చెడుగా తిరిగి స్త్రీ సంబంధమైన చిలిపిజబ్బులు తెచ్చు కున్నాడు. బాపయ్యకు వచ్చిన ఒక జబ్బుకు సకాలంలో వైద్యం చేయించియుండకపోతే పక్షవాత జబ్బుకు గురిఅయ్యే వాడు.

కొంతకాలానికి సరళాదేవి సంబంధం బాపయ్యకు కుది రింది. తండ్రి అనుకున్న కట్నంకూడ యివ్వగల కుటుంబం అని తేలిన తరువాత పెండ్లి రాయబారాలు పెండ్లికూతుర్ని జూయించకుండ కట్నాలు, కానుకలమీాద సాగాయి. పెండ్లికి ముందు తనకు కాబోయే భార్యను ముందుగా చూడాలని పట్టు

బట్టాడు. దీనితో సరళ తలిదండ్రులకు పెద్దచిక్కు ఏర్పడింది. బాపయ్యకు సరళాదేవి చెల్లెల్ని చూపించి తనకు కాబోయే భార్య ఆమెయే అన్నారు. బాపయ్య యిష్టపడ్డాడు. తీరా పెండ్లిపీటలమీద కొచ్చేటప్పటికి సరళాదేవి ప్రత్యక్షమయింది. పెండ్లికూతుర్ని ఒకర్ని చూయించి మరో అందవికారపు అమ్మాయిని పెండ్లికూతురుగ కూర్చోబెట్టారని, యీ పెండ్లి మాకవసరం లేదని బాపయ్య, పెండ్లిపెద్దలు ఎదురుతిరిగారు. సంసార పక్షాన పోయే పెద్దమనుషులు పెండ్లివారి తగువులో తలదూర్చారు. పది అబద్ధాలు ఆడిఅయినా సరే ఒక సంసారాన్ని నిలబెట్టాలన్నారు. చాకచక్యంగా తగువు సర్దారు. అనుకున్న కట్నంకన్న ఎక్కువ డబ్బు, పొలం పెండ్లిపందిట్లోనే బాపయ్యకు వ్రాసియిచ్చారు. పెండ్లి అయిపోయింది.

అంతపెద్ద అందగత్తె కానప్పటికి పెండ్లి అయిన కొలది దినాలకే సరళ భర్తగారి ఆదరాభిమానాలను, విశ్వాసాన్ని చూరగొంది. డబ్బు సంపాదనకు అవలంబించే పద్ధతుల్లో భార్యాభర్తలకు ఏకాభిప్రాయం కుదిరింది. వారి జీవిత ఆశయం, అంతిమం ధనార్జన. ఈ ధనార్జనాతృష్ణే వారిని విడదీయలేని దంపతులుగ మార్చింది. అది సద్గుణంగాని, దుర్గుణంగాని, అది తనకు పదిరూపాయలు సంపాయించిపెట్టాలి. అలాంటి అన్ని గుణాల్ని సరళాదేవి ఆ ధనార్జనకు అలవర్చుకుంటుందంటే ఆమెకున్న మానవత్వాన్ని గూర్చి, నైతిక పరిమాణాల్ని గూర్చి మరి వేరే చెప్పనవసరంలేదు. డబ్బు కూడబెట్టడానికి తోడ్పడని యితరపనులు, పద్ధతులు ఆమె దృష్టిలో విలువలేనివి.

ఆ సంవత్సరం ఆడపిల్ల పెండ్లి చేయడంతో రామయ్య కుటుంబం అదనపు ఆర్థిక యిబ్బందులకు లోనువాల్సివచ్చింది. పెండ్లికి రెండువందల రూపాయిలు ఖర్చుపెట్టాడు. రామయ్య బ్రతుక్కి యిది చాలా పెద్దమొత్తం. అల్లుడుకి కట్నం యివ్వ లేదు. అసలు వ్యవసాయ కూలి కుటుంబాల్లో కట్నాలు ప్రధానం కాదు. కాబోయే వధూవరు లిద్దరికి ఈడు జోడు అవునో కాదో చూస్తారు. యిద్దరూ కష్టపడి పనిచేయగలరా లేదా అన్న విషయానికే ఎక్కువ ప్రాధాన్యత యిస్తారు. అసలు కట్నాలు పూర్తిగ నిషిద్ధంకాదు. ఆచారానికి ఏదో కొంత డబ్బు అల్లుడికి కట్నం క్రింద యివ్వాలి. రామయ్య యీ ఆచారాన్ని గౌరవించడానికి తన అల్లుడికి పదహారు రూపాయలు కట్నంక్రింద యిచ్చాడు. పెండ్లినాడు విధిగ యింటికొక మనిషికైన భోజనం పెట్టితీరాలి. పెద్దలకు కల్లు సారా త్రాగబోయించాలి. కాస్త చేమెల్లా వున్నవారు పందుల్నికోసి భోజనాలు పెట్టాలి. పేండ్లికి వచ్చిన పెద్దలు, చుట్టాలు తమకు తోచినంతమేరకు కట్నాలు చదివించి, వధూ వరుల్ని ఆశీర్వదించిపోతారు. విపరీతమైన వడ్డీలకు డబ్బు తెచ్చి యీ పెండ్లిండ్ల సందర్భంలో వృధాఖర్చులు పెడతారు. యీ విధంగ ఖర్చుపెట్టకపోతే సంఘం ఒప్పుకోదు. ఖర్చుపెట్టడానికి తిరస్కరించిన కుటుంబాల్నిసంఘంనుండి వెలివేస్తారు. వారితో పలకరు. బావినీళ్ళకు రానివ్వరు. తల్లిదండ్రుల మూర్ఖత్వంతో సంఘం కట్టుబాటుల్ని గౌరవించడానికి పెండ్లిసందర్భాల్లో ఖర్చుపెట్టే డబ్బు, అందుకయిన అప్పులు తీర్చే బాధ్యత నూతన వధూవరులమీద పడుతుంది. ఈ అప్పుల భారాన్ని

తీర్చడానికి సంసారజీవితములో వేళకు సుఖం, సంతోషం లేక యిద్దరు - ముగ్గురు పిల్లలు పుట్టేదాకా భూస్వాములవద్ద పాలేళ్ళుగ ఊడిగం చేస్తూనేవుంటారు.

కూతురు పెండ్లి అయిపోయిన కొన్ని దినాలకే రామయ్య కుటుంబం కరువువాత బడింది. బిడ్డలతో సహా పస్తులుపడివుండాల్సి వచ్చింది. భార్యాభర్త లిద్దరే పస్తులకు లోనుగావాల్సివస్తే వారికి అది పెద్దసమస్య కాదు. వారి జీవితంలో పస్తులున్న రోజు లున్నాయి. ఆ రోజుల్లో వారు యౌవ్వనంలో వున్నారు. భార్య రామయ్య బీదతనాన్ని గూర్చి కొంచెంకూడ మాటల సందర్భంలో ఎప్పుడూ ఎత్తిపొడిచేది కాదు. ఆకలి మంటలతో కాలంగడపాల్సిన రోజున ఒకరి నొకరు చూచుకుంటూ, ప్రేమ గేయాలు పాడుకుంటూ, ఛలోక్తులతో జీవిత భారాన్ని తేలిక జేస్తూ ఆనందంగా కాలం గడిపారు.

ఇపుడు పస్తులుండాల్సింది వారిద్దరే కాదు. పిల్లలు పుట్టారు. దీనితో నూతన బాధ్యతలు వారిపైబడ్డాయి. 'అమ్మా బువ్వ, అయ్యా బువ్వ' అని అడిగిన పిల్లలకు తిండిపెట్ట లేని తలిదండ్రుల హృదయాలు ఎంతవరకు క్రుంగిపోతాయి—ఆ తల్లిదండ్రుల మానసిక వ్యధ ఆందోళన తెల్లకాగితంమీద మరే సిరాతోగాని వర్ణించడం సాధ్యంగాని పని.

అప్పటికి రామయ్య కుటుంబం మొత్తంగ రెండురోజుల నుండి పస్తులుపడి వుంటుంది. పిల్లల స్థితిని చూచిన తల్లి హృదయం తరుక్కుపోతుంది.

భార్య :- ఏం - మామ యీ పిల్లల ఆకల్ని ఏదోవిధంగా తీర్చాలి —— లేకపోతే నేను ఏ నుయ్యో గొయ్యో చూచుకుంటాను.

రామయ్య :- నీవు చూస్తున్నావు గదా, నన్నెక్కడ దిగిచానమంటావు.

భార్య :- ముష్టి ఎత్తైనా పిల్లల సొద తీర్చాలి. వాళ్ళసొద నేను చూడలేను. వాళ్ళతో కట్టగట్టుకొని నూతిలోపడతాను.

రామయ్య :- ఓసి! సీ అమ్మనాయాలిదాన యింతమాత్రానికే చచ్చి మనం సాధించేదేమిటే. అలాగే పంట్లుబిగబట్టుకొని కొన్నాళ్ళుబ్రతకాలి. రోజులెప్పుడు యిలాగేవుంటాయా. ఏనాటికైనా మంచిరోజులు రాకమానవు - మనకు పుట్టిన యీ బిడ్డల్లో ఎవడెంత గొప్పవాడవుతాడో ఎవడికి తెలుసు - మన జగ్గణ్ణిచూడు - వాడికి రాజ్యాన్ని ఏలడానికి కావలసిన రాజకీవి వుంది.

భార్య :- వేదాంతం కట్టిపెట్టండి. ముందు నాపిల్లల ఆకలి బాధ తీర్చి వాళ్ళను బ్రతికించండి.

రామ :- రామ...రామః..నే నే గంగలో దిగేది. నన్ను యిల్లెల్లపాది యిలా పీక్కుతినడం మొదలెడితే నేనేం చేయగలను. అంత ఓపిక లేకపోతే నన్నే పీక్కుతినండి.

రామయ్య నిస్సహాయ స్థితిని చూచిన భార్య ఆయన కాళ్ళమీదపడి ఏడ్వసాగింది. పిల్లలంతా ఒక్కుమ్మడిగా

గొల్లున ఏడ్చారు. రామయ్యకు ఒళ్ళంతా దట్టమైన చమట పోసింది. కళ్ళు గిర్రున తిరుగుతున్నాయి. సీత చెంబుతో నీళ్ళు తెచ్చి రామయ్య ముఖానకొట్టి పమిటచెంగుతో ముఖం శుభ్రంగా తుడిచింది. రామయ్యకు బాగా తెలివి వచ్చింది. మరో చెంబెడు నీళ్ళు నోటివద్ద పెట్టి త్రాగించింది. తరువాత రామయ్యలో కొంచెం శక్తి, తేజస్సు కనబడింది.

బాపయ్య ఆరోజే తలవని తలంపుగ మాలపల్లె వచ్చాడు. బాపయ్య పల్లెరావడం యిది మొదటిపర్యాయం మాత్రం కాదు. ఆయన పొలాలు పల్లెచుట్టు వున్నాయి. పల్లెలో ఏదైనా తగవులు పొడచూపితే వాటిని పెంచి పోషించి శాశ్వతంగా ఆ ముఠాల్ని తగవుల్ని నిలబెట్టడంలో అందెవేసిన చెయ్యి. పల్లె వచ్చినపుడల్లా పల్లె పెద్దల్ని పిలిపించి తను పెట్టిన బాకీలు యివ్వడంలో జాప్యంచేస్తున్న వారి పేర్లుపట్టి చదివి మీ పల్లెలోనే యిన్ని బాకీలు మిగిలిపోతే వచ్చే కరువు రోజుల్లో మిమ్మల్ని పోషించే బాధ్యత నాది కాదంటూ బుకాయింపులు, బూతులతో కూడిన వుపన్యాసా లిస్తుంటాడు. బాపయ్యకు ఒక గొడ్లకాపరి కావలసివచ్చాడు. రామయ్య కోసరం కబురంపాడు. రామయ్య బజారు కెళ్ళినపుడల్లా జగ్గయ్య తండ్రిచేయి పట్టుకొని వెంట వెళుతుంటాడు. పిల్లాడితో రామయ్య భూస్వామి ఎదుట ప్రత్యక్షమయ్యాడు.

బాపయ్య :- ఒరే రామా - యీ బుడ్డాడెవడురా?

రామ :- నా పెద్దకొడుకు దొర.

బాప :- ఎన్ని సంవత్సరా లుంటా యేమిటి?

రాము :- సంవత్సరాల సంగతి నాకేమి తెలియదు దొర - మీ జీతగత్తెకయితే ఖండితంగా తెలుసు - చినగాలివాన పోయిన రెండో వారంలో పుట్టినట్లు నాకు గుర్తు.

బాప :- కాలికి చేతికి అక్కరకొచ్చే పిల్లవాణ్ణి అన్యాయంగా బజార్ల వెంట తిప్పి పాడుచేస్తున్నావు.

రాము :- వాడిప్పుడు మూడో క్లాసులో వున్నాడు దొర. వాడిని కనీసం ఐదు కళాసులు చదివించాలని మా ఆడదాని పట్టుదల.

బాప :- అగోరించావులే - మింగడానికి మెతుకులు లేని వాడికి మీసాలకు సంపెంగనూనె అన్నట్లుంది నీ వ్యవహారం. రేపటినుండి మనదొడ్లో పడేయి. గంజో - కడుగో తాగి మన గొడ్లని మేపుకొస్తాడు. చిత్తం బాబయ్య - చిత్తం. మీ కోర్కెప్రకారమే. ఇంటికి లేచిపోతున్న బాపయ్య వెంట రామయ్య వెంబడించాడు. మంచి పొగాకు తునక ఒకటి రామయ్య చేతుల్లో వేశాడు - 'చేబ్రోలు పొగాకులా వుంది' దొర- నీ ముఖం - నీ మొహం యిది ఒకటోరకానికి చెందిన నాణ్యమైన గూడవల్లి పొగాకు.

ఇంటికివెళ్ళిన వెంటనే ఇరవై మానికల గింజలు కొలిపించి రామయ్య కిచ్చాడు. వడ్ల మూట నెత్తినేసుకుని రామయ్య యింటికి బయలుదేరాడు.

నాలుగు మానికలు వడ్లు రోట్లోపోసి భార్యాభర్తలిద్దరు కచ్చాపచ్చిగ దంచుకున్నారు. ఉడుకు ముడుకు గొం

తులు కాల్చుకుంటూనే సంతృప్తిగా భోంచేశారు. పిల్లలందరూ మామూలువేళకంటే ముందే సొక్కి నిద్రపోయారు. రామయ్య చుట్ట చుట్టుకుంటూ 'అపనా తనామనా ఓరోరి భైరన్న' అంటూ కూనిరాగం పాడుకుంటూ నిప్పుకోసరం పొయ్యిదగ్గర కెళ్ళాడు. సీత యిల్లంతా సముదాయించుకుని కోళ్ళను జాగ్రత్తగా కప్పేసి, యింటికి తడిక కట్టి మామూలు పిచ్చాపాటికబుర్లకోసరం భర్తముందర కూర్చుంది. రామయ్య ఏదో ఆలోచనలో చుట్ట పొగాకు నిషాలో తన్మయం చెందుతున్నాడు. సీత వెనకాలగ వచ్చి క్రింది పీట లాగింది. వెనక్కి పడబోయే రామయ్యను సీత పట్టుకొంది.

ఓసి నీ అమ్మనాయాలిదాన - నడుం విరగ్గొట్టేదాని వీ పాటికి - యింకా నీలో చావ చావలేదు. ఇద్దరూ కొంచెం సేపు నవ్వుకున్నారు. 'నీకొక మంచిమాట చెబుతాగాని యిటురా' అంటు భార్య భర్త లిద్దరు పిల్లలకు కొంచెం దూరంగా చాపమీాద పండుకొని మాటలు సాగించారు.

ఆ మంచిమాటేదో వున్నదన్నావుగ - అది చెప్పు. అది చెప్పినదాకా నిన్ను నిద్రపోనియ్యను.

రామ :- మన పెద్దోడ్ని బాపయ్య దొడ్లో కమతానికి కుదిర్చాను. రేపటినుండి యిక మనకు కసువు తీరినట్టే.

సీత :- ఆ...! ఏమ్మాట——ఎక్కడిమాట - నా పిల్లాణ్ణేమిటి జీతానికి పెట్టడం ఏమిటి. కావాలంటే నీవుండు - నీవాళ్లు ఎవరయినా వుంటే జీతానికి పెట్టుకో. నా పిల్లాణ్ణి మాత్రం ఆపనికి పంపను.

రామ :- బాపయ్యదొరకు మాటయిచ్చానుగ—

సీత : ఎవరన్నడిగి చెప్పావు — ఎందుకు చెప్పావు.

బోడిముండా నిన్నడగాలే- యీ యిల్లు నాది; యింట్లోని ప్రతివాళ్ళు నేను చచ్చేవరకు నామాట వినాలి. నా బిడ్డల్ని జీతానికే కాదు — గంగలో పారేస్తాను. అడ్డం వచ్చే వాళ్ళెవ్వరో రండి- వాళ్ళనుకూడ గంగపాలు చేస్తాను. నీకు యీ యింట్లో పెత్తనం చేయాలని వుంటే నేను చచ్చిన తరువాత సాగిద్దువుగానిలే.

సీత తన భర్తమాటకు ఎప్పుడూ ఎదురుచెప్పి ఎరుగదు. రామయ్యకూడ తన భార్యకు యిష్టంలేని పని అట్టే చేసి ఎరుగడు. తనకు కుర్తున్నంతవరకు ఎన్నడు పుల్లవిరిచి భార్యపై వేయలేదు.

తన కొడుకు భవిష్యత్తుతో రామయ్య చెలగాట మాడుతున్నాడనే భయంతోనే ఆమె భర్తకు ఎదురు మాట్లాడవలసి వచ్చింది. సీత తన కుమారుణ్ణిగూర్చి ఎన్నో తియ్యటి కలలుగంది. తన కొడుకు బడిపంతులవుతాడని, తరువాత పంతులమ్మను పెండ్లిచేసుకుంటాడని,వాళ్ళిద్దరు సుఖ జీవనం చేస్తూ పిల్లల్నికంటే ఆ పిల్లల్ని సాకే బాధ్యత తను స్వీకరించాలని యింకా మరెన్నో పగటి కలలు కంది. ఆ దే పల్లెలో నలుగురు ఆడపిల్లలు, ముగ్గురు మొగపిల్లలు మిషను బోర్డింగులో చదువుకుంటున్నారు. వాళ్ళంతా క్రిస్టమస్ పండుగకు యింటికి వస్తారు. సెలవు దినాల్లో తెల్లటి పైజామాలు, బారుచేతుల చొక్కాలు వేసుకొని కనులపండుగ్గా

పల్లెలో ముచ్చటగా తిరుగుతారు. ఆదివారంనాడు గుడికి వెళ్ళి మంచి సంగీతంతో పాటలు పాడుతారు. సాయంత్రం ఆటలాడుకుంటారు. సీత బిడ్డలుకూడ యిలాగే బోర్డింగుల్లో చదువుకోవాలని, సెలవులకు యింటికి వచ్చినపుడు తన బిడ్డల విద్యావిశేషాల్ని గూర్చి నలుగురు పొగడుతూ మాట్లాడు కోవాలని ఆమె కోరిక. విద్య అనేది ఎంత మూల్యం చెల్లిస్తే లభ్యమవుతుందో సీతకు అర్థంకానప్పటికి నేటి విద్యావిధానం బీదవారికి ఏమాత్రం అందుబాటులో లేదని అమె స్వానుభవం ద్వారా ఆమె బీదతనం ఆమెకు తెలియచెప్పింది.



## 2

గొడౌంలో వీధి వీధికి పరుగులు కొడుతూ కేరింతలు వేస్తూ జగ్గయ్య స్వేచ్ఛావాయువులు పీల్చలేదు. పాపము జగ్గయ్య స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను విద్యాబుద్ధుల్ని ఉరి కట్టింది ఎవరో—ఏమిటో స్పష్టంగా తెలియదు. పాడుసమాజం. ముక్కుపచ్చలారని పసిగందుల్ని రొచ్చుతీయించడానికి పంపిస్తుంది. సూర్యుని మిట్టమధ్యాహ్నపు ఎండ వేడిమి కిరణాలు ఆ నలిగంగు లేతమోమును తాకిగాని యిక భూమిపై పడవు—వంటికి విశ్రాంతి, మనస్సుకు శాంతిసుఖాలు లేని కఠినమైన శక్తికిమించిన పనుల్లో ప్రవేశించబోతున్నాడు జగ్గయ్య.

అది లక్ష్మీవారం. సీత యిల్లు వాకిలి చక్కగ అలంకరించింది. నానవేసిన బియ్యంలో కొబ్బరిముక్కలు బెల్లం కలిపిన ఫలహారాన్ని తయారుచేసి పెద్దలకు పిన్నలకు పంచారు. రెండు కొత్త గోచిగుడ్డలు, రెండు కండవాలు జగ్గయ్యకు కొన్నారు. ఇంట్లో ఒక పెద్ద అయిరేడు బాన వుంది. బానకు ఎదురుగా వున్న గోడకు రెండు మూడు రకాల దేవుళ్ళ బొమ్మలు – తెల్లటి గోడకు పసుపు కుంకుమ వ్రాసిన చోట వెంకటేశ్వరస్వామి పంగనామాలు పెట్టారు. నిప్పుల కుంపటి నిండా సాంబ్రాణిపొడి చల్లారు. ఇల్లంతా సాంబ్రాణి పొగ. సీత కంటివెంట కారే నీళ్ళు తుడుచుకుంటూ దేవుడికి

సాష్టాంగ నమస్కారం పెట్టి జగ్గయ్యచేతకూడా అదేపని చేయించింది. తన కొడుక్కి ఆయురారోగ్యాలు ప్రసాదించ వలసిందిగా తన యిష్టదేవతల్ని ప్రార్థించింది.

జగ్గయ్య చేత్తో కర్రబట్టాడు. క్రొత్త కండవ భుజాన వేశాడు. నల్లటి దేహానికి ఎర్రటి మొలత్రాడు, తెల్లటి గోచి గుడ్డ జగ్గయ్య దేహానికి నూతన శోభ కలుగచేసింది. జగ్గయ్య బయలుదేరబోయేసరికి ఎవరో తుమ్మారు. ఆ తుమ్ము మంచిదికాదన్నారు. కొంచెంసేపు ఆగాడు. తీరా బయలు దేరి బజారుకు సాగనంపారు. ఒక విత్రంతువు, ఆమె వెనుక ఒక పిల్లి ఎదురొచ్చాయి. శకునం బాగుండలేదని మరలా ప్రయాణం కొంతసేపు ఆపారు. చివరకు ఎనిమిదిమంది పిల్లలుగల చల్లటి తల్లి నుదుట రూపాయంత వెడల్పు కుంకుమ బొట్టు తీర్చిదిద్దుకొని చేతిలో చెంబు పట్టుకొని జగ్గయ్యకు ఎదురు వచ్చింది. జగ్గయ్య, తండ్రి వెంటబడి బాపయ్య యిం టికి వెళ్ళాడు. జగ్గయ్య కాచుకోవాల్సిన పశువుల్ని, తను వూడ్చి శుభ్రంచేయాల్సిన చావడిని చూపించారు. "ఇదిగో అక్కడ నీ ముంత మల్ల దాచుకో– అదిగోఅక్కడ పండుకో– పలాన గేదె కొమ్ము విసురుతుంది – ఎల్లావు పొడుస్తుంది. గొడ్లను కొట్టేవుసుమా – చావడి అద్దంలా బాగుచేయాలి–" మొట్టమొదటి సారిగ జగ్గయ్యనుద్దేశించి బాపయ్య అన్న మాటలు –

రామయ్య తన బిడ్డను బాపయ్య భార్య సరళాదేవికి చూపించడానికి తీసుకెళ్ళాడు. అప్పుడే సరళ అనుకోనంత

త్వరలో పాలేరు దొరికినందుకు నవ్వుతూ బయటికి వచ్చింది. 'ఏం దొరసానమ్మా? నా బిడ్డణ్ణి నీచేతిలో పెడుతున్నా యిక నీ బిడ్డగా చూచుకోవాలి' అని అతి దీనంగా ప్రాధేయపడు కున్నాడు. "ఆరి తొత్తుకొడుకా నీవేనట్రా రాముడి కొడు కువి – ఎంతవాడి వయ్యావురా" అంటూ జగ్గయ్యవంక ఎగా దిగా తేరిపారచూచింది. తిండి లేని ఆ రామయ్య కుటుంబంలో అంత బలంగా, ఆరోగ్యంగా ఎలా పెరగ గలిగాడాని తనలో తాను విస్తుపోయింది. జగ్గయ్యను ఆ యింట్లో జగ్గయ్య అని ఎవరూ పిలవరు. అతడు జగ్గడుగా మారిపోయాడు. జగ్గయ్య కఱ్ఱ చేతబట్టాడు. నెత్తికి తట్ట ఎత్తాడు. ఈ గజిబిజి దోపిడి సమాజంలో రెక్కల కష్టంతో డొక్కసాధనానికి బయలు దేరాడు.

జగ్గయ్య పనిలో ప్రవేశించాడు. పనులన్ని శ్రద్ధగ నేర్చుకుంటూ యింటి యజమానుల ప్రేమాభిమానాలు చూరగొంటున్నాడు. వర్ష ఋతువు ప్రవేశించింది. పల్లెనుండి గ్రామానికి సరైన మట్టిరోడ్డుకూడ లేదు. మోకాళ్ళలోతు బురదలో గట్టుల వెంబడి పడుతూ, లేస్తూ గ్రామానికి చేరు కోవాలి. మొదటి రోజుల్లో జగ్గయ్య యమయాతనలకు గురి అయ్యేవాడు. తల్లి సీత కుమారుని తెల్లవారక ముందే లేపి ముఖాన్ని చన్నీళ్ళతో కడిగి పయిడిచెంగుతో శుభ్రంగా తుడిచి నిద్రమత్తు వదలిన తరువాత పనిలోకి ప్రయాణంచేసి పంపేది. తుపర తుపర చినుకుల్లో గోనెగూడ నెత్తిన తగి లించుకొని బురదలో జారిపోయే కాళ్ళను మునివేళ్ళమీద బిగ బట్టి వదిలి వదలని నిద్రమత్తుతో వూగులాడుతూ కఱ్ఱ భుజాన

పెట్టి వ్రాళ్ళోకి చేసుకునేవాడు. పనిలో ప్రవేశించిన మొదటి దినాలు జగ్గయ్యకు కష్టమనిపించినా రోజులు గడిచేకొలది పనులు చక్కగ చేయడానికి అలవాటుపడ్డాడు. బాపయ్య నోటి మంచితనంతో, చేతి భయంతో జగ్గయ్యను బాగా వుపయోగించుకోవడం తెలిసికున్నాడు.

ఆ యింట్లో వున్న పాలేళ్ళందరికన్న సరళా దేవి జగ్గయ్యను మిక్కుటంగా అభిమానిస్తుంది. సరళ చెప్పిన పను లన్నీ అతి వినయంగ ఆమె ఆశించినదానికన్న శుభ్రంగ తక్కువ కాలంలో చేసేవాడు. ఎంత అభిమానించినా అందరి పాలేళ్ళతో పాటు జగ్గయ్యకు రాత్రి మిగిలిన చద్దికూడు సాంబారు కారం తప్పదు. అయితే పండక్కి పబ్బాలకు జగ్గయ్యకు అదనంగ ఒకటో రెండో చప్పిడి పప్పు లెక్కువ యిచ్చి కాస్త నెయ్యి అధికంగ వేసి పెరుగుతో అన్నం పెట్టేది. పండగ పూట మిగతా పాలేళ్ళకు యీమాత్రం భోజనంకూడ వుండదంటే పాలేళ్ళకుపెట్టే తిండినిగూర్చి మనం తేలిగ్గా వూహించవచ్చు.

సరళకు చాలకాలం పిల్లలు పుట్టలేదు. తప్పుడుకుంచా లతో కూలీలకు గింజలు కొలుస్తుంది. అబద్ధాలాడుతుంది. కఠినమైన రోతపుట్టించే తిట్లు తిడుతుంది. పాపం పెరిగి పిల్లలు పుట్టడంలేదనే భయంతో అనేక పుణ్యక్షేత్రాలు భార్యాభర్త లిద్దరూ దర్శించారు. ఎన్నో నోములు, వ్రతాలు పట్టగ చివరకు ఒక ఆడపిల్ల పుట్టింది. బిడ్డ పుట్టిన తరువాత యింట్లో డబ్బు పెత్తనమంతా సరళచేతికి వచ్చింది. ఆమెతో

సలహా సంప్రదింపులు లేకుండా బాపయ్య ఏపని చేయలేని స్థితికి వచ్చాడు.

ఆ భూస్వామి యింట్లో జగ్గయ్య నిజంగ అతి నమ్మక మైన సేవకుడు. వర్షాకాలంలో సహితం పశువుల చావణ్ణి శుభ్రంగ వూడ్చి అద్దంలా వుంచేవాడు. చావట్లోని పశువు లన్నిటిని తన పశువులుగానే భావించి చిన్న లేగదూళ్ళకు చక్కటి ముద్దుపేర్లు పెట్టుకున్నాడు. అబద్ధాలాడడం, దొంగ తనం చేయడం జగ్గయ్యకు చిన్న తనంనుండి తెలియదు. ఆటల్లో ఎదుటివాళ్ళమీద ఓడిపోయే పరిస్థితులు వచ్చినపుడు ఓంగ్రించి కొట్టి, చెడుగుడులో రెండో పార్టీ పట్టేసినపుడు సెల తాకందే తాకేనని బుకాయించి చిన్న చిన్న అబద్ధాలా డడం లాంటి బలహీనతలు జగ్గయ్యలో లేకపోలేదు. ఎక్కువ సార్లు ఉన్నది వున్నట్లు మాట్లాడడమే అతని స్వభావం.

పగలెల్ల పనిచేసిన పాలేళ్ళు పల్లెకు చేరుకునేటప్పుడు జట్లులు జట్లులుగ కలసిమెలసి పాటలు పాడుకుంటూ, భూస్వా ముల ప్రవర్తనకు చెందిన కొన్ని యదార్థ గాథలు చెప్పు కుంటూ వస్తారు. సరదాపుడితే దారిలో చెడుగుడు చెరపట్టి ఆటలాడుతారు. పల్లెలో పండుగలకు, పబ్బాలకు ప్రదర్శించే వీధినాటకాలు, జంగంకథలు, తోలుబొమ్మలాటలే వీరి వినో దాలు. జగ్గయ్య పనిలోనుండి యింటికొచ్చేటప్పటికి కొట్టే సిన కట్టెలా అయిపోయేవాడు. ఇంటికొచ్చి కొన్ని గంటల సేపు నుక్కిమంచంలో ఆలాగే కూలబడి నిద్రపోయేవాడు. సీత పనికిపోయి ప్రొద్దస్తమించిన తరువాత యింటికొచ్చేది.

అందువలన రాత్రిపూట భోజనం వేళకు తయారవ్వేదికాదు. ఇంటిలోని పిల్లలంతా ఎండు డొక్కలతో నిద్రపోయేవాళ్ళు. పిల్లల వంటినిండా మురికి చారలు – జుట్టుకు నూనె రాయరు. వంటినిండా గుడ్డవుండదు. ఇంట్లో పనులన్నీ అయిన తరువాత సీత నిద్రపోయిన పిల్లల్ని లేపుకెళ్ళి స్నానం చేయించి అన్నం తినిపించేది. భోజనం చేసిన తరువాత జగ్గయ్యకు మంచి ఓపిక వచ్చేది. పాటలు పద్యాలు పాడుకొని మరలా నిద్ర పోయేవాడు. ఏవో పిచ్చాపాటి కబుర్ల అనంతరం కుటుంబ మంతా ఆ రెండు సిట్టాళ్ళ పూరి కొంపలో ప్రశాంతంగ నిద్రపోయేవారు. పరిశుభ్రమైన గాలి, నిద్రే ఆ కష్టజీవుల ఆరోగ్యాల్ని కాపాడే మూల నిధులు – సంజీవిపుల్లలు.

ఆ రోజుల్లో వెంకటరత్నం అయిదవ ఫారం చదువు తుండేవాడు. తెల్లవాళ్ళు భరతఖండాన్ని వదిలిపోవాలని, దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని జాతీయోద్యమ నాయకత్వం బస్తీలలో యిచ్చే నినాదాలు గ్రామాలపరకు వినిపిస్తున్నాయి. అనేకమంది మధ్యతరగతి మేధావులు, యువకులు జాతీయకాంగ్రెస్ నాయకత్వాన తమజీవితాలు పరాయి ప్రభువుల్ని దేశాన్నుండి వెళ్ళగొట్టి స్వారాజ్యస్థాపనకు కంకణం గట్టుకున్నారు. కాలేజీలు వదలిన విద్యార్థులు, వృత్తులు మానివేసిన దేశభక్తులు జాతీయోద్యమంలోకి ఉరకడంతో జాతీయోద్యమ స్వభావం తీవ్రభావాలకు గురికావడమే గాక గ్రామీణప్రాంతాల్లోని రైతు యువకుల్లో సైతం మాతృ దేశ విముక్తికి కంకణం కట్టి పోరాడాలనే చైతన్యం వెల్లివిరి

సింది. బ్రిటీషువాళ్లు జాతీయోద్యమాన్ని రక్తపు టేరుల్లో ముంచెత్తి క్రూరహింసా విధానాల ద్వారా అణచివేయగలననే విశ్వాసం పొంగి పొరలివచ్చే ప్రజావెల్లువముందు సన్నగిలిపోయింది. దేశాన్ని విభజించి పాలించాలనే నీచపు రాజకీయ ఎత్తుగడల్లో బ్రిటీషు రాజనీతిజ్ఞులు నిమగ్నమైపోయారు. హిందూ ముస్లిం నిమ్న జాతి సోదరులకు మధ్య కుల మత తగాదాలు పెట్టి దేశంలో అశాంతి, అరాజక పరిస్థితులు సృష్టించి దేశంలోని యువకుల శక్తి సామర్థ్యాలను జాతీయోద్యమం నుండి ప్రక్కదారులకు పట్టించి తమ పెత్తనాన్ని శాశ్వతంగా నిలుపుకోవాలని కుట్రలతో కూడిన పథకాలు తయారుచేసారు. ప్రభుత్వ క్రూర నిర్బంధ విధానం అమానుష హింసాకాండ, చీల్చి పాలించాలనే నీచపు రాజకీయపు ఎత్తుగడలను దేశభక్తులైన భారత ప్రజలు ఓడించారు. అనేకమంది యువకులు, దేశభక్తులు జైళ్ళకు పోయారు - ఉరికంబాలెక్కారు.

వెంకటరత్నం మంచి వక్త. రచయిత. ఉద్రేకపూరితమైన గేయాలు, వ్యాసాలు వ్రాయగలడు. చెడుగుడు, ఫుట్ బాల్ రత్నానికి ప్రియాతి ప్రియమైన ఆటలు. ప్రతిరోజు ఉదయం సాయంత్రం బస్కీలు, దండెములు, ఆసనాలు వేస్తుంటాడు. మిగతా కాలమంతా పుస్తకాలు, పేపర్లు చదవడం, చదివిన విషయాలు యితరులతో చర్చించడం రత్నం పని. రత్నానికి వయస్సుకు మించిన తెలివితేట లున్నాయని ప్రతీతి. ఆహ్లాదంచిలికే ఆయన ముఖమే ఆయన పరిపూర్ణమైన ఆరోగ్యానికి నిదర్శనం. క్లాసుల్లో తరుచు మితవాద జస్టిస్ పార్టీ

భావాలు గల ఉపాధ్యాయులతో ఘర్షణ పడుతుండేవాడు. రత్నం రాజకీయ భావాలు జాతీయోద్యమం అంటే అభిమాన మున్న ఉపాధ్యాయులు మెచ్చుకుంటూ 'నీవు సహజమైన గొప్ప రాజకీయ నాయకుడవవుతావయ్యా' అంటూ ఆశీర్వ దించి ఉత్సాహపరచేవారు.

వెంకటరత్నం తన నిత్యప్రచారం ద్వారా సామ్రాజ్య వాద వ్యతిరేకభావాలు విద్యార్థుల్లో నాటాడు. సెలవుదినాల్లో హరిజనవాడలకుపోయి అంటరానితనాన్ని నిరశిస్తు వుపన్యాసా లిస్తు వారితో కలిసి మెలిసి తిరుగుతు వారి యిండ్లలోనే అన్న పానాదులు సేవిస్తు వారిలో ఒకడుగా మెలగడం మొదలు పెట్టాడు. అంటరానితనానికి వ్యతిరేకంగ, వ్యవసాయకూలీలకు న్యాయమైనకూలి కావాలంటూ రత్నంయిచ్చే వుపన్యాసాలు అనేకమంది అంటరాని వ్యవసాయకూలి యువకుల్ని మేల్కొ లిపి ఆవేశపరచాయి. రత్నం పల్లెల్లో తయారుచేసుకున్న యీ యువక సైన్యం తన భవిష్యత్తు కార్యక్రమాలు దిగ్విజయంగ సాగించడానికి పునాదిరాళ్లుగ వుపయోగపడ్డాయి. ఆరోజుల్లో రత్నం రాట్నంమీద దారంతీయడం, పూర్తిగ ఖద్దరు దుస్తులు ధరించడం ఒకవిధిగ భావించేవాడు.

మితవాద జాతీయ బూర్జువా వర్గ నాయకులు జాతీ యోద్యమాన్ని నడిపే పూర్తిబాధ్యత తమ గుప్పెట్లో పెట్టు కున్నారు. స్వాతంత్ర్య పోరాటంలోకి కార్మికులు, రైతులు, తదితర పీడిత ప్రజలు పాల్గొనడం ఎక్కువయింది. జాతి విముక్తికి జరిగేపోరాటంలో కార్మికులు రైతులు ప్రదర్శించిన ధైర్యాన్ని త్యాగాల్ని చూచి బూర్జువానాయకత్వం అధికా

రం తమ చేతుల్లోనుండి జారిపోతుందేమోనని తరుచు భయపడుతుండేవారు. జాతీయోద్యమ నాయకులు సామ్రాజ్యవాదులతో పెక్కుపర్యాయాలు కొన్ని తాత్కాలిక ప్రయోజనాలు సాధించడానికి జరిపిన రాజీ సంప్రదింపులవల్ల దేశభక్తులయిన అతివాద నాయకులు, కార్యకర్తలు అనేక కష్టనష్టాలకు గురయ్యారు. జాతీయ కాంగ్రెస్ నాయకులు సామ్రాజ్యవాదులతో తరుచు జరిపే రాజీ రాయబారాలు అతివాదులైన యువక లోకంలో తీరని నిరాశ నిస్పృహాలు కలుగజేసాయి. యువకు లనేకమంది బెంగాల్, పంజాబ్, అస్సాం, ఆంధ్ర మొదలుగాగల రాష్ట్రాల్లో టెర్రరిట్టు వుద్యమాలు స్థాపించుకున్నారు. ఈ టెర్రరిస్టు వుద్యమాలద్వారా పరాయిపాలకులపై పగ సాధించడానికి తమ జీవితాలు అంకితంజేసారు. భగవత్‌సింగ్ లాంటి వీరయోధులు ఉరికంబాలెక్కి యువకలోకంలో ఆవరించిన నిరాశ, నిస్పృహాలను పారద్రోలి దేశానికి నైతికబలాన్ని, పౌరుషాన్ని ప్రసాదించారు. వీరవనిత కల్పనాదత్తులాంటి యువతుల వీరగాథలు భారత నారీలోకంలో నూతన వుత్సాహాన్ని కలుగజేసాయి. కారల్ మార్క్సు రచించిన కమ్యూనిస్టు మూలసూత్రాలు ప్రపంచంలో దేశదేశాల యువకుల్ని అందు ముఖ్యంగా కార్మిక, కర్షకులను తీవ్రంగా ఆకర్షిస్తున్నాయి. ప్రపంచంలో రెండే రెండు వర్గాలున్నాయి. ఒకటి దోచుకునే వర్గం, రెండవది దోయబడే వర్గం. ఈ రెంటికి ఎప్పుడు ఎడముఖం పెడముఖం. ఈ రెంటికి మధ్య కలయికగాని, సామరస్యంగాని అసంభవం. దోయబడే వర్గం దోచుకునే వర్గంపై తిరగబడి పోట్లాడి విజయాన్ని సాధి

స్తుంది. హెచ్చుతగ్గులు, దోపిడి, స్వార్థం, మోసంలేని స్వర్గ తుల్యమైన వర్గరహిత, నవసమాజం ఏర్పడుతుంది. ఈ సూత్రాలు మొదటి సారిగ రష్యాలోని కార్మిక కర్షకులు కామ్రేడ్స్ లెనిన్, స్టాలిన్‌ల నాయకత్వాన ఆకళింపుచేసుకొని గొప్ప విప్లవంద్వారా దేశంలోని పీడించే పాలకవర్గాలను కూలద్రోసి సోషలిస్టురాజ్యాన్ని స్థాపించుకున్నారు. ఈ మహాద్భుతమైన చారిత్రక సంఘటన దేశ దేశాల్లోని కష్టజీవుల్ని కదలించింది. రష్యావిప్లవం తరువాత పీడిత ప్రజలు తమలోవున్న శక్తిసామర్థ్యాలు సరిగ అంచనా కట్టుకోడానికి చక్కగ వుపయోగపడింది. ఈ విప్లవ సిద్ధాంతాలు మన దేశంలో సాంఘిక న్యాయాన్ని, ఆర్థిక, రాజకీయ సమానతలు నెలకొల్పాలనుకునే అనేకమంది మేధావులకు, అతివాద యువకులకు మార్గం చూపించాయి.

వెంకటరత్నం మెట్రిక్యు లేషను లో వుత్తీర్ణుడయి, గుంటూరు ఆంధ్ర క్రిష్టియన్ కాలేజిలో చేరాడు. కొద్ది మాసాల్లోనే రత్నం కాలేజీ విద్యార్థులచేత విద్యార్థి నాయకుడుగ గుర్తించబడ్డాడు. రత్నాన్ని కాలేజి యూనియన్ కార్యదర్శిగ ఎన్నుకున్నారు. కొన్నాళ్ళకు రత్నం గదిని పోలీసులు సోదా చేసి నిషిద్ధ సాహిత్యాన్ని పట్టుకున్నారు. రత్నాన్ని అరెస్టుచేసి జైలుకు పంపారు. రాజద్రోహ నేరానికి ఆరుమాసాలు జైలుశిక్ష అనుభవిస్తూనే అనేక మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాలు చదివాడు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర, గోర్కీ అమ్మ, కమ్యూనిస్టు మ్యానిఫెస్టో మొదలైన

అనేక గ్రంథాలు రత్నానికి బాగా రుచించాయి. మరికొంత మంది జైలు కామ్రేడ్స్ సహాయంతో గతితార్కిక భౌతిక వాదాన్ని అర్థంచేసుకొని కమ్యూనిస్టుగ మారాడు. రత్నం జైలునుండి బయటకు వచ్చి మరలా వున్నత విద్యాభ్యాసం చేయడానికి ప్రయత్నించాడు. కాలేజి అధికారులు అతనికి సీటు మరల యివ్వడానికి తిరస్కరించారు. దీనితో తన జీవిత కాలాన్నంత కమ్యూనిస్టు వుద్యమ నిర్మాణానికి వినియోగించ డానికి నిశ్చయించుకున్నాడు.

రత్నానికి యిప్పటికి మైనారిటి తీరిపోయింది. అందు వలన తనకు రావాల్సిన ఆస్తిని తలిదండ్రుల నుండి పంచుకు న్నాడు. తన వాటాక్రింద వచ్చిన పది ఎకరాల సారవంత మైన మాగాణిభూమి అమ్మివేసి డబ్బు దగ్గర వుంచుకున్నాడు. ఈ డబ్బుతో తను జీవిస్తు, తనలాగ విప్లవ వుద్యమాల్లో పని చేసే బీద కార్యకర్తలకు తగిన ఆర్థిక సహాయంచేస్తు కాలాన్ని గడుపుతున్నాడు.

రత్నంపై పోలీసు నిఘా ఎక్కువయింది. అందువలన తన కార్యకలాపాలన్ని రాత్రివేళల పూర్తిచేయడం మొదలె ట్టాడు. పగలు పోలీసుల కంటబడకుండ హరిజనవాడల్లో తల దాచుకుంటున్నాడు. పల్లెల్లో రష్యా విప్లవ దినోత్సవాల సందర్భంలో పెద్ద ఎత్తున ప్రచారంచేసి బహిరంగసభలు పెట్ట డం లాంటి కార్యక్రమాలు మొదట్లో చేసేవాడు.

చదువురాని యువకు లందరికి పాఠశాలలు పెట్టి వారికి చదువు నేర్పేవాడు. పేపర్లు చదివి వార్తలు చెప్పే వాడు. రాజకీయాలు, చరిత్ర, భూగోళం మొదలుకొని ఆరోగ్య సూత్రాలదాకా వారికి రాత్రి పాఠశాలల్లో బోధించే వాడు. రాత్రి పాఠశాలల్లోనే ఆటలు పాటలు, యితర వైజ్ఞానిక కార్యక్రమాలు సాగించే వాడు. రత్నం అంటరాని వ్యవసాయకూలిలకు రష్యా విప్లవాన్ని గురించి, రష్యా ప్రజలు నిర్మించుకున్న సోషలిస్టు రాజ్యాన్ని గురించి పాఠాలు చెపు తుంటే ఆలాంటి రాజ్యం తమ కెప్పుడు వస్తుందో రత్నాన్ని జోస్యం చెప్పమనే వాళ్ళు. "మనమంతా ఎదురు తిరిగి సామ్రాజ్య వాద, పెట్టుబడిదారి ఫ్యూడల్ దోపిడి వర్గాలను ఓడించి, విజయం సాధించ గలిగిననాడు" అని ముక్తసరిగ సమాధానం చెప్పేవాడు.

జగ్గయ్యకూడ రత్నందగ్గర రాత్రి పాఠశాలలో చేరి రాజకీయ పాఠాలు నేర్చుకుంటున్నాడు. జగ్గయ్య క్లాసులో చెప్పిన ప్రతి విషయాన్ని జాగ్రత్తగ వింటాడు. అడిగిన ప్రశ్న లన్నింటికి చక్కటి సమాధానాలుయిచ్చి ఎదురు ప్రశ్నలు వేసి ఎక్కువ విషయాలు తెలిసి కునేవాడు. విమర్శనా దృష్టితో ప్రతి చిన్న విషయాన్ని పరిశీలించేవాడు. మధురమైన తన కంఠంతో విప్లవ గేయాలు పాడుతు ప్రజలను వుత్సాహ పరచేవాడు. ధోవతులు కట్టే వయస్సు వచ్చింది. నల్లటి దేహము, అందమైన పెద్దకండ్లు, వుంగరాలు తిరిగి వెనక్కి దువ్విన జుట్టు, భావప్రకటనకు అనువైన ముఖము,

ప్రత్యేకంగా గాని పరిశీలిస్తే కనబడని చక్కని అందంగల నవ యువకుడు. నిప్పులాంటి ప్రవర్తనగల యువక సింహం. జగ్గయ్య బాగా రత్నానికి నచ్చాడు. జగ్గయ్య తెలివితేటలు, పట్టుదల అర్థంచేసికున్న రత్నం అతని అభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ చూపించడం మొదలెట్టాడు.

రత్నం అనేక గ్రామాలలోని రైతు వ్యవసాయకూలి యువకులతో పెద్దలతో సంబంధాలు అధికంచేసి రైతు, వ్యవసాయకూలి సంఘాల నిర్మాణానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. రత్నానికి నూతనంగా లభించిన గట్టియువకుల్లో శ్రీనివాసరావు ఒకడు. శ్రీనివాసరావు కాలేజీలో చదువు కున్నాడు. మధ్యతరగతి రైతు కుటుంబంలో జన్మించాడు. శ్రీనివాసరావు ఒక ఆదర్శమైన ప్రేమ వివాహాన్ని చేసుకున్నాడు. ఇది ఆచుట్టుపట్ల యువకుల్లో శ్రీనివాసరావు అంటే మంచి గౌరవాన్ని కలుగ జేసింది. శ్రీనివాసరావు ఒక బీద అమ్మాయిని ప్రేమించాడు. ఆ యువతిపేరు సూర్యావతి. ప్రక్కయింటి అమ్మాయి అవడంచేత యీ ప్రేమ గొడవ పైకి పొక్కి యిద్దరి తలి దండ్రులకు తెలిసింది. శ్రీనివాసరావు తండ్రి, కోడి కొంగలమీాదవంక బెట్టి సూర్యావతి తండ్రిని, ముఖ్యంగ అతని బీద తనాన్ని ఎత్తి పొడవడం మొదలు పెట్టాడు. ఒకనాడు సూర్యావతి శ్రీనివాసరావు మాట్లాడడం తన కండ్లతో చూశాడు. శ్రీనివాసరావు తండ్రి అన్న మాటలు గుర్తు కొచ్చాయి. సూర్యావతిని పట్టుకొని కొట్టాడు. అతనితో మాట్లాడవద్దని శాసించాడు. సూర్యావతి

తండ్రికి శ్రీనివాసరావు అంటే యిష్టమే. వాళ్ళిద్దరి మధ్య పెండ్లి కూడ జరగాలని యిష్ట పడతాడు. అయితే శ్రీనివాసరావుకు తన మేనత్త కూతుర్ని యిచ్చి పెండ్లి చేసి ముప్పయివేలు కట్నం యివ్వాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి. తన కూతురుతో శ్రీనివాసరావు వివాహం అసాధ్యమయిన విషయమని ఆ యువకుడు ముప్పయివేల డబ్బుకు కక్కుర్తి పడతాడని అతని అభిప్రాయం.

ఒక వారంరోజులతరువాత శ్రీనివాసరావు,సూర్యావతి చెన్నపట్నం వెళ్ళిపోయారు. ఆ నాటి సాంఘిక పరిస్థితులు శ్రీనివాసరావు ఆ గ్రామంలో వుంటే వివాహం చేసికోడానికి సహాయ పడవు. పైపెచ్చు వారిద్దరిదీ ఒకే కులం కాదు. ఇద్దరు శూద్రులే అయినప్పటికి సూర్యావతి కులం కొంత తక్కువ కులం అని సమాజం వాడిక. పట్నం వెళ్ళిన నెలరోజుల తరువాత వారిద్దరు పెండ్లి చేసుకున్నారు. వర కట్నాలు విసర్జించి, రెండు విభిన్న కులాల యువతీ యువకుల మధ్య జరిగిన యీ వివాహాన్ని సంఘ సంస్కర్తలు పొగిడారు. పేపర్లలో వారి పేర్లు ఫోటోలు ప్రముఖంగ ప్రకటించారు. మద్రాసులో ఒక సంవత్సరం పాటు సూర్యావతి చదువు నేర్చుకుంది. శ్రీనివాసరావు ఆమెకు మార్క్సిస్టు రాజకీయాలు నేర్పాడు. యీ కాలంలో ఆమెకు అంటరాని వ్యవసాయ కూలీలంటే, కార్మిక పేదరైతులంటే, గొప్ప అభిమానము ప్రేమ ఏర్పడ్డాయి. తన భర్త రాజకీయ ఆశయాలను, అదర్శాలను ముందుకు తీసుక పోవడానికి తనవంతు బాధ్యతను కూడ నెర వేర్చాలనే పట్టుదల అలవర్చుకుంది.

సూర్యావతికి మద్రాసులో వుండగానే మొగపిల్లాడు పుట్టాడు. ఇంటి దగ్గర శ్రీనివాసరావు తండ్రి మనస్సు మార్చుకున్నాడు. కుమారుని కోడల్ని యింటికి పిలిపించు కున్నాడు. అత్త మామలు వారిద్దర్ని సమానంగ గౌర వించడం మొదలెట్టారు.

శ్రీనివాసరావు ఉద్యోగానికి ప్రయత్నించ కుండా వుండిపోవడం, రత్నానికి గ్రామీణ ప్రాంతంలో ప్రజా వుద్యమాల నిర్మాణానికి ఒక కుడిభుజం దొరికినట్లయ్యింది. రత్నం శ్రీనివాసరావు సూర్యావతి ముగ్గురు కలిసి రాత్రిపూట పల్లెలకు పోయేవారు. రత్నం శ్రీనివాసరావు సమావేశాల్లో వుపన్యసిస్తుంటే సూర్యాతి కొన్నాళ్ళు తానుకూడ ప్రేక్షకురాలుగ వుండి పోయింది. ఒకనాడు వీరి ముగ్గురకు ఒక పల్లెలో భోజనం ఏర్పాటు చేశారు. యింటి నిండా కుండలు, చెంబులు, శుభ్రంగ తోమిలేవు. ఇల్లంతా అపరిశుభ్రంగ వుంది. సూర్యావతి మొదటిసారిగ హరిజనవాడలో భోజనం చేసింది. అక్కడి అపరిశుభ్ర పరిస్థితుల్ని గూర్చి చాలా బాధపడింది. తెల్లవారి లేచి ఆ యింట్లో వున్న చెంబులు, కంచాలు బయటవేసి శుభ్రంగ తోమింది. యీ ఘటన చుట్టు ప్రక్కల హరిజన స్త్రీలకు అమితాశ్చర్యాన్ని కలుగ జేసింది. తరువాత యింట్లో ఏ సామాను ఎక్కడ పెట్టుకోవాలో చక్కగ సర్దిపెట్టింది. ఇల్లంతా అద్దం లాగా ఊడ్చింది. పల్లెలోని స్త్రీలను సమావేశపర్చి యిలా వుద్బోధించింది.

సోదరీ మణులారా!

"మీరు పైకి ఎంత మురికిగ, అనాగరికంగ కనబడు తున్నప్పటికి మీలో గొప్ప శక్తి సామర్థ్యాలు వున్నాయి. మీరు లేనిదే యీ పంటలు పండవు - యీ వుత్పత్తి కంతా మీరే కారకులు. బీదతనం వలన ఆవహించిన నిరాశ నిస్పృహాలు విడనాడాలి. మీరు పండించే పంటల్లో మీకు రావాల్సిన న్యాయమైన వాటా మీకు దక్కకుండ పైనభూస్వాలు, స్వార్థపరులు కొట్టేస్తున్నారు. న్యాయమైన కూలి రేటు కోసరం, ఉన్నతమైన జీవిత పరిస్థితుల కోసరం మనమంతా పోట్లాడాలి. మీ యిండ్ల చుట్టువున్న భూములు కొద్దిసంవత్సరాల క్రితము మీవే. యీ భూములు ధనికులు మిమ్మల్ని మోసంచేసి లాక్కున్నారు. భూమిమీద కష్టపడే వారికే దానిపై యాజమాన్యం వచ్చేవరకు మనం పోరాడ వలసి వుంది. అందుకు మీరంతా వ్యవసాయకూలి సంఘాల్లో చేరి పోరాడాలి." సూర్యావతి వారంలో మూడురోజులు విధిగతన గ్రామాలలోని చుట్టుప్రక్కల హరిజన పల్లెలకు పోయి వారికి రాజకీయాలు, విప్లవ గేయాలు నేర్పేది. రాత్రిపూట మగవాళ్ళతో మీటింగులకు పోతున్నందుకు, ప్రయాణాల సందర్భంలో సూర్యావతి ఒంటరిగ పోతున్నందుకు ఆమెనుగూర్చి భూస్వాములు చెడుగ ప్రచారం చేసేవాళ్ళు.

'ఆకలి యాత్రలో పాల్గొనండి' అనే ఒక కరపత్రం ముద్రణాలయం పేరు వేయకుండ తెల్లవారిపాటికి ఎవరో అనేక గ్రామాల్లో పంచి పోయారు. శ్రీనివాసరావు, రత్నం,

సూర్యావతి ఒక యిరవై గ్రామాల మీద తమ శక్తి కేంద్రీకరించి ఆకలి యాత్రలో పెద్ద ఎత్తున ప్రజలను సమీకరించడానికి రాత్రింబవళ్ళు తిరిగి ప్రచారం చేస్తున్నారు. ఆకలి యాత్రలో పాల్గొంటే పోలీసులు జైల్లో పెడతారని తుపాకులతో కాలుస్తారని భూస్వాములు ఎదురు ప్రచారం చేయడం మొదలెట్టారు.

రత్నం వేసిన అంచనాలకు మించి అనేక గ్రామాల నుండి వ్యవసాయ కూలీలు పేదరైతులు ఆకలి యాత్రలో పాల్గొన్నారు. రాత్రీ పాఠశాలలో రత్నం దగ్గర పాఠాలు నేర్చుకున్న అనేకమంది యువకులు యీ ఆకలి యాత్రకు నాయకత్వం వహించారు. రెండు వరుసల్లో ప్రజలు ఎర్రజెండాలు చేతబట్టి విప్లవ నినాదాలు చేసుకుంటు గ్రామాల్లో వూరేగింపులు చేసుకుంటు అక్కడ మరి కొంతమందిని ఊరేగింపులో కలుపుకుంటు టౌను ముఖంవైపుకు ప్రవాహం లాగ, కదలి వస్తున్నారు. వాలంటీర్లంతా కత్తి సుత్తి చిహ్నంవున్న ఎర్ర బ్యాడ్జీలు ధరించారు. ఊరేగింపు బహు రమణీయంగ, కనుల పండుగ్గ బయలుదేరి టౌనులో ప్రవేశించింది. సి. ఐ. డి. లు సైకిళ్ళమీద వూరేగింపు వెంట హాడా వుడిగ తిరుగుతు, మేగఫోన్లతో నినాదాలిచ్చే వాలంటీర్ల పేర్లు నోట్ చేసికోడానికి ప్రయత్నిస్తు భయానక వాతావరణాన్ని సృష్టించాలని, ప్రయత్నిస్తున్నారు. వూరేగింపు కార్మిక పేటల్లో ప్రవేసించింది. కార్మిక స్త్రీలు బిందెలతో నీళ్ళు తెచ్చి వూరేగింపుముందు వారబోశారు – జిల్లా కలెక్టరు ఆఫీసుకు వూరే

గింపు చేసుకుంది. శ్రీనివాసరావు జిల్లా అధికారిని గుమి గూడిన వందలాది ప్రజల సమక్షానికి పిలిచి ఒక వినతి పత్రాన్ని సమర్పించాడు. ఆ మెమోరాండంలో పేద ప్రజలకు ధాన్యం చౌక డిపోలద్వారా సరసమైన రేట్లకు అంద జెయ్యాలని కోరారు. వ్యవసాయ కూలీలకు పనులులేని రోజుల్లో ప్రభుత్వం కాంట్రాక్టుపనులు చూాయించాలని, వారికి కనీస కూలిరేటు నిర్ణయించే చట్టం తేవాలని, వ్యవసాయ కూలీలకు ప్రభుత్వ బంజర్లు వుచితంగ పంచాలని, రైతులపై పన్నులభారం తగ్గించాలని వివరించారు. అధికారి ప్రభుత్వానికి మీా కోర్కెలు తెలియ జేస్తాను - నా అందుబాటులోవున్న పనులు చూాచి ఆలోచించి వీలయితే చేస్తాను. అంటు సమాధానం చెప్పి వెళ్ళిపోయాడు. తరువాత పార్కులో గొప్ప బహిరంగసభ జరిగింది. సభలో శ్రీనివాస రావు వుపన్యసించాడు. రత్నంపై పోలీసునిఘా వుండడం వలన రహస్యంగ వున్నాడు.

రెండవ ప్రపంచ యుద్ధం పూర్తి అయింది. ఫాసిస్టు దుష్టశక్తులు సమూాలంగ నాశనమయ్యాయి. తూర్పుయూరప్ దేశాలలోని ప్రజలు రష్యా ఎర్రసైన్యం సహాయంతో ఫాసి ష్టుల్ని ఓడించి రాచరిక ప్రభుత్వాలను తొలగించి నూతన ప్రజాస్వామిక ప్రభుత్వాలు స్థాపించుకున్నారు. వలస దేశాల్లో బ్రిటీషు సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగ సంపూర్ణ స్వాతంత్ర్యం కోసరం పెద్దఎత్తున ప్రజాపోరాటాలు చెలరేగాయి. భారత దేశంలో నావికుల తిరుగుబాటు

అజాద్ హింద్ ఫౌజ్ సైనికుల విడుదల కోరుతు బొంబాయి, కలకత్తా, నగరాలలో ప్రజలు జరిపిన బ్రహ్మాండమైన రాజకీయ ప్రదర్శనలు బ్రిటిషు ప్రభుత్వానికి కంగారు పుట్టించాయి. వలస దోపిడి గాళ్ళు ప్రేలిపోవడానికి సిద్ధంగ వున్న అగ్నిపర్వతంపై తాము కూర్చున్నట్లు గుర్తించారు. విద్యార్థులు కార్మికుల పట్టణ గ్రామీణ ప్రాంతాల్లో పెద్ద ఎత్తున రాజకీయ సమ్మె పోరాటాలు నడిపారు.

1947 ఆగష్టు 15 వ తేది ఇండియాకు స్వాతంత్ర్యం యిస్తామని బ్రిటీషువాళ్ళు ప్రకటించక తప్పలేదు. దీనితో బ్రిటిషువాళ్ళ ప్రత్యక్షపాలన భారత దేశంలో పోయి జాతీయ కాంగ్రెస్ అధికారాన్ని స్వీకరించింది. బ్రిటిషువాడు యిండియాలో వున్న పెట్టుబడులు, లాభాల విషయంలో మన ప్రభుత్వం ఏలాంటి హాని కలుగ జేయనని హామి యిచ్చింది. దేశంలోని ఫ్యూడల్ పెట్టుబడిదారి వర్గాల లాభాలు రక్షించడానికి నూతన ప్రభుత్వం నిశ్చయించుకుంది. దీనితో దేశంలోని పాలక పార్టీ అయిన కాంగ్రెస్‌లో ఫ్యూడల్ పెట్టుబడిదారి వర్గాల ప్రాబల్యం అన్నిస్థాయిల్లోను అధికం కాజొచ్చింది.

బాపయ్య మొదటినుండి జస్టిస్ పార్టీ మనిషి. జాతీయోద్యమాన్ని గ్రామాల్లో అణచడానికి బాగా తోడ్పడిన వారిలో బాపయ్య తండ్రి ఒకడు. తాలూకా జిల్లా బోర్డు ఎన్నికల్లో బాపయ్య కుదురుకు చెందినవాళ్ళు ఎప్పుడూ కాంగ్రెస్‌ని ఎదిరించి పోటీచేసి ఓడిపోతుండేవాళ్లు – తన

పూర్వులకన్న బాపయ్య కొంత తెలివిగల వాడగుటచేత జస్టీస్ పార్టీకి కాలం తీరిందని గ్రహించాడు. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత అతి వాద రాజకీయ పార్టీలపై నిర్బంధం ఎక్కువయింది. రైతు వ్యవసాయ కూలీల భూమి సమస్యను పరిష్కరించి వారి జీవన పరిస్థితులు మెరుగు పరచడానికి కాంగ్రెస్ తిరస్కరించింది. కాంగ్రెస్ ఆలోచించే యీ అభివృద్ధి నిరోధక విధానాలు బాపయ్యకు బాగా నచ్చాయి. అందువలన అతనుకూడా కాంగ్రెస్‌లో చేరాడు. ఖద్దరు ధరించడం, పాలకవర్గ పార్టీకి చందా లివ్వడం, గ్రామంలో కక్షలుపెంచి రైతు కూలీల్ని అదుపులో పెట్టడానికి ప్రయత్నాలు చేయడం బాపయ్య నిత్య కార్యక్రమంలో ఒకటిగ మారింది.

ఈ ప్రాంతంలో చిన్న పెద్ద అనే తారతమ్యం లేకుండ పాలేళ్ళచేత రేయింబవళ్ళు వెట్టిచాకిరి చేయించడం, తక్కువ జీతాలు యివ్వడం ఫ్యూడల్ సాంప్రదాయాల్లో యిదొక సాంప్రదాయంగ వుంది. వీరికి సంవత్సరంలో శెలవులంటు వుండవు. జబ్బువచ్చి యింటి దగ్గరుంటే నాగాలుకట్టి జీతం నుండి డబ్బు విరగ్గోస్తారు. వీరికి పెట్టే తిండి సాంబారు మెతుకులు సద్దికూడు. పాలేళ్ళ యీ నికృష్ట జీవితం వెంకటరత్నం హృదయాన్ని కదిలించి వేసింది. వీరి పరిస్థితిని మెరుగు పర్చడానికి పాలేళ్ళలో ఐక్యత సాధించి సమ్మె చేయించి వారి జీతాల్ని పెంచుటకు, పని గంటలు తగ్గించుటకు యితర కార్య కర్తలతో, చర్చించి రత్నం ఒక కార్యక్రమాన్ని రూపొందించాడు.

ముందు తన రాత్రి పాఠశాలల్లో చదువుకున్న పాలే ళ్ళందరిని సమావేశ పర్చాడు. వీరంతా గ్రామ గ్రామాన వున్న పాలేర్లను సమావేశ పరచి సమ్మె చేయాలని నిర్ణ యించు కున్నారు.

కోడి కూతకు ముందే పనుల్లో ప్రవేశించి చావిడి శుభ్రంచేసి పశువుల్ని సముదాయించే పాలేళ్ళు ఖచ్చితంగ తెల్లవారిన తరువాత పనుల్లోకి రావడం మొదలెట్టారు. యీ విషయం బాపయ్యను మరి యితర భూస్వాములను బాగా కలవర పెట్టింది. ఎవరో యిద్దరో ముగ్గురో పాలేళ్ళు ఆల స్యంగవస్తే భూస్వాములు అంతగ పట్టించు కునేవారు కాదు. గ్రామంలోని పాలేళ్లు మాత్రమేగాక చుట్టు ప్రక్కల గ్రామా లలోని పాలేళ్లుకూడ గంట కొట్టిన తరువాత బయలు దేరారా అన్నట్లు అందరు తెల్లవారిన తరువాత పనుల్లోకి పోతున్నారు. ముఖ్యమైన గ్రామాల్లో రాత్రి పాఠశాలలు పెట్టి పాలేరు యువకులు చదువు నేర్చుకుంటున్నారు. యీ సంగతి తెలుసుకున్న తరువాత భూస్వాములకు మరీ కారం రాచుకున్నట్లైంది. పాలేళ్లు చదువు నేర్చుకుంటున్నారనేవార్త విని బాపయ్యకు మంటల జ్వరంవల్ల కలిగే బాధకు మించిన బాధకు గురి అయ్యాడు. దీనికి తోడు రైతు నాయకుడు శ్రీనివాసరావు వ్యవసాయ కూలీలకు కమ్యూనిస్టు భావాలు నూరి పోస్తున్నాడని, భూస్వాములపై తిరగబడి వాళ్ళ భూములు లాక్కోమని వారిని రెచ్చగొడు తున్నాడనే వార్తలు పాకాయి. వ్యవసాయ కూలీలు కమ్యూనిస్టుల

నాయకత్వాన రైతుల భూములు దౌర్జన్యంగ కాజేయ డానికి రహస్య విప్లవకర వుద్యమాలు నిర్మించు కుంటు, కర్ర కత్తిసాములతో తమపై తిరగబడ డానికి తయారవు తున్నారని రైతుల్ని రెచ్చగొట్టడానికి బాపయ్య ఒక గట్టి ప్రయత్నం చేశాడు. మొత్తంమీద గ్రామంలోని ధనిక రైతుల్ని భూస్వాముల్ని చేరదీసి గ్రామంలోని వ్యవసాయ కూలి పేదరైతు తదితర బీద ప్రజలకు వ్యతిరేకంగ పోట్లాడ టానికి మొదటి ప్రయత్నంచేసి కొంతవరకు సాధించాడు.

ముందు పాలేళ్ళ పని పట్టకపోతే కూలోళ్ళ వ్యవ హారం శృతి మించి రాగాన పడుతుందని భయపడ్డారు - పాలేళ్లు ఆలస్యంగ పనిలోకివస్తే జీతంలో సగం డబ్బు విర గ్గోస్తామని నాగాలు కట్టు కుంటామని, వచ్చే సంవత్సరం అసలు పనుల్లో పెట్టుకోమని బెదిరించుతు ఒక కరపత్రం వేసి గ్రామాలవెంట పంచిపెట్టారు. యీ పాలేళ్ళ సమ్మెకు జగ్గయ్య నాయకత్వం వహించాడు. రత్నం శ్రీనివాసరావు పూర్తి నాయకత్వం వహించి భూస్వాముల ప్రచారాన్ని ఎప్పటికప్పుడు త్రిప్పి కొట్టుతూ పాలేళ్ళలో ధైర్యాన్ని ఆత్మ విశ్వాసాన్ని కలుగ చేస్తున్నారు.

ఏరువాక పౌర్ణమి దగ్గర పడింది. తాము సంవత్స రంలో చేయాల్సిన పనికోజులన్ని ఆరోజుతో ముగుస్తాయి - నూతన సంవత్సరానికి మరల పాలి కాపుతనానికి ఎవరో భూస్వామి వద్ద జీతానికి వుండాలి. మొత్తం సంవత్సరంలో యిదొక్కటే పాలేళ్ళకు శెలవు దినం.

తాము ప్రవేశించ బోయే నూతన సంవత్సరంలో ఎక్కువ జీతాలు, న్యాయమైన పని గంటలు సెలవు దినాలు సాధించడం వీరి లక్ష్యంగ పెట్టుకున్నారు. తమ కోర్కెలు సాధించడానికి జగ్గయ్య, శ్రీనివాసరావు, రత్నం మరికొంత మంది పాలేళ్ళనుచేర్చి దళాలుగ బయలుదేరి గ్రామాలవెంట పాలేళ్ళ కోర్కెల్ని హక్కుల్ని గూర్చి ప్రచారం చేస్తున్నారు. గ్రామాలలోని గోడలనిండ పాలేళ్ళ కోర్కెలు తెలియ జేసే నినాదాలు ఎర్రటి సిరాతో ప్రాముఖ్యంగ వ్రాయబడ్డాయి. పాలేళ్ళలో ప్రదర్శితమైన ఐక్యత, ప్రజలు చూాయిస్తున్న ఆదరణ చూచి భూస్వాములు గుండెలు బాదుకుంటు సమ్మెను విచ్ఛిన్నం చేయడానికి కుట్రలు పన్నుతున్నారు.

గ్రామంలోని పాలేళ్ళలో కొందమందిని చీల్చి వారికి ఎక్కువ జీతాలిస్తామని ఆశపెట్టి సమ్మెను విచ్ఛిన్నం చేయడం ద్వారా మొత్తం అందరి నెత్తిన చేతులు పెట్టాలనేదిగ భూస్వాముల మొదటి ప్రయత్నం – అవర్ణ సవర్ణ పాలేళ్ళ మీాద భేదాలు కల్పించి వారిలో వారికి చీలికలు పెట్టడం రెండో ప్రయత్నం – యీా ఎత్తుగడలు పారకపోతే దూర ప్రాంతాలనుండి పాలేళ్ళను దిగుమతి చేసికొని స్థానిక పాలేళ్ళకు అన్యాయం చేయడం – యివి గాక కూలీల్ని తమ పొలాలలోకి రావద్దని, కోళ్లు పశువులు తమ స్థలాలోకి వస్తే శిక్షిస్తామని, వచ్చే సంవత్సరం తమ పొలాల్లో కూలి నాలి పనులకు పిలవకుండ మానివేస్తామని తీవ్రంగ బెదిరించడం మొదలెట్టారు. భూస్వాములకు అప్పులున్న కూలీలు వెంటనే

బాకీలైనా తీర్చాలి లేకపోతే సమ్మెలో చేరకుండ తమ బిడ్డల్ని జీతాలకు పంపాలి. ఇలా పంపకపోతే ఇళ్లు జబుతు చేయిస్తామని తాఖీదులు పంపించారు. భూస్వాముల కుటిల ప్రయత్నాలన్ని ఐక్య ప్రజల వుద్యమంముందు పటా పంచలయి పోయాయి.

ఏరువాక పౌర్ణమి గడిచింది. తొలి మబ్బులు మెరుస్తున్నాయి. తొలకరి వానలు కురవడం ప్రారంభించాయి. పొలాలు పచ్చబడ్డాయి. భూమి చల్లబడింది దీనితో వ్యవసాయపనులు ప్రారంభించారు. రైతాంగం నారుమళ్లు బాగు చేయాలి - విత్తనాలు చల్లాలి - ఆకుదొడ్లు పెంచాలి. మాగాణి చేలల్లో దుబ్బులు కొట్టాలి దుక్కులు దున్నాలి - యిన్ని జరిగితేగాని ఊడ్పులు సాగవు. మామూలు రైతాంగం అంత తమ పనుల్లో నిమగ్నమై ఊడ్పులు వేయడానికి తమ పొలాల్ని సిద్ధం చేస్తుండగ పెద్ద భూస్వాముల పొలాల్లో దుక్కులు దున్నే దిక్కులేక, ఆకుమళ్ళు నీరుపోసి పెంచే మనుషులు లేక పనులు ఆలస్యమై పోతున్నాయి. పాలేళ్ళ కోర్కెలు అంగీకరించనిదే తాము కూడ పనుల్లోకి రామని మామూలు కూలీలు బిడాయించడంతో భూస్వాముల పని కుడితిలో పడ్డ ఎలుకల్లా తయారయ్యింది.

పాలేళ్ళ సమ్మెతో భూస్వాముల యిండ్లలోని స్త్రీల పనికూడ మంచి యిరకాటాన పడింది. ప్రతిది అమిర్చిపెడితే ఆరగించడానికి అలవాటు పడిన యీ పెద్దయింటి వనితలకు పాలేళ్ళ సమ్మెతో పని భారం ఎక్కువయ్యింది. పశువుల

పాలు పితుక్కో-బోయి, యిల్లు వాకిలి వూడ్చుకొని, అంట్లు తోముకొని, తమ ప్రక్కలు తామే సర్దుకోబోయి తెగ యిసుక్కుంటు, యీ పనులు చేయడంతో తమజంధ్యా లన్నీ తెగిపోయినంత నామర్దాగ బాధపడుతు పాలేళ్ళను విపరీతంగ తిట్టిపోసు కుంటున్నారు.

గొడ్ల చావిళ్ళలోని రొచ్చు పేడ తీసి శుభ్రంచేసే మనుషులు లేకపోవడంతో చావిళ్ళలోని ముసుగుడు వాసన కాపురముండే యిండ్లలోకి వేస్తోంది. కట్టు గొయ్యలకు కట్టి వేయబడిన ఆవులు, బరిగొడ్లు త్రాళ్ళు తెంచుకొని పొలాల మీదికి పారి పోతున్నాయి. పచ్చగడ్డి, గుగ్గిలు మేయడానికి అలవాటుపడ్డ దుక్కిటెద్దులు ఎన్నాళ్లు త్రాడు కట్టు గొయ్యిచుట్టు త్రిప్పుకుంటు వట్టి నెమరు వేయగలవు-

మంచి పని తరుణంలో పాలేళ్ళమీద తెలివి తక్కువ తనంగ కత్తి గడితే వచ్చే నష్టం ఏమిటో భూస్వాములు ప్రత్యక్షంగ గ్రహించారు. పాలేళ్ళు ప్రదర్శించిన ఐక్య పోరాట శక్తిని భూస్వాములు కళ్ళారా చూచారు. యీ సమయంలో పాలేళ్ళను ఎదిరించితే పరాజయం తప్పక పోవడమేగాక, సకాలంలో నాట్లు పడక పోవడంవలన ఎనలేనినష్టాలు కలిగేటట్టు వున్నాయి. అందువలన భూస్వాములంతా బాపయ్య నాయకత్వాన ఒక చోట చేరి తాత్కాలికంగ పాలేళ్ల కోర్కెల్ని అంగీకరించి వాటిని అమలు పరచడానికి అంగీకరిస్తున్నామంటు సమ్మె కమిటీ కి కబురు పంపారు. పాలేళ్లసమ్మె కమిటి భూస్వాములతో సమగ్రమైన

చర్చలు జరిపి సమ్మె విరమించినట్లు ప్రకటించింది. పాలేళ్లంతా తాము ఐక్యతతో సాధించిన విజయాలు మిగతా పీడిత ప్రజలకు తెలియ జేయడానికి ఆరోజు పెద్ద వూరేగింపు జరుపు కున్నారు. సాయంత్రం జగ్గయ్య అధ్యక్షతను గొప్ప బహిరంగ సభ ఏర్పాటు చేసారు. శ్రీనివాసరావు వుపన్యాసానికి ముందు సూర్యావతి, లీల కలసి ప్రజల్ని వుద్రూతలూగించే విప్లవ గేయాలు పాడారు.

బహిరంగ సభకు వచ్చిన వందలాది ప్రజలకు పాలేళ్లు నెలరోజులపాటు సాగించిన సమ్మె పోరాట అనుభవాలు వివరించి యీ విజయానికి తోడ్పడిన వ్యవసాయకూలి, పేద రైతుల్ని సమ్మె కమిటీ తరఫున ఘనంగ అభినందించారు. జై జై ధ్వానాలమధ్య సభ ముగిసింది.

తిట్టిన కొట్టిన, వూహించడానికి వీలులేని వెట్టిచాకిరి చేయమన్న కిమ్మనకుండ తమ ఆజ్ఞలు పాలించే పాలేళ్ళు తమకు ఎదురు తిరిగారు. యిది భూస్వాములకు ఒక తీవ్రమైన సమస్య. ఫ్యూడల్ దోపిడి విధానాన్ని భస్మీపటలం చేయడానికి కావల్సిన అగ్ని కణం కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన గ్రామీణ ప్రాంతంలో విసిరేశారు. పాలేళ్ల విజయం ఫ్యూడల్ భూస్వామిక దోపిడికి వ్యతిరేకంగ భవిష్యత్తులో జరగబోయే గొప్ప ఆందోళనా పోరాటాలకు నాంది ప్రస్తావన లాంటిది. పాలేళ్ళు అడిగిన అదనపు జీతం యివ్వడం భూస్వాములకు ఒక లెక్క లోనిదికాదు – వ్యక్తిలో వున్న మానవత్వాన్ని, స్వాతంత్ర్య భావాల్ని ముందుకు తీసుక

పోయే కొన్ని హక్కులు, కోర్కెలు వారు వెలిబుచ్చారు. యిది వారికి మింగుడు పడని విషయం - యీలాంటి హక్కులు, కోర్కెలు కోరేవారిమీద యిక భవిష్యత్తులో భూస్వాములు తీవ్రమైన చర్యలకు పూనుకుంటారు. భూస్వాముల దండయాత్రను త్రిప్పికొట్టి ఫ్యూడల్ అహంకారానికి అమానుషత్వానికి వ్యతిరేకంగ పోట్లాడి వారిభూములు ప్రజలకు పంచి వారిని నాగరిక ప్రపంచంనుండి వేరు చేయాల్సిన పవిత్ర బాధ్యత నేడు వ్యవసాయకూలి పేదరైతు తదితర పీడిత ప్రజలముందు వున్న ప్రధాన కర్తవ్యాలు.



# 3

పల్లెలో రెండే రెండు భావులున్నాయి. అవి రెండు ఉప్పు నీళ్ల భావులే – గ్రామములో రెండు దేవాలయాలు కూడ వున్నాయి. దేవుని పేర సంవత్సరములో తరచు తిరణాళ్ళు జరుగుతు వుంటాయి. మాల మాదిగలైన యీ పేద ప్రజానీకానికి దేవుడంటే భక్తి లేక పోలేదు. వారిని ఎప్పుడూ దేవుడున్న గుడిలోకి పోవడానికి, దేవుని దర్శించ డానికి సంఘంలోవున్న స్వార్థపరులైన వున్నత కులాధిపతులు అంగీకరించలేదు. కనీసం దేవుని పేరున నాటకాలు నృత్యాలు, సంగీత సభలు, వీధి భాగోతాలు జరుగుతుంటే యీ మాల మాదిగలు యితర కులాల ప్రజలతో కలసి కూర్చోడానికి వీలులేదు. వీరిని ముట్టితే అంటు దోషం తగులు తుందని యితర కులాల వారికి వున్నత కులాధిపతులు పుట్టుకతోనే బోధించారు. అందువలన హరిజనులు నాటకాల వద్ద కూడ ఒక మూలను దూరంగా కూర్చుని చూస్తుంటారు – గ్రామానికంతటికి ఒకే ఒక పెద్ద చెరువు వుంది. ఈ చెరువులోని నీళ్లనే గ్రామంలోని అన్ని కులాల వారికి త్రాగ డానికి వాడతారు. మాల మాదిగలు మాత్రము చెరువులో కుండవేసి నీళ్ళు తెచ్చుకోడానికి వీలులేదని శాసించారు. కొన్ని వందల సంవత్సరములనుండి యీ నిషేధము వారిపై అమలులో

వున్నది. అమాయకపు ఆ పల్లె ప్రజలు సంఘ పెద్దలు విధించిన నిషేధాజ్ఞను ఎన్నడు ధిక్కరించి ఎరుగరు. ఆ శాసనమేదో తమ మంచికే చేయబడినట్లు భావించేవారు.

సవర్ణ కులానికి చెందిన ఎవరో ఒకవ్యక్తి, చెరువుకు దూరంగ నిలబడిన యీ మాల మాదిగ వ్యక్తులకు కడవతో నీళ్ళు ముంచి వాళ్ల కుండల్లోని నీటిచుక్కలు పైన పడకుండా పోస్తూవుంటారు – అంటరానితనానికి వ్యతిరేకంగ పెద్ద ఎత్తున దేశంలో ప్రచారం జరిగినప్పటికి అనేక వేల గ్రామాలలో నేటివరకు యీ అంటు దోషం మొత్తం భారత జాతికే అవమాన కరంగ తయారయి నాగరిక ప్రపంచంలో మనం తలెత్తుకు తిరిగే అవకాశం పోగొట్టు కున్నాము.

ఉప్పునీళ్లతో కళ్లాపి చల్లిన లీల వాకిటి ముందర అందమైన ముగ్గులు వేసిన తరువాత కుండ బుజాన వేసికొని చెరువు నీటికి బయలు దేరింది. కుండ చెరువు అంచున పెట్టి ఎవరైనా సవర్ణ కులానికి చెందిన ఆసామివచ్చి తనకు నీళ్ళు తోడి పోస్తాడేమోనని వేచి నిలబడింది. కాళ్ళు తిమ్మిర్లు ఎక్కుతున్నాయి – ఎవరూ చెరువునీటికి రాలేదు. ఆదారిలో నడచిపోయే కొంతమంది సవర్ణులను ఒక బానెడు నీళ్ళు ముంచి పోయమని బ్రతిమాలుకుంది – ప్రయోజనం శూన్యంగ కనబడింది. లీల చెరువుకు రావడమే అసలు ఆలశ్యంగ వచ్చింది– అప్పటికే జనం అంతా చెరువునీళ్ళు తీసుక పోయారు.

మరెవ్వరు చెరువు నీళ్లకు వచ్చేటట్లు కనపడడం లేదు. అప్పటికే చాల ప్రొద్దు ఎక్కడం వలన పొలం పనికి ఆలశ్యం అవుతుందని భయపడుతోంది - లీల లాంటి అంట రాని అమ్మాయికి చెరువు ముట్టరాదన్న విషయం దృష్టిలో లేక పోలేదు - అయినప్పటికి నీళ్ళు ఏదోవిధంగ తీసికెళ్లాలనే నిర్ణయానికి వచ్చింది. ఆ విధంగ కనీసం త్రాగే నీటికి సైతం చెరువు ముట్టకూడదని శాసించినవాడు కనబడితే ఆ కుండ వాడినెత్తిన పగల గొట్టేటంతగ మండిపోయింది. భావిని త్రాకాలని అ(్రులుచాస్తున్న లీల పమిటిచెంగు చెరువు నీటి కాశపడు తుందేమోనని నడుంచుట్టు బిగించి వేసింది - ధైర్యంచేసి చెరువులోకి దిగింది. కుండతో నీళ్ళు ముంచుకొని కుండ అడుగున అయిన బురద శుభ్రంగ కడిగి నాజూకుగ కుండ బుజాన పెట్టింది. చిన్న చిన్న అంగలతో చెరువు గట్టె క్కింది. సవర్ణులుచూస్తే ఏమయిన అని పోతారేమో ననే భయం లీలలో ప్రవేశించింది. దానితో పెద్ద పెద్ద అంగలతో ఎవరికి తెలియకుండా యింటికిపోవాలనే ఆలోచనతో బయలు దేరింది. లీల వడినడకకు కుండలోని నీళ్ళు అంచులపైన నృత్యం చేస్తున్నాయి - లీల హంసనడక కళ్లారా చూస్తూ జీవితం చాలించాలా! అన్నట్లు వీలు చిక్కినప్పుడల్లా కుండ అంచుల మీదుగ దొర్లిన నీళ్ళు లీల పవిటిచెంగు ముందు వెనుక భాగాలలో అలానే తడీరూపంలో నిలిచి పోయాయి. లీల చెరువు గట్టునుండి ముప్పయి గజాల దూరం పైగానే నడచి వుంటుంది. మరింతలోనే,ఎక్కడనుంచో "ఏ ఆగు, చే ఆగు, వోయి ఆగు" అంటూ ఓ చేయెత్తు మనిషి లీలను

అడ్డగించాడు - ఎవరే నీకు నీళ్ళు పోసింది, అన్న చెరువు కాపలావాని యీమాటలకు లీల అదిరిపోయింది. భయంతో కాళ్ళు వణకడం ప్రారంభించాయి - పారిపోదామని ప్రయత్నించింది - కాపలావానికి దొరకకుండా పారిపోవడం సాధ్యంకానిపని అని తేలిపోయింది - తడబాటు పడే అతి సున్నితమైన మాటలతో "ఆ-నే-నే-నే ముంచుకున్నాను." చెరువులో దిగే అధికారం నీ కెవ్వడిచ్చాడని గద్దించాడు - "కొంచెం ఎండఎక్కిన తరువాత నీళ్ళకు బయలు దేరాను. చాలాసేపు ఎవరయిన నీళ్లు పోస్తారని పడిగాపులు పడి పడి ఎదురు చూచాను. ఎవరు చెరువు నీటికి రాలేదు. దారినే పోయే అయ్యలను నీళ్లు పోయమని బ్రతిమాలాను - వాళ్లు ఎవరు పోయలేదు - పనులకు పోయే వేళ దగ్గరపడింది - మా అమ్మ యింట్లో పనులు చూచుకుంటు నన్ను నీళ్ళకు పంపింది - అందుకని నేనే చెరువులోకి దిగి బానెడు నీళ్లు ముంచుకున్నాను" బరువు నీళ్ళకుండ బుజానవుంది. లీల కొంచెం తలపైకెత్తి కాపలావాని వైపుచూసి "పనికిపోయే వేళ అయింది - దయచేసి నాదారికి అడ్డంలెండి" అని కొంత ధైర్యం తెచ్చుకొని బ్రతిమాలింది. కాపలావానికి యీ మాటలు రుచించకపోగా చెరువు మైల పడిపోయిందని కోపం ఎక్కువ అయింది - 'ఓసి మాలముండా, అంత కళ్లు పై కెక్కాయిటే - ఎవరు నీళ్ళుతోడి పోయకపోతే వచ్చిన దారినే యింటికి తిరిగి పోలేక పోయావా! ఒక నాటికి మంచి నీళ్ళు లేకపోతే చస్తారా ఏం! ఉప్పునీళ్ళు దిగవా," అంటు కాపలావాడు గద్దించి కొట్టబోయినట్లు మాట్లాడడం ప్రారం

భించాడు. 'ఆ సంగతి నాకు తెలుసు నాదారికి అడ్డం రాకండి' అంటు కొంచెం ధైర్యంతో ముందుకు సాగబోయింది. ఇంతకు నీళ్ళకుండ నీకు దక్కే రోజులు లేవంటు చేతిలోవున్న కఱ్ఱతో కుండకేసి గట్టిగ ఒక దెబ్బ కొట్టాడు - కఱ్ఱ చివరిభాగం లీల గూడుకు గట్టిగ తగిలింది. యీ దెబ్బతో గూడు జారిపోయి నట్టనిపించింది - పగిలిన కుండపెంకులు లీల శరీరాన్ని అక్కడక్కడ గాయ పరచాయి. 'ఓరి నీ జిమ్మదియ్యా నీ కండలు కోసి కాకులకు గ్రద్దల కెయ్యా ఎంత దెబ్బకొట్టావురా ముడ నష్టపోడా" అంటు కుడిచేతితో దెబ్బతగిలిన ఎడంభుజం గట్టిగ పట్టుకుంది - అమాయకంగా ఏడుస్తూ నోటి కొచ్చిన బూతులన్ని తిట్టడం మొదలు పెట్టింది - కులపిచ్చి తలకెక్కిన ఆ చెరువు కాపరి బూతులు తిడుతు రెండవసారి లీలపైకి కఱ్ఱ ఎత్తబోయాడు లీల శరీరం కాపలావాని కఱ్ఱకు అప్పజెప్పి చూస్తూ వూరుకుంటే లాభం లేదనుకుంది - ప్రక్కనే వున్న ఒక బరువైన గట్టిరాతితో కాపలావాని నొసట వేసి కొట్టింది- కాపలావాడు దెబ్బతో దద్దరిల్లి పోయాడు. తెప్పరిల్లుకొని కళ్లు తెరచేటప్పటికి లీల యింటికి పారిపోయి వచ్చింది. కాపలావానికి అంటరాని వ్యవసాయ కూలీలమీాద ప్రత్యేకమైన ద్వేషమంటు ఏమీా లేదు అతనుకూడ రోజంతా కష్టపడితే గాని పొట్ట గడవదు - సమాజంలో కులాలనేవి మంచి కోసరమే ఏర్పడ్డాయని, కులధర్మం తప్పి నడుచుకున్న వారిని గట్టిగ శిక్షించాలని, అలా శిక్షించనినాడు సంఘంలో చిన్న పెద్ద, ధర్మం, న్యాయం యిత్యాదులకు చోటు వుండదని ఒకానొక బ్రాహ్మణుడు హరికథా కాలక్షేప సందర్భములో

చెప్పగా యీ చెరువు కాపలావాడు విన్నాడు - ఆమాటలు వానికి బాగా నాటాయి - లీలను కొట్టినదికూడ ప్రత్యేకమైన ద్వేషంవుండి మాత్రం కాదు - ఒకసారి గట్టిగా భయంర చెపితే రెండో సారి చేయకూడని పని చేయదని అతని అభిప్రాయం - కాపలావాని కులంకన్న తక్కువ కులం వాళ్లు అవ బడే మాల మాదిగ లున్నారనే సంతృప్తికూడ అతనిలో అప్పుడప్పుడు కలుగుతుంది. ముఖ్యమైన మరొక విషయంకూడ కాపలావాని దృష్టిలో లేకపోలేదు. అతని బాధ్యత - తప్పని సరిగ నిర్వర్తించవలసిన కర్తవ్యం చెరువులో మేకలు, పశువులు పడకుండా చూడాలి. అంటరాని వాళ్లు చెరువును మైల పరచకుండా చూడాలి - యీ పనులు చేస్తేనేగాని గ్రామ పెత్తందార్లు అతనికి జీతపురాళ్లు ముట్టచెప్పరు. అందుకే కాపలావాడు లీలపై అంత తీవ్రంగ చేయిచేసికోవలసి వచ్చింది.

లీల ఏడుస్తూనే యింటికి పరుగున వచ్చింది. అప్పటికి పల్లెలోని జనమంతా పొలంమీదకి పనులకు వెళ్లారు - ఇంటి వద్ద ముసలివాళ్లు పిల్లలు మాత్రమే మిగిలారు. లీల తల్లికూడ కూతుర్ని వెంట బెట్టుకొని పొలం పోవడానికి కూతురు కోసరం ఎదురు చూస్తుంది. లీల ఏడుస్తు దెబ్బతగిలిన గూడు తల్లికి చూపించింది. తల్లి ఒక్కమ్మడిగ ఆవురుమని ఏడ్చింది. నిదానంగ జరిగిన వృత్తాంతమంతా తెలిసికుంది. తల్లి వయస్సు మళ్లిన దగుటవలన, సహనం లేక పోవుట వలన తన కూతుర్ని కొట్టినవాడు తన సమీపంలో లేక పోయినప్పటికి బజారు కెక్కి చెడా బడా తిట్టడం ప్రారంభించినది. దీనితో జరిగిన

విషయమంత బజారు కెక్కింది. సాయంత్రం వేళకు దగ్గర పొలాలలో పనిచేసే ప్రజలకుకూడ లీలను ఎవరో కర్రతో కొట్టారనే వార్త తెలిసింది. ఈ వృదంతంపై ముసలివాళ్ళ అభిప్రాయాలకు యువకుల అభిప్రాయాలకు స్పష్టమైన భేదాలు పొడచూపాయి - వయసు మళ్లిన వారంతా లీల చెరువులోకి దిగడం తప్పని ఖండిస్తూనే ఏదో కుర్రముండ తెలియక దిగినంత మాత్రాన కొట్టడం ఏమిటి అనే ధోరణిలో మాట్లాడడం మొదలెట్టారు - యువకులు మాత్రం చెరువు ఏకులాలకో చెందిన కొంతమందిది కాదు - ఆనీళ్ళు గ్రామంలోవున్న ప్రజలందరిసొత్తు చెరువులో దిగటానికి సవర్ణుల కెంత హక్కు వుందో హరిజనులకు అంతే హక్కువుంది - గతంలో జరిగినదేదో జరిగిపోయింది - ఇకనుండి మాత్రం చెరువులోదిగి నీళ్లు తెచ్చుకో వలసిందే. ఎవరయిన అడ్డంవస్తే వాళ్ళ అంతు ఏదో తేల్చుకో వలసిందే అనే ధోరణిలో వుద్రేక పూరితంగ వాదోప వాదాలలోకి దిగారు - సాయంత్రం అయ్యేటప్పటికి లీల గూడు బాగా వాచి బరువు చేసింది. తన పూరియింట్లో ఒక మూలను కుక్కిమచంలో పరుండి బాధపడుతూంది - తల్లి దెబ్బతగిలిన చేతికి వేడినీళ్ళ కాపు వేస్తున్నది. చుట్టు ప్రక్కలనున్న అమ్మలక్కలు దెబ్బతిన్న లీలయింటికివచ్చి పలకరించి పోతున్నారు.

లీల చిన్నతనంలోనె తండ్రి చనిపోయాడు - ఒకబీద వ్యవసాయకూలీ కుటుంబంలో జన్మించడం వలన చిన్నతనం నుండి కష్టించి పనిచేయాల్సి వచ్చింది. పల్లెలోవున్న ఎలి

మెంటరీ పాఠశాలల్లో మూడు తరగతులవరకు చదువుకుంది- తండ్రి చావుతో బడి మానివేసింది - తల్లితో కలసి పొలంలో పనిపాటలకు పోతు తనపొట్ట తానే నింపుకోవడం మొదలెట్టింది. అదే పల్లెలో యిద్దరు ఆడపిల్లలు బోర్డింగులో ఐదవ ఫారం చదువుకుంటూ వుండేవాళ్ళు. ఆపిల్లలతో లీలకు మంచి పరిచయం - లీలంటే వాళ్ళకుకూడ గొప్ప గౌరవం - వాళ్లిద్దరి సహాయంతో లీల పుస్తకాలు కథలు చదవడం, ఒక మాదిరిగ వ్రాయడం నేర్చుకుంది - సుమతీ శతకంలోని పద్యాలు కంఠోపాఠంగవచ్చు - లీల తన సంతకంకూడా గోలుసుకట్టుమీద వ్రాయడం నేర్చుకుంది. - ఆమె వయస్సు అప్పటికి పదిహేను సంవత్సరాలు. లీల చిన్ననాటి నుండి ఎండలో ఎండుతు వానలో తడుస్తు కష్టించి బ్రతికింది - ప్రపంచంలో ప్రకృతితప్ప మరెవ్వరు ఆమెస్థితిని గురించి ఆలోచించిన వారుగాని సానుభూతి తెలిసిన వారుగాని లేరు: సంవత్సరములోని అన్ని ఋతువులు లీల సుందర దేహాన్ని తీర్చి దిద్దడంలో తమ శాయిశక్తులా తోడ్పడ్డాయి-పక్షుల పాటలు కోకిల మధురగానము ఆమె సంగీత కళకు మెరుగు పెట్టాయి- లీల సెలయేళ్ళ వెంబడి తిరుగుతు అలలతో ఆడుకునేది - లీల అందాన్ని బీదతనంగాని, చింపిరి గుడ్డలుకాని దాయలేక పోయినవి. ఎంత పాతచీర అయిన ఏరూపంలో ధరించిన లీల అన్ని వేళల గొప్ప అందంగ కనబడుతుంది - ఒకసారి లీలను చూచినవ్యక్తి తన జీవితంలో మరి ఏరకమైన అందమైన వస్తువునైనా మరువ వచ్చునేమోగాని లీల కండ్లను ముఖ వర్ఛస్సును, అందమైన ఆ దేహాన్ని మరువలేడు - లీల

కండ్లలో గొప్ప తేజస్సు ఆకర్షణవుంది - ఒక్క మాటలో చెప్పాలంటే లీల ప్రకృతియొక్క నిజమైన ముద్దులబిడ్డ - అందానికి మరోపేరు లీల. కుంకుమ భరిణె, శుభ్రంచేయబడిన ఎండు నత్తగుల్లలో దాచిన కాటుక, చెక్క దువ్వెన, చిన్న అద్దం - కర్రతో చేయబడిన చిన్న పెట్టె - యివి ఆమె మొత్తంఆస్థి - లీలకు రెండే రెండు జతల గుడ్డలు - వర్షంలో తడిసివస్తే కట్టుకోడానికి అదనంగ మరోజత కావడి పెట్టెలో దాచుకునేది - చలికాలంలో కప్పుకోడానికి కనీసం దుప్పటి కూడ లేదు - ఇంట్లో ఎలుకల బాధనుండి బయట పడటానికి ఒక పిల్లిని పెంచింది - నమ్మకమైన మరో కుక్క-కూడ వుంది- యింట్లో మిగిలిన సామానులో సగం పైవరకు కుండలు - ఒక కుండలో మట్టివడ్లు, రెండవ దానిలో తవుడు, మూడో దానిలో నాలుగైదు మానికలకు మించని బియ్యం - ఒక పిడతలో కారం, మరో దాంట్లో చింతపండు మిరపకాయలు మూడో దాంట్లో వుప్పు - సూర్యావతి పల్లెకు రాకమునుపు కుడితినీళ్ళ కుండకూడా ఇంట్లోనే వుండేది. ఆరోగ్య సూత్రాలు, శుపరిభ్రత తెలిసిన తరువాత కుడితికుండ బయట పెట్టడం మొదలెట్టారు.

జగ్గయ్య పొలంనుండి రాత్రి ఎనిమిది గంటలకు ఇంటికి వొచ్చాడు - మనిషికి మంచిగిర ఎక్కినట్లు వున్నాడు. గిరని వదలించ డానికేమో ఒకబాపుటా బీడీని ముట్టించాడు- శ్రీనివాసరావు భోజనంచేసిన తరువాత పల్లెకు వచ్చి అత పాటూ వుంది. యథాప్రకారం ఆరోజుకూడా జగ్గయ్య యింటికె

వచ్చాడు. శ్రీనివాసరావుకు దారిలో ఎవరో ఒక హరిజన స్త్రీ చెరువులో బాన వేసినందుకు దెబ్బలు తిన్నదని చూచా యిగ విన్నాడు. అసలు ఆరోజు వల్లెకు వచ్చింది పూర్తి వివ రాలు తెలిసికొని జగ్గయ్యతో మాట్లాడిపోవాలని వచ్చాడు- జగ్గయ్యకు యీ విషయం శ్రీనివాసరావు చెప్పిందాక అసలు తెలియనే తెలియదు - జగ్గయ్య యింట్లో రాత్రి పది గంటలకుగాని భోజనం తయారు కాదు - యింట్లో స్త్రీలు కూడ పొలం పనికి పోయి ఆలస్యంగ రావడమే యీ ఆల స్యానికి కారణం - భోజనం చేయకుండానే శ్రీనివాసరావుని వెంట బెట్టుకొని అసలు జరిగిన వృత్తాంత మేమిటో తెలిసి కోవాలని లీల యింటికే వచ్చారు.

లీలతల్లి తన యింటికి వచ్చిన రైతు - కూలినాయకు లిద్దరికి తగిన విధంగ పరామర్శచేసి కూర్చోడానికి చాప పరిచింది. తరువాత తల్లి చెరువువద్ద జరిగిన విషయమంతా పూసగ్రుచ్చినట్లు చెప్పింది - లీలకు వీరిద్దరు క్రొత్తగాదు- కూలీసంఘ సభ్యత్వంలో స్త్రీలను చేర్పించడంలో ఎదో ఒక సారి శ్రీనివాసరావు జగ్గయ్యలకు తోడ్పడుతూనే వుండేది- వీరిద్దరికన్న సూర్యావతితో లీలకు మంచి పరిచయం స్నేహం వుంది. సూర్యావతి వద్దనుండి లీల ఆరోగ్య సూత్రాలు మొదలుకొని ప్రపంచ రాజకీయాల వరకు నేర్చుకొంది - సూర్యావతి మొదట్లో పాటలద్వారా లీలనుఆకర్షించి తరువాత అమ్మ నవల చదివి వినిపించి ఆ తదుపరి లీలను పేపరు చదివేటంత వరకు తీసుకొచ్చింది. లీల సూర్యావతు లిద్దరు

పల్లెలో సమావేశాలు, బహిరంగ సభలు జరుగుతుంటే కలసి పాటలు పాడేవారు - ఇద్దరూ అక్క చెల్లెండ్రులాగే మెల్లగే వారు - ఇంట్లో చిన్న కిరసనాయిలు దీపం వెలుగుతోంది. జగ్గయ్య శ్రీనివాసరావు లీల మంచం దగ్గరకు పలకరించ డానికి పోయారు. మంచంమీదనుండి లేచి వీరిద్దరికి మర్యాద చేయాలని, తన గౌరవం చూపెట్టాలని లీల ప్రయత్నించింది. ఇద్దరు ఒక్కమ్మడిగ లేవనవసరంలేదని ఆమెను మంచంమీదే పండుకో వలసినదిగా కోరారు. "మొత్తం మీద మంచిపని చేశావు - దెబ్బకు దెబ్బతీసి మరీవచ్చావు" అన్నాడు జగ్గయ్య. శ్రీనివాసరావుకూడ ఏవో రెండు మాటలు మాట్లాడి "వాళ్ళ ముఖం వాళ్ళ దౌర్జన్యాలెంత, వాళ్లెంత. వాళ్ళకు చివరి రోజులు సమీపించాయి" అన్న శ్రీనివాస రావు మాటల్లో దివ్యమైన భవిష్యత్తు అంతా తమనే వరించ బోతున్నదనే ధ్వని స్పష్టమైనది. 'పనులు ఆచరణలో పెట్టడం ప్రసంగాలంత తేలికకాదు 'కామ్రేడ్' అంది లీల - వాళ్లిద్దరితో మాట్లాడినమాట యిదొక్కటే. లీల ఇంటినుండి జగ్గయ్య శ్రీనివాసరావులు అంకమ్మ చెట్టు వద్దకు బయలు దేరారు - రాత్రిపూట భోజనాలు అయిన తరువాత యువకు లంతా యీ చెట్టు క్రిందచేరి ఏదో బాతాఖాని కబుర్లు చెప్పుకుంటారు - అప్పటికా చెట్టుక్రింద చేరిన యువకులు చెరువువద్ద జరిగిన సంఘటనల్ని గురించి తర్జన భర్జనలు ప్రారంభించారు. ఒక వ్యవసాయకూలి యువకుడు శ్రీనివాస రావు నుద్దేసించి "ఏమండోయ్ కామ్రేడ్ గారు మీకులంగల వాళ్ళంతా మా కులంలేని వాళ్ళను వానదేవుడిచ్చిన నీళ్ళు

కూడ త్రాగనిచ్చేటట్లు కనబడటంలేదు - అయితే యిక బ్రతక మంటూరా చావమంటూరా" అని ఎటకారంగ మాట్లాడటం మొదలెట్టాడు- "మనలో చేవలేకపోతే యిత్తవాళ్ళ నీళ్ళు త్రాగవద్దంటూరు, రేపు గాలికూడ పీల్చడం మానేయ మంటూరు" అన్నాడు శ్రీనివాసరావు - తరువాత జగ్గయ్య శ్రీనివాసరావు గ్రామంలో భూస్వాములు యీ ఘటనపై ఏమను కుంటున్నారో తెలిసికోవాలని యువకుల్ని కొన్ని ప్రశ్నలేసి భోగట్టా సేకరించారు. కాపలావాణ్ణి లీల రాయిపెట్టి కొట్టిన విషయం కాపలా వాడుపోయి భూస్వాములతో విన్నవించుకొన్నట్లు, దీనిపై భూస్వాములకు మహాచెడ్డ కోపంవచ్చినట్లు తెలిసింది. బాపయ్య కొంచెం మాటల్లో ముందుకుపోయి "వెధవల్ని అసలు చెరువుకే రానీయం - ఉప్పునీళ్ళు త్రాగి వుండాల్సిందే. మాలవెధవలకు కూడ మంచినీళ్ళు కావాలట వాళ్ళ అబ్బగాళ్ళకు ఎవరికి చెప్పు కుంటూరో" అని మాట్లాడి రంకెలు వేసినట్లు తెలియ జేసారు- ఒక యువకుడు లేచి అసలు మేము చెరువు ముట్టుకోరాదని ఎక్కడ వ్రాయబడి వుందండి అని శ్రీనివాసరావును ప్రశ్నించాడు. యింతలోనే ఒకముసలివాడు కలుగజేసుకొని ఎక్కడా మన ముఖానే బ్రహ్మదేవుడు రాసిపెట్టాడు-దీనితో యువకు లందరికి మహాకోపంవచ్చింది. ఏవో మాటలుఅని ముసలాడిని నోరు మూయించారు. తరువాత జగ్గయ్య శ్రీనివాసరావులు చెరువులోని నీళ్లు హరిజనులంతా యథేచ్ఛగా ముంచి తెచ్చు కునే ఏర్పాటు త్వరలోనే చేయవలసి వుంటుందని, అందుకు భూస్వాములు అంగీకరించకపోతే ఒక వుద్యమం నడపవలసి

వుంటుందని అందుకు యువకులంతా సిద్ధంగ వుండాలని హెచ్చరించి వెళ్లిపోయారు.

శ్రీనివాసరావు గ్రామంలోవున్న రైతాంగం దృష్టికి హరిజనుల చెరువునీటి సమస్యను తెచ్చాడు - రైతాంగపు యువకులు శ్రీనివాసరావు లాగానే హరిజనులు స్వేచ్ఛగ నీళ్ళు ముంచుకోవాలి అని గట్టిగ వాదించడం మొదలెట్టారు- గ్రామంలో ఈ సమస్యమీద రెండు పార్టీలుగ చీలారు- ఎక్కువమంది తటస్థంగవుండి పోయారు - భూస్వాముల ముఠాకు బాపయ్య నాయకత్వం లభించింది. సంఘ సంస్కరణ, రాజకీయ భావాలుగల యువకులకు శ్రీనివాసరావు నాయకత్వం వహించాడు. రాజీ సంప్రదింపులతో హరిజనుల న్యాయమైన హక్కును భూస్వాములచేత గుర్తింప జేయడానికి శ్రీనివాసరావు తన శాయి శక్తులా ప్రయత్నించాడు. ప్రయోజనం ఏమీ కనబడలేదు - భూస్వాములు బహిరంగంగానే హరిజనులు చెరువును ముట్టితే తలలు ఎగిరిపోతాయి, పీనుగలు లేస్తాయి అని బెదిరించడం ప్రారంభించారు. శ్రీనివాసరావు జగ్గయ్యలు రాజీ బేరంతో లాభం లేదని ప్రజా సమీకరణకు, సమస్యపై ప్రచారానికి బయలు దేరారు. ప్రజాభిప్రాయాన్ని సేకరించడానికి ఒక కార్యాచరణ సంఘాన్ని ఏర్పాటు చేయడానికి ఒకసభ ఏర్పాటు చేసారు- ఆ సభకు రాజకీయ పార్టీలతో నిమిత్తం లేకుండ అంటు దోషానికి వ్యతిరేకంగ పోట్లాడాలనే ప్రతి సంఘ సంస్కర్తను ఆహ్వానించారు - వచ్చిన ప్రతినిధులంతా ఏక కంఠంతో

లక్ష్మి (శ్ర)వారము హరిజనుల చెరువునీటి ప్రవేశవారంగ నిశ్చ యించారు - ఆరోజు పెద్ద వూరేగింపు బహిరంగసభ జరపా లని తీర్మానించారు - సభకు వచ్చిన ప్రతినిధుల్ని వుద్దేశించి జగ్గయ్య యిలా వుపన్యసించాడు.

"గతంలో మేము అనేక పర్యాయములు చెరువు నీటిని స్వేచ్ఛగ తోడుకోనీయ వలసినదిగ భూస్వాములను కోరాము ప్రభుత్వానికి యీ సమస్యపై విన్నపాలు పంపుకున్నాము - మా మొర ఎవరూ ఆలకించలేదు. భూస్వాములు యిద్దరు సవర్ణులను జీతంపై నియమించి మాకు నీళ్ళు తోడిపోయించే ఏర్పాటు చేస్తామన్నారు - ఆపని చేయలేదు - యీరోజు వరకు మాయిండ్లలో ఏదయిన శుభకార్యం జరుగుతుంటే మేళ తాళాలతో గ్రామ వీధుల్లో తిరగ డానికి వీలులేదు ఐదు సంవత్సరాలనాడు మాగ్రామంలో బి. ఏ చదివిన ఒక యువ కుడు పెండ్లిచేసికొని గ్రామ బజార్లలో కారులో వూరేగు తుంటే ఆ నూతన వధూవరుల్ని పసుపు బట్టలతోనె కుల విచ్చ తలకెక్కిన యీ భూస్వాములు చావమోదించారు. గాంధిగారు అంటరానితనం పాటించడం మహాపాతకమన్నారు యీ గ్రామంలో హరిజనులు చెరువులో దిగరాదని వాదించే వాళ్ళలో ఎక్కువమంది కొత్తగ కాంగ్రెస్ మతం పుచ్చు కున్న పెద్దమనుష్యులే - మా న్యాయమైన హక్కులను ఆచరణలో పెట్టడానికి పూనుకుంటే యీ పెద్ద మనుషులు మా బుర్రలు పగల గొట్టిస్తామని బెదరిస్తున్నారు - యీ లాంటివారు సంఘానికి చీడ పురుగులు లాంటివారు -

వీళ్ళ బెదిరింపులను దౌర్జన్యాలను, సభ్యత నాగరికత తెలిసిన ప్రతివ్యక్తి ప్రతిక్షణంలోను ఎగిరించ వలసి వుంటుంది"- తరువాత పలువురు సంఘ సంస్కర్తల వుపన్యాసాల అనంతరం లక్ష్మీవారం చేయవలసిన ఏర్పాటులను గురించి కార్యాచరణ సంఘం ఆలోచించి సభను ముగించారు - సమావేశము ముగిసేవరకు రాత్రి తొమ్మిది గంటలయినది. ప్రతినిధులంతా అంటరాని తనం నశించాలంటూ నినాదాలు చేస్తూ వెళ్ళిపోయారు. ప్రజల నినాదాల ధ్వనికి దద్దరిల్లిన చంద్రుడు నీలి మబ్బుల్ని చాటుచేసికొని మటుమాయమయ్యాడు - చంద్రుడులేని రాత్రిని చీకటి ఆవరించింది.

ఒకవైపున రైతు - కూలీప్రతినిధులు సంఘ సంస్కర్తలసాయంతో హరిజనులను చెరువునీటి ప్రవేశానికి సిద్ధపరుస్తుంటే రెండవ వైపున యీ ప్రవేశాన్ని ఛిన్నా భిన్నం చేయించడానికి, వీలయితే దౌర్జన్యంతో హరిజనులను తరిమి వేయడానికి బాపయ్య గ్రామంలోని ధనిక భూస్వాములతో కలసి కుట్రలు పన్నుతున్నాడు. బాపయ్య గ్రామంలోని సవర్ణు లందరిని అంటరాని వాళ్ళకు వ్యతిరేకంగ త్రిప్పాలని చేసిన ప్రయత్నాలు రైతు యువకులు శ్రీనివాసరావు సహాయంతో భగ్నం చేశారు.

కాంగ్రెస్ అంటే అభిమానమున్న గ్రామంలోని యువకుల్ని కమ్యూనిస్టుల ప్రేరేపణతో జరుగుతున్న యీ వుద్యమాన్ని అణచడానికి తనవైపుకు ఆకర్షించు కోవాలన్న బాపయ్య ప్రయత్నాలు విజయవంతం కాలేదు. చివరకు పెద్ద

భూస్వాములు పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేకుల్ని, కులపిచ్చ గాళ్ళనుచేర్చి లక్ష్మీవారంనాడు చెరువునీటి ప్రవేశం చేయ బోయే వాళ్ళను చెదర గొట్టడానికి నిశ్చయించుకున్నారు - రైతు కూలీలలో వచ్చిన యీఐక్యత చుట్టుప్రక్కల గ్రామా ళలోని భూస్వాములకు చాల భయాన్ని ఆందోళనను కలుగ జేసాయి - కష్టజీవుల్లో వచ్చిన యీ ఐక్యత భవిష్యత్తులో తమవునికికే భంగం కలిగిస్తుందని భూస్వాములు గ్రహిం చారు - దీనితో భూస్వాములు పెద్ద ఎత్తున విరాళాలు వసూలుచేసి అంటరాని వ్యవసాయ కూలీలను ఆ వుద్యమానికి నాయకత్వం వహిస్తున్న నాయకులను అన్ని విధాల అణచడానికి సిద్ధపడు తున్నారు - బలప్రయోగంతో కూలీ లను అణచడానికి కావలసిన గూండాలను కూడ డబ్బుతో కొనివేసి తమ అదుపాజ్ఞలలో వుంచారు - మొదట్లో పోలీ సుల సహాయంతో హరిజనులను అటకాయించాలనుకున్నారు. ప్రభుత్వ శాసనం ప్రకారం పబ్లిక్ భావులు చెరువులు అన్ని కులాలవారు ఏలాంటి భేదాలు లేకుండ వుపయోగించు కోవచ్చు - యీ సమస్యపై పోలీసులు తమతో కలిసి రారని తేలిపోయింది - అయితే పోలీసులు హరిజనులకు సాయం రాకుండా వీలయితే తప్పుడు కేసులు, దొమ్మి దౌర్జన్యంగ వ్యవరించారనే కేసులు హరిజనులపై మోపడానికి ముందు గానే పోలీసు ఉద్యోగస్తులతో కుమ్మక్కై అయ్యారు.

ఇరవయి నాలుగు గంటలు దాటితే లక్ష్మీవారం ప్రవేశిస్తుంది - గ్రామంలో రక రకాల వదంతులు వుకార్లు

పుట్టాయి - చెరువు దగ్గరకువస్తే అవర్ణుల పుచ్చలు పగిలి పోతాయని పీనుగలు లేస్తాయని గ్రామ చరిత్రలో ఎన్నడు జరుగనంత హింసాకాండ రక్తపాతము మంచినీటి చెరువు వద్ద జరుగ బోతుందని ప్రచారం లేవనెత్తారు - గ్రామంలోని అనేకమంది తటస్తంగవున్న ప్రజలు ఏమి ప్రమాదాలు వాటిల్లు తాయోనని భయపడ సాగారు - భూస్వాములు మాత్రం హరిజనులు యీసారితో చెరువు నీటికి చెడటమే గాక మా పొలాలలో వాళ్ళ పశువులు తిరగ డానికి నోచుకో లేదని బెదరిస్తున్నారు-మాలలు త్రాగిన చెరువులో సవర్ణులుకూడ త్రాగితే తమ బిడ్డలకు పెండ్లి సంబంధాలు ఎలా వస్తాయని చివరి పాచిక ప్రయోగించి సవర్ణులను రెచ్చ గొట్టడానికి మరొకసారి ప్రయత్నించారు.

కార్యాచరణ సంఘంవారు మాత్రం ఎప్పటి కప్పుడు భూస్వాముల దుష్ప్రచారాన్ని దౌర్జన్య పద్ధతులను తీవ్రంగ ఖండిస్తు కరపత్రాలువేసి ప్రజలకు పంచిపెడు తున్నారు - వీధి మీటింగులు బహిరంగ సభలద్వారా చుట్టు ప్రక్కల గ్రామాలలో సమస్యపై ప్రజలకు సావధానంగ నచ్చజెప్పి సామాన్య ప్రజలను ఒప్పించ డానికి ప్రయత్నించారు. రైతు కూలీ కార్యకర్తలు సహనాన్ని కోల్పోకుండా భూస్వాముల ప్రచారానికి రెచ్చి పోకుండా ప్రశాంతంగ తమ ప్రచారాన్ని యింటింటికి తీసుకు పోయారు.

తెల్లవారింది - లక్ష్మివారం ప్రవేశించింది. పల్లె నుండి చెరువు వరకుగల మార్గాన్ని తోరణాలతో అలంక

రించారు, 'అంటరానితనం నశించాలి' అనే నినాదాలుగల వాల్ పోష్టర్లు గోడలకు చెట్లకు అంటించారు - ఊరేగింపుకు ముందు రెండు వందల మంది వాలంటీర్లను సుబ్బయ్య సమావేశ పరచాడు - కొంచెం సేపు వాలంటీర్లు రెండు వరుసల్లో నిలబడి కవాయి జేసారు. తరువాత వాలంటీర్ల నుద్దేశించి జగ్గయ్య శ్రీనివాసరావులు వూరేగింపులోను, చెరువు దగ్గర వాలంటీర్లు తీసికో వలసిన బాధ్యతలను గూర్చి ప్రత్యేకంగ వివరించారు.

ఉదయం పదిగంటలయింది - అనుకున్న ప్రకారం ప్రజలంతా అంకమ్మ చెట్టు క్రిందికి చేరుకుంటున్నారు. ప్రతి వారి చేతిలోను ఒక కడవో లేక కుండో వున్నాయి - ఇత్తడి బిందెలు కడవలు బహు కొద్దిగా మాత్రమే కనబడు తున్నాయి - సూర్యావతి, లీల స్త్రీల నందరిని రెండు వరు సల్లో నిలబెడు తున్నారు. ఇండ్లలో మిగిలి పోయిన జనాన్ని వాలంటీర్లు తీసి కొస్తున్నారు - పల్లెలో ఎవరూ లేకుండ చూసి భూస్వాములు పల్లెకు నిప్పు పెట్టిస్తారేమోననే అను మానంతో పిల్లలు ముసలివాళ్ళు పల్లెను కాపాడు కోడానికి యిండ్లవద్దే మిగిలి పోయారు - రెండు వరుసల్లో ఊరేగింపు బయలు దేరింది. సుబ్బయ్య జగ్గయ్యలు ఆకర్షణీయమైన నినాదాలతో పాటలతో పురుషుల వూరేగింపును నడిపిస్తున్నారు - సూర్యావతి లీలలు స్త్రీల వూరేగింపుకు నాయకత్వం వహించారు - శ్రీనివాసరావు మొత్తం వూరే గింపును సైకిలుమీద తిరుగుతూ పరిశీలిస్తున్నాడు. ఊరే

గింపు గ్రామ ముఖ్య వీధులన్నిటిని తిరిగి చివరకు చెరువును సమీపించింది. ఊరేగింపు చెరువును సమీపించే టప్పటికి కొంత చిందర వందరగ తయారయింది - సుబ్బయ్య నాయకత్వాన ప్రజలందరిని రెండు వరుసల్లో యుద్ధరంగానికి సిద్ధపడుతున్న సిపాయిల్లాగ నిలబెడు తున్నారు- కొన్ని వందల మంది వూరేగింపులో పాల్గొన్నారు. వీరుగాక ఏమి జరుగు తుందో చూడాలనే ఆతురతతో మరికొన్ని వందలమంది చెరువు గట్టుమీద నిలబడ్డారు - బాపయ్య నాయకత్వాన భూస్వాములు అసలు హరిజనులు చెరువులో దిగకముందే అటకాయించి దౌర్జన్యంతో పంపి వేయాలను కున్నారు. వందల సంఖ్యలోవున్న ప్రజా సమూహాన్ని చూచి భూస్వా ములు తమ ఎత్తుగడలను మార్చుకోవలసి వచ్చింది. రెండు వరుసల్లోను ముందు నిలబడిన యిద్దరిని శ్రీనివాసరావు చెరువు లోనికి తీసి కెళ్లారు - వాళ్లిద్దరు నీళ్ళుముంచి బయ టకు తెచ్చారు - నీళ్లు కుండలతో వున్న యీ యిద్దరిని మరోలైనులో తూర్పుముఖం పట్టించి సుబ్బయ్య నిలబెట్టాడు.

ఈవిధంగ ప్రతివారు నీళ్లు ముంచుకొని క్రొత్త వరు సలో నిలబడుతున్నారు.- భూస్వాముల ముఠాకు ఈ ప్రజా సహాయాన్ని చూస్తుంటే కాళ్ళు వణుకు తున్నాయి - రెండో వైపున చెరువులోదిగి మైల పరుస్తుంటే వళ్ళంతా మంటలు మండి పోతున్నాయి - దీనితో బాపయ్య కొనితెచ్చిన రౌడీలు చెరువులో నీళ్ళు ముంచుకునే వారిని గేలిచేయడం బూతులు తిట్టడం ప్రారంభించారు.

చెరువుకు కొంచెం దూరంలో అట్టి పెట్టిన రౌడీల జట్టు రాళ్ళు మట్టిగడ్డలు విసరడం ప్రారంభించారు. అప్పటికే రాళ్ళు విసరడం వలన పది కుండలు పగిలి పోయాయి - కొంతమంది స్త్రీ పురుషులకు దెబ్బలు తగిలాయి - దీనితో రౌడీల చర్యలకు వూరేగింపులోనుండి ఆవేశం బయలు - దేరింది - శ్రీనివాసరావు జగ్గయ్యలు భూస్వాములు రౌడీల చేత ఏవిధంగ శాంతంగ వున్న ప్రజలపై రాళ్ళు విసిరిస్తున్నది మేగఫోనులో వివరిస్తున్నారు - సుబ్బయ్య వాలంటీరు దళాన్ని వేరే లైనులో నిలబెట్టి కదం త్రొక్కిస్తున్నాడు - అంతా నీళ్ళు ముంచుకోవడం పూర్తి అయినది. మరల జయ జయ ధ్వనులతో ఆ వూరేగింపు యింటి ముఖం పట్టింది - తమ ప్రయత్నాలన్ని విఫల మయ్యాయనే అక్కసుతో యీసారి జోరుగ రాళ్లు రువ్వడం ప్రారంభించారు - వాలంటీరు దళం కదం త్రొక్కుతు వూరేగింపును కాపాడ డానికి ప్రయత్నిస్తూంది. సుబ్బయ్య యీ రౌడీలను సమీపించి వాళ్ళను పారద్రోలకపోతే క్షేమం కాదని జగ్గయ్య శ్రీనివాసరాలను హెచ్చరించాడు - వాళ్ళు అందుకు అంగీకరించారు.

'ముందుకు నడువ్' అంటు సుబ్బయ్య కాషన్ యిచ్చాడు - కొంత సేపటిలోనే దళం రాళ్ళు రువ్వుతున్న రౌడీలను సమీపించింది. 'దెబ్బ కొట్టు' అంటు సుబ్బయ్య రెండోసారి కాషన్ యిచ్చాడు - దళం మూడు జట్లుగ విడిపోయి కర్రలన్ని ఒకేసారి ఎత్తారు - అంత వరదాక బండ బూతులు తిడుతు రాళ్ళు రువ్వుతున్న రౌడీలు చిక్క బలం

చూపి యింటికి పారిపోయాడు ఊరేగింపు మరల అంకమ్మ చెట్టును సమీపించినది - అక్కడ సమావేశమైన ప్రజలు తమ న్యాయమైన హక్కుల సాధన కోసరం ప్రాణాలనైనా బలిపెట్టి సంరక్షించు కుంటామని శపథంచేసి నిలబడి పోయారు.

నాటినుండి హరిజనులు చెరువు నీటిని నిరాఘాటంగ తెచ్చుకుంటున్నారు. బాపయ్య ముఠా పల్లె ప్రజలను చెరువు నీటికి రాకుండ చేయాలని తరువాత చేసిన ప్రయత్నాలను కూడ కూలీలు ఐక్యంగ ఎదిరించి ఓడించి వేశారు.

రైతు-కూలి సంఘాల నాయకత్వాన బయలు దేరిన పబ్లిక్ భావులు - చెరువుల ముట్టడి వుద్యమం చాలా గ్రామాలకు ప్రాకింది - హరిజనులు నిర్భయంగ పబ్లిక్ భావులు చెరువులు వుపయోగించు కోవడం మొదలెట్టారు- వ్యవసాయకూలీ సంఘం గ్రామాలలో సాంఘిక న్యాయం కోసరం. కూలీల ఆర్థికమైన హక్కుల కోసరం పోట్లాడడంతో దానిబలం ప్రతిష్ట ప్రజలలో బాగా పెరిగింది.

వెంకటరత్నం కొన్ని నెలలనుండి క్రొత్త ప్రాంతాలలో వుండి పార్టీని నిర్మిస్తున్నాడు - అందువల్లనే చెరువు సమస్య వచ్చినపుడు వెంకటరత్నం సలహాగాని సహాయం గాని జగ్గయ్య శ్రీనివాసరావులకు లభించలేదు - వెంకటరత్నం లేని కాలంలో రైతు- కూలీలు సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగ సాగించిన పోరాటం చరిత్రను జగ్గయ్య ఒక వుత్తరం రూపంలో వెంకటరత్నానికి పంపించాడు.

డియర్ కామ్రేడ్ వెంకటరత్నం.

పాలేళ్ళ సమ్మెపై నేను, శ్రీనివాసరావు పంపిన రిపోర్టు అందినదని తెలియ జేసారు. రిపోర్టు మీద మీరు వ్రాసి పంపిన విమర్శ చేరినది. విమర్శ మొత్తంమీద బాగానే వుందని కామ్రేడ్లు అంతా అంగీక రించారు - పాలేళ్ళ సమ్మెలో పాల్గొని చివరి వరకు గట్టిగ నిలబడిన యువకు లదంరికి రాజకీయ పాఠశాలపెట్టి మార్క్సిష్టు మూల సూత్రాలు తత్వశాస్త్రం, ఆర్థిక శాస్త్రం బోధించడం జరి గింది. కామ్రేడ్ శ్రీనివాసరావు యీ పాఠశాల నిర్వ హణలో అద్భుతంగ పనిచేశాడు- యీ పాఠశాలలో ముగ్గురు హైస్కూలు టీచర్లుకూడ మనకు రహస్యంగవచ్చి పాఠాలు చెప్పిపోయారు - మీరులేని కొదువ ఎంతయిన వుంది - దాని వలన తీరని నష్టంకూడ కలిగిందని భావిస్తాను - తరు వాత చెరువు దగ్గర భూస్వాములకు మన వ్యవసాయ కూలీ లకు పెద్ద గొడవలు జరిగినవి - కూలీలకు అండగ రైతులను కూడ సమీకరించి చెరువునీళ్ళు హరిజనులు యథేచ్ఛగ తెచ్చుకునే టట్లు ఆవుద్యమాన్ని నడిపాము, ఈసందర్భములో సనాతనులు భూస్వాములు మనల్ని తీవ్రంగ రెచ్చగొట్టి పేద ప్రజానీకంలో సవర్ణ అవర్ణ భేదాలు సృష్టించాలని దానిపై మన రైతుకూలి ప్రజా వుద్యమాలను విచ్ఛిన్నం చేయాలని ప్రయత్నించి విఫల మయ్యారు - పబ్లిక్ బావులు చెరువులు హరిజనులకుపయోగపడేటట్లు మరికొన్ని గ్రామాలలో కూడ మన జెండా నాయకత్వాన చేయగలిగాం - దీనితో

వందలు వేలు సంఖ్యలో అంటరాని యువకులు మన ప్రజా ఉద్యమాల వైపుకు ఆకర్షించబడు తున్నారు - వీళ్ళందరిని రాజకీయంగ అభివృద్ధిచేసి కమ్యూనిస్టు పార్టీలో ఏలా యిముడ్చుకోవాలా అనేదే పెద్ద సమస్యగ వుంది - మీరు వచ్చిన తరువాత వివరాలన్ని మాట్లాడు కుందాము. కొద్ది రోజుల్లో మీరు యీ ప్రాంతాలలో లేని కాలంలో జరిగిన పని రిపోర్టు పూర్తిగ పంపుతాను - ఈ రిపోర్టుపై మీ అభిప్రాయాలు కూడ తెలియ జేయండి - అక్కడి కామ్రేడ్సు అందరికి నా హృదయ పూర్వక విప్లవాభి వందనాలు తెలియ జేయండి.

ఇట్లు
విప్లవాభి వందనములతో
భవదీయుడు,
జగ్గయ్య.

విప్లవ నగర్
తేది

తరువాత కొద్ది రోజులకు జగ్గయ్య శ్రీనివాసరావులు చర్చించి రైతు - కూలి ఉద్యమాల పురోగతిని తెలియ జేసే పూర్తి రిపోర్టును వ్రాసి వెంకట రత్నానికి పంపుతారు. రిపోర్టు చదివిన వెంకటరత్నం ఉద్యమంలో వచ్చిన పెద్ద గుణాత్మకమైన మార్పుకు సంతోషిస్తాడు - మట్టి ముద్దలలో నుండి మంచి రత్నం ఉద్భవించినదని జగ్గయ్య పనిని గూర్చి తనలో తాను ముచ్చట పడతాడు - పార్టీ కమిటీకి జగ్గయ్య పేరున యీ క్రింది ఉత్తరం వ్రాస్తాడు.

డియర్ కా(మేడ్ జగ్గయ్య.

మీరు పంపిన రిపోర్టు చేరినది. అంటరాని వ్యవసాయ కూలీలు (తాగే నీటిపై తమ హక్కును నిలుపుకోడానికి పాలేళ్ళు తమ న్యాయమైన జీతాల కోసరం జరిపిన పోరాటాలకు మీ నాయకత్వాన అనుసరించిన ఎత్తుగడలు పోరాట పద్ధతులు అద్భుతంగ వున్నాయి - మన విప్లవం విజయం పొందుటలో కార్మికులు రైతు వ్యవసాయ కూలీలు (ప్రముఖ పాత్ర వహిస్తారని వేరే (వాయ నవసరంలేదు - అంటరానితనానికి వ్యతిరేకంగ వుద్యమాలు నడిపేటపుడు కష్టజీవులైన అవర్ణ సవర్ణ (ప్రజలలో చీలికలు ముఠాలు రాకుండ జా(గత్త వహించాలి. కులతత్వ వాదులు మన కష్ట జీవుల్లో కులంపేరిట జొరబడి మన విప్లవ వుద్యమానికి తూట్లు పొడిచే అవకాశం వాళ్ళకు ఎక్కడ యివ్వకూడదు- పీడిత(ప్రజల విముక్తి కోసరం జరిగే పవి(త పోరాటంలో కష్టజీవులంతా ఒకే కులానికి చెందిన వారనే చైతన్యం వారిలో కలుగ జేయాలి. ఈ నగ్న సత్యం (ప్రజలు ఎంత త్వరగ (గహించితే అంత త్వరగ దోపిడి వర్గాల దుష్టవిధానాలను అంత మొందించగలం - కార్మిక కర్షకుల తరఫున ఆర్థిక పోరాటాలకు పిలుపుయిచ్చే (ప్రతి సమయంలోను కార్మిక వర్గంయొక్క రాజకీయ సిద్ధాంతా లేమిటోకూడ వారికి వెంటనే నచ్చజెపుతూ వుండాలి. (ప్రతి చిన్న విషయం కార్మికవర్గ దృక్పథంతో ఆలోచించడం పరిష్కరించడం నేర్చుకోవాలి - నేను మీ (ప్రాంతానికి వచ్చేలోపుగ పెద్ద

ఎత్తున వేల సంఖ్యలో వ్యవసాయ కూలి సంఘ సభ్యత్వం చేర్పించాల్సి వుంటుంది. నేను వచ్చిన తరువాత రాజకీయ పాఠశాల, వ్యవసాయకూలి మహాసభల విషయం సాకల్యంగ చర్చించి నిర్ణయాలు తీసికుందాము – శ్రీనివాసరావు సూర్యావతి లీల మొదలైన మన కామ్రేడ్సు అందరికీ నా విప్లవాభివందనములు తెలియజేయండి.

ముగించలేక ముగిస్తాను,

తేది భవదీయుడు
రెడ్ ఫోర్టు వెంకటరత్నం

జగ్గయ్య పాలేరు వృత్తిని పూర్తిగ మానివేయడం జరిగింది – – కూలిమీద కుటుంబాన్ని పోషించుకుంటు మిగతా కాలంలో వ్యవసాయకూలి వుద్యమాన్ని నిర్మించి కూలీల హక్కుల కోసరం పోరాటాలు నడపడంలో కష్టజీవుల నాయకుడుగ పేరు మ్రోగాడు. శ్రీనివాసరావు రైతుల పైపడుతున్న అధిక పన్నుల భారం ప్రభుత్వం తొలగించాలని, రైతులకు కావలసిన ఎరువులు విత్తనాలు ప్రభుత్వం సకాలంలో సరసమైన ధరలకు అందించాలని ఆందోళన సాగించడంద్వారా రైతులలో మంచిపేరు పలుకుబడి సంపాదించాడు – రైతు లందరిని రైతు సంఘాలలో సంఘటిత పరచి జమిందారి భూస్వామిక విధానానికి వ్యతిరేకంగ దున్నేవారికే భూమిపై హక్కులభించాలనే నినాదంపై రైతు వుద్యమాన్ని నిర్మించాడు. సూర్యావతి బాల, మహిళా సంఘాలను స్థాపించి స్త్రీలకు పురుషులతోపాటు

సమానమైన ఆర్థిక సాంఘిక హక్కులు కావాలనే చైతన్యం స్త్రీలలో కలుగ జేయడం ప్రారంభించింది.

వెంకటరత్నం తిరిగివచ్చి జగ్గయ్య శ్రీనివాసరావు లను కలసికున్నాడు - తరువాత అనేక పిర్కాలనుండి వచ్చిన రైతుకూలీ వుద్యమాలలో పనిచేసే ప్రముఖ కార్యకర్తలతో సమావేశం ఏర్పాటు చేయబడింది. వ్యవసాయ కూలీ మహాసభ అవసరాన్ని, మహాసభ విగ్రజయం చేయడానికి కావలసిన డబ్బు ప్రచారాల విషయం, కార్యకర్తలు తక్షణం నిర్వహించ వలసిన కర్తవ్యాలనుగూర్చి వెంకటరత్నం వివరించాడు. తరువాత జగ్గయ్య అధ్యక్షుడుగ శ్రీనివాసరావు కార్యదర్శిగాగల ఆహ్వాన సంఘాన్ని ఎన్నుకున్నారు. మహాసభ జరగవలసిన ప్రదేశం తేదీలు నిర్ణయించారు. మహాసభ నాటికి వ్యవసాయకూలీ సభ్యత్వము పెద్ద ఎత్తున చేర్పించడానికి కోటాలు తీసికొన్నారు.

వ్యవసాయకూలి మహాసభ ప్రచారం గ్రామాలలోను పల్లెలలోను పెద్ద ఎత్తున ప్రారంభ మయ్యింది. వ్యవసాయ కూలి సంఘ సభ్యత్వం అనేక నూతన గ్రామాలలో చేర్పించి గ్రామ సంఘాలను ఏర్పాటు చేసారు. వ్యవసాయ కూలీలు సమిష్టిగా ఒకరోజు కూలిపనికిపోయి ఆ వచ్చిన డబ్బును మహాసభను విజయ వంతము చేయడానికి పంపుతున్నారు. రైతులు కూరగాయలు, పచ్చళ్ళు, విస్తరాకులు మహాసభకు కానుకలుగ పంపు తున్నారు. ఆహ్వాన సంఘం మహాసభను జయప్రదంచేసే కార్యక్రమంలో మునిగి

పోయింది. గ్రామానికి బయటవున్న పొలాల్లో వాలంటీర్లు మిట్టపల్లాలు బాగుచేశారు. పందిళ్ళ నిర్మాణం పూర్తి చేసారు. భగవత్ సింగ్ గేటు సర్వాంగ సుందరంగ నిర్మించ బడింది. మహాసభకువచ్చే ప్రతినిధు లందరికి భోజనవసతులతోసహా అన్నిఏర్పాట్లు అమర్చబడ్డాయి. అనేక మంది వాలంటీర్లు మహాసభ కార్యకలాపాల్లో మునిగి పోయారు. ఈ వాలంటీర్లందరికి సుబ్బయ్య జనరల్ కమాండరుగ వ్యవహరిస్తున్నాడు. కొన్నివేలమంది కూర్చోడానికి కావలసిన బహిరంగ ప్రదేశాన్ని శుభ్రంచేసి మంచినీళ్ళు అందించడానికి కావలసిన బానలు, ముంతలు సిద్ధం చేసారు.

వివిధ గ్రామాలనుండి వచ్చిన ప్రతినిధులతో సమావేశం ప్రారంభ మయ్యింది. సమావేశానికి ముందు వాలంటీర్ల పెరేడ్ జరిపారు. లీల ఎర్ర జెండాను ఎగుర వేసింది. సూర్యావతి జెండా పుట్టు పూర్వోత్తరాలను గురించి చిన్న వుపన్యాసం చేసింది. తరువాత అక్కడ చేరిన ప్రజలందరు పిడికిలి బిగించి ఎర్ర జెండాకు శాల్యూట్ చేసారు. ప్రతినిధులంతా మూడురోజులు సమావేశమై సుదీర్ఘంగ చర్చలు జరిపి ఈ క్రింది తీర్మానాలు ఏకగ్రీవంగ ఆమోదించారు. రత్నం శ్రీనివాసరావు జగ్గయ్యలు చర్చలలో ప్రధానపాత్ర వహించి ప్రతినిధులకు అనేక క్రొత్త రాజకీయ విషయాలు తెలియ జేయడంలో తోడ్పడ్డారు. ప్రతినిధులంతా మహాసభకు రావడంవలన తామెన్నో క్రొత్త విషయాలను నేర్చుకున్నామని అభిప్రాయం వెల్లడించారు.

మొదటిరకం మాగాణి భూములు ఐదుగురు గల కుటుంబానికి పన్నెండు ఎకరాలకు మించి వుండరాదు. ఆ గరిష్ట పరిమితికి పైబడ్డ భూములు పొలంలేని వ్యవసాయ కూలీలకు పేదరైతులకు పంచాలి. ప్రభుత్వ బంజరు భూములు వ్యవసాయకూలీ కుటుంబాలకు మాగాణి రెండున్నర ఎకరాలు మెట్ట ఐదు ఎకరాల చొప్పున ఉచితంగ పంచి యివ్వాలి.

ఈ బంజరు భూములు సాగులోకి తేవడానికి నీటి సౌకర్యాలు మురుగునీటి వనరులు కల్పించాలి. వ్యవసాయ కూలీలు నివాసయోగ్యంకాని యిండ్లలో కాపురంచేయడం వలన అంటు రోగాలకు అనారోగ్య పరిస్థితులకు గురి అవుతున్నారు. పల్లె ప్రజల ఆరోగ్యాన్ని రక్షించడానికి ప్రభుత్వం వుచితంగ యిండ్ల స్థలాలు శ్మశానాలకు నైదిబ్బలకు నిలువచేయడానికి కావలసిన భూములుకొని వ్యవసాయ కూలి తదితర పేద ప్రజలకు వుచితంగ యివ్వాలి.

ప్రతి పల్లెలోను ఒక ఎలిమెంటరీ పాఠశాల నిర్మించాలి, మంచినీటి వనరులు కల్పించుటకు భావులు త్రవ్వించాలి.

వ్యవసాయ కూలీలకు న్యాయ సమ్మతమైన పని గంటలు సరసమైన కూలిరేటు నిర్ణయించి ప్రభుత్వం శాసనం చేసి అమలు పర్చాలి. సంవత్సరములో అన్నిరోజులు వ్యవసాయ కూలీలకు పనులు కల్పించాలి. ప్రభుత్వం పనులు

చూపించలేని రోజులకు ప్రభుత్వ ఖజానానుండి జీవన భృతి యివ్వాలి.

వ్యవసాయకూలి బిడ్డలకు నిర్బంధ వుచిత విద్యా సౌకర్యాలు తక్షణం కలుగ జేయాలి.

తరువాత ప్రస్తుతం అధికారంలోవున్న ప్రభుత్వం భూస్వాములకు పెట్టుబడిదారి సామ్రాజ్య వాద దుష్ట శక్తులకు దేశంలోని కార్మిక కర్షక వ్యవసాయకూలి తదితర పీడిత ప్రజల శ్రమశక్తిని అన్యాయంగా కొల్లగొట్టి విపరీత ధనార్జనకు తోడ్పడుతూంది. అందువల్లనే రైతులు - కార్మికులు వ్యవసాయ కూలీలు అధిక వేతనాలకు పని గంటల నిర్ణయానికి భూస్వామిక విధానం రద్దు చేయడానికి జరిపే పోరాటాలను ప్రభుత్వం అభివృద్ధి నిరోధకుల పక్షాన కొమ్ముగాస్తు ప్రజల పోరాటాలను రక్తపు టేరుల్లో ముంచెత్తుతూంది. ప్రస్తుతం అధికారంలోవున్న ప్రభుత్వాన్ని అధికారంనుండి తొలగించి దేశంలోవున్న రైతు మధ్యతరగతి వ్యవసాయ కూలి కార్మికులకు ప్రాతినిధ్యం వహించే నూతన ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని నెలకొల్పి తద్వారా సోషలిజంనైపు పురోగమించాలి. ఈ చారిత్రక బాధ్యతను నిర్వర్తించడానికి కష్టజీవులంతా ఆయత్తం కావాలని పిలుపు యిచ్చింది.

తెలంగాణాలో రైతులు - వ్యవసాయ కూలీలు నైజాము నిరంకుశ పాలనకు వ్యతిరేకంగ ఫ్యూడల్ భూస్వామిక దోపిడిని అంతంచేసి దున్నే వారికే భూమి లభించడానికి

జరిపిన చారిత్రాత్మకమైన సాయుధ పోరాటం మహాసభకు హాజరైన ప్రతినిధులను వుత్తేజ పరచింది.

చివరిరోజు జరిగిన బహిరంగసభకు అనేక గ్రామాల నుండి వేలకొలది ప్రజలు కాలినడకతోను ఎడ్లబండ్ల మీాద వచ్చి హాజరయ్యారు. మహాసభలో ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం శరవేగంతో ఎలా ముందుకుపోయి కష్టజీవుల రాజ్యాలను స్థాపించు కుంటోందో వివరించే వుపన్యాసాలు చేయ బడ్డాయి. తరువాత బుర్రకథలు, నాటికలు, గొల్లసుద్దులు వగైరా నైజ్ఞానిక ప్రదర్శనములు ప్రజలు చూచి ఆనందించి వెళ్ళిపోయారు.



# 4

నారాయణరావు మొదట్లో ఒకధనిక రైతు. బాపయ్య అక్కగారిని పెండ్లిచేసుకున్నాడు. ఆ వెనుకటిరోజుల్లో నారాయణరావుకు అత్తవారు పదివేలరూపాయలు కట్నం యిస్తామని పెండ్లిఅయినతరువాత సగంయిచ్చి మిగతాది ఎగవేసారు. ఈకక్ష లోన పెట్టుకొని నారాయణరావు భార్యను పదిహేను సంవత్సరాలు పుట్టింటికి పోనివ్వలేదు. బాపయ్యకు ఒకఆడపిల్ల పుట్టిన కొలదిసంవత్సరాలకు యీరెండుకుటుంబాలమధ్య సంబంధాలుసరయినాయి. బాపయ్యకు యిప్పుడున్న ఆడపిల్లమినహా యికపిల్లలుపుట్టరని తెలినతరువాత యీకుటుంబాలమధ్య మరల కొంతసుహృద్భావం రాకపోకలు ఏర్పడ్డాయి. నారాయణరావుకుకూడ ఒకేఒక పుత్రుడు కావడంతో మరల వీరిద్దరిమధ్య యిచ్చిపుచ్చుకోవడం జరుగుతుందని అందరు భావించారు. నారాయణరావు జాతీయోద్యమం బాగా సాగేరోజుల్లో కల్లులొట్టెలు పగులగొట్టి తాటి, ఈతగెలలు నరికివేసి జైలుకుపోయాడు. మూడు నెలలు శాసన ధిక్కరణ నేరంక్రింద శిక్షించి జైలులోపెట్టారు. ఆనాటినుండి ఖద్దరు దుస్తులు ధరించడం, కాంగ్రెసుపార్టీకి చందాలివ్వడం నాయకులువస్తే విందులు, వసతిసౌకర్యాలు కలిగించడం నారాయణరావు చేస్తుండేవాడు. నారాయణరావుకు భారతం రామాయణం బాగా తెలుసు – అయితే యీయనది రామా

యణంలో రావణాసురునిపార్టీ. రాముని భార్య సీతశీలాన్ని గూర్చి అనేక శంకలు వెలిబుచ్చుతు వాదనలు జరిపేవాడు. రావణాసురుడు ఏకపత్నీ వ్రతుడని రామాయణంలో చిత్రించినంత దుష్టుడు కాడని యీయనవాదన. బ్రాహ్మణులు శూద్రుల యిండ్లలో బ్రాహ్మణత్వం వహించి వివాహాలు, తద్దినాలు పెట్టడానికి ఈయన యిష్టపడడు – బ్రాహ్మణుల యాపెత్తనం శూద్రులమీద పోవాలంటాడు. అందువలన శూద్రులంతా జంధ్యాలు వేసుకోవాలని, మంత్రాలు నేర్చుకోవాలని, వీరివాదన. నారాయణరావు తన పలుకుబడిలో వున్న కుటుంబాలలో పెండ్లిండ్లు జరుగుతుంటే ఆ వివాహాలు తానే బ్రాహ్మణులు లేకుండ జరిపేసేవాడు. నిమ్న జాతి ప్రజల్ని సమానంగా చూడాలని, అంటుదోషం నశించాలంటాడు. అవర్ణ సవర్ణులమధ్య వర్ణాంతర వివాహాలంటే గిట్టదు. ఒకవంద సంవత్సరాలదాకా యిలాంటి వివాహాలు పనికిరావని ఆయనవాదన. అయితే యిలాంటి అభిప్రాయాలు పైకి పొక్కనివ్వకుండ జాగ్రత్త వహిస్తాడు.

నారాయణరావు మంచిలౌకికుడు. లౌకికజ్ఞానంలో ఆయనకు ఆయనేసాటని ఆవులించితే ప్రేగులు లెక్కపెడతాడని వీరినిగూర్చి చెప్పుకుంటారు. ఐదుసంవత్సరాలు కాంట్రాక్టు పనులు చేయించి కొన్ని వేలు ధనం సంపాదించాడు. దీనితో అతని ఆర్థికస్తోమత పెరిగి వ్యాపారంలో దిగాడు. వ్యాపారంలో నారాయణరావు పట్టిందల్లా బంగారంకా జొచ్చింది.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చినతరువాత వెనక జైలుకు పోయిన టికెట్టుసాయంతో బస్సురూట్లు, ఎరువులు, సిమెంటు పర్మిట్లు సంపాదించాడు. బ్లాకుమార్కెట్టులో సిమెంటు, ఎరువులుఅమ్మి కొన్ని వేల రూపాయలడబ్బు సంపాదించాడు. తరువాత రెండురైసుమిల్లులు పెద్దవి కట్టించాడు – నారాయణరావు ఇంగ్లీషు చక్కగ వ్రాయగలడు – మాట్లాడ గలడు. నారాయణరావుకు కొంచెంవయస్సు ముదరడంతో శక్తి కిమించినపని, ఆలోచన అయ్యేటప్పటికి ఆరోగ్యం కూడ కొంత దెబ్బతింది.

తనకు వ్యాపారంలో సహాయపడతాడని లెక్కలు చక్కగ వ్రాసిపెడతాడని ఆసించి రామాచారి అనే పట్టభద్రుడయిన ఒకయువకుణ్ణిగుమాస్తాగ పెట్టుకున్నాడు. రామాచారికి లిటిగేషన్‌కు సంబంధించిన పనులంటే బలేసరద – ఎవరితో ఎన్నిసంవత్సరాలు స్నేహంచేసిన అవతలివాడు రామాచారిమీద నమ్మకంఉంచరాలని కోరతాడు గాని ఇతగాడు రెండవవారిని నమ్మడు. వాళ్ళలో మంచివున్నదని అంగీకరించడు – తనస్వార్థంకోసం ఎంతపనిఅయిన సులువుగ ఆత్మనుకూడ చంపుకొని ఎదుటివాడి ప్రాణంపోతున్న లెక్కచేయకుండ చేసివేస్తాడు. నారాయణరావుదగ్గర చేరిన కొద్దిమాసాలకే రామాచారి చదువుకునేరోజుల్లో చేసిన అప్పులు తీర్చుకొని, ప్రతినెలా తలిదండ్రులకు కొంతడబ్బు పంపుతూ, మరికొంతడబ్బు నిల్వచేయడం ప్రారంభించాడు.

గ్రామీణప్రాంతపు వ్యవసాయకూలి రైతుల్లో నానాటికి ఫ్యూడల్, భూస్వామిక పెట్టుబడిదారి వర్గాలకు వ్యతిరేకంగ పెచ్చుపెరిగిపోతున్న భావాలు నారాయణరావును బాగా కలవరపెట్టాయి - తనజిల్లాలోనే యిటీవలజరిగిన పాలేళ్ళ సమ్మెలు, అంటరాని వ్యవసాయకూలీలు అస్పృస్యతా నివారణకు జరిపిన పోరాటాలు నారాయణరావును బాగా కదిలించివేశాయి. తెలిసితెలియని అమాయక రైతుకూలీలు రాజకీయాల్లో జోక్యం కలుగచేసుకుంటు నడివీధులు మారుమ్రోగేటట్లు ఫ్యూడల్, భూస్వామ్య పెట్టుబడిదారి వర్గాలు నశించాలంటు, సోషలిజం కావాలనేనినాదాలు తన లాగ దోపిడివిధానంమీద బ్రతికే వారికెంతనష్టమో నారాయణరావు స్పష్టంగ గుర్తించాడు. ఆస్తులు, మంచిచదువులు వున్నవారికి మాత్రమే ఓటింగుహక్కు యివ్వాలని, మిగతా వారికి ప్రభుత్వ కార్యకలాపాల్లో పాల్గొనేఅవకాశం ఏమాత్రం యివ్వరాదని నారాయణరావు గట్టిఅభిప్రాయం. నారాయణరావుకున్న యీఅభిప్రాయాలు రామాచారిచేత వ్యాసాలు వ్రాయించి పత్రికల్లో ప్రచురించేవాడు. నారాయణరావుకు ప్రసాదరావుఅనే ఒకేఒక పుత్రుడున్నాడు. సంపన్న కుటుంబంలో పుట్టడంవలన సహజంగ కష్టాలంటే ఏమిటో ఎరుగడు. బడి విడిచినతరువాత కొన్నిసార్లు తనకున్న మిల్లుల వద్దకు షికారుకువెళ్ళేవాడు - అక్కడ ఎంతోమంది కార్మికులు పనిచేస్తుంటారు - వారికి ఒంటినిండా శుభ్రమైన గుడ్డలు కనపడేవికావు - ఈకార్మికులందరు శుభ్రమైన దుస్తులు ధరించి పనిచేస్తుంటే మిల్లు ఎంతఅందముగా వుండును అని

తనలో తాను అనుకొనేవాడు. పీక్కుపోయిన డొక్కలతో కార్మికులు వుసూరుమంటువుంటే వీరంతా కడుపునిండా తిండి ఎందుకుతినరు ఎందుకు బలిసి అందంగ కనబడరు అని తనలో తాను ప్రశ్నించుకునేవాడు. జీతాలిచ్చేరోజు అందరు వ్రేలి ముద్రిలతో డబ్బు పుచ్చుకొనేవారు. ఇదిచూచి వీళ్ళంతా చిన్నతనంలో ఎందుకు చదువుకో లేదని విచారించేవాడు.

ప్రసాదరావుకు చిన్నతనంలో తన మిల్లులో పనిచేసే కార్మికుల స్థితిచూచి యీ విధంగ జాలిపడుతు సహజమైన మానవత్వంలో వుండే తనప్రేమ కార్మికులయెడ అమాయకత్వంగ వ్యక్తంచేసాడు - ఆ కార్మికులంతా ఆకలి మంటలతో, అవిద్యతో బ్రతక కూడదని అతని అభిప్రాయం - వాళ్ళంతా తన లాగానే సుఖంగా వుండాలని అతనికోర్కె - అనేకమంది జనం ఒకవైపు ఆకలి మంటలతో, మరో వైపు తనతండ్రి లాంటి లక్షాధికారులు తిన్నది జీర్ణించుకోలేని స్థితికిగల లోతయిన ఆర్థిక రాజకీయ కారణాలు ప్రసాదుకు తెలియవు.

ప్రసాదు హైస్కూల్లో చదువుకునే రోజుల్లో ఇండియాలో సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగ విద్యార్థులు ఒక రాజకీయసమ్మెచేసి పెద్ద ప్రదర్శనం బజార్లవెంట చేసారు - పోలీసులు విద్యార్థులపై లాఠీచార్జిచేసి చాలామందిని గాయపరచారు. స్వల్పంగ దెబ్బలు తిన్నవారిలో ప్రసాదు ఒకడు.

పోలీసువాళ్ళు కొట్టిన యీ దెబ్బలు ప్రసాదు ఆలోచనల్లో పెద్దగాలి దుమారాన్ని లేవదీసాయి. కొన్ని వందల మంది తనతండ్రిక్రింద పనిచేస్తుంటే వాళ్ళందరికి తనతండ్రి యజమానినని విర్రవీగడం చూచాడు. తనపైన తన దేశీయులందరిపైన పరాయి ప్రభువులు పాలనజేస్తు బానిసలుగ చూస్తారని యిపుడు మరో సత్యాన్ని ప్రసాదు గుర్తించాడు. బ్రిటిషువాడి అభీష్టానికి వ్యతిరేకంగ ఏపని చేసిన వీపులు పగిలి పోతాయని స్వానుభవంలో గుర్తించాడు. పరాయి ప్రభువుల పీడనుండి దేశాన్ని విముక్తి చేయాల్సిన అవసరాన్ని హైస్కూలు జీవితంలోనే అర్థంచేసి కున్నాడు.

గాంధి నెహ్రూ జీవిత చరిత్రలతో పాటు భగత్ సింగు, మార్క్సు, లెనిన్, స్టాలిన్‌ల జీవిత గాధలు పైపైన చదివాడు. రాజకీయాలంటే శ్రద్ధ ఏర్పడ డానికి యివి తోడ్పడ్డాయి. బ్రిటిషువాళ్ళకు వ్యతిరేకంగ దేశంలో పోరాడుతున్న అన్ని రాజకీయ పార్టీలంటేను గొప్ప గౌరవం అభిమానం ఏర్పడింది - రాజకీయ పార్టీలు ఏపార్టీ సిద్ధాతం ఏమిటి, ఏపార్టీ మంచిదనే చర్చ వచ్చినపుడు అన్ని రాజకీయ పార్టీల్లోను మంచి వుంది. అన్నింటిలోను తరతమ భేదాల్లో లోపాలున్నాయని అభిప్రాయ పడేవాడు - స్కూలుఫైనలు పరీక్షలో వుత్తీర్ణుడయ్యేవరకు ఏపార్టీమీద ప్రత్యేక అభిమానం ఏర్పడలేదు - గోర్కీ రచనల్లో వెల్లి విరిసే మానవత్వం, శ్రమజీవులయెడ ఆయన ప్రదర్శించిన అపూర్వప్రేమ, అభిమానాలు ప్రసాదుని గోర్కీ రచనలవైపు మరలించి అమ్మ

నవల మూడు పర్యాయాలు చదివిన తరువాత ఆయన యిష్టా యిష్టాల్లో ప్రత్యేక శ్రద్ధ ఏర్పడడమే గాక రష్యా విప్లవాన్ని సాకల్యంగ చదివి ఆ విప్లవం వెనుకనున్న ఆర్థిక రాజకీయ సిద్ధాంతాల అధ్యయనం చేయాలనే గట్టి పట్టుదల ఏర్పడింది.

ప్రసాదుని కాలేజిలో చదివించ డానికి తలిదండ్రులు నిశ్చయించు కున్నారు - గుంటూరులో చదువు కోవాలని తల్లి అభిప్రాయం - గుంటూరులో అయితే ప్రసాదు ఎల్లపుడు తల్లి కండ్లముందరే వుంటాడని ఆమె అభిప్రాయం. గుంటూరు కళాశాలలు రాజకీయాలకు నిలయం కావడంతో కొడుకు రాజకీయాల్లోపడి వున్నతవిద్య అభ్యసించే అవకాశం పోగొట్టు కుంటాడని నారాయణరావు అభిప్రాయం. ప్రసాదుని మద్రాసు నగరంలో మంచి హాస్టల్లో కాలేజిలో చేర్పించి అక్కడే చదివించాలనేదిగ తన గట్టి అభిప్రాయమైనట్లు భార్యతో చెప్పాడు. నారాయణరావుకు భార్యఅంటే గొప్ప ప్రేమ. కుటుంబ వ్యవహారాల్లో ఆమె అభిమతానికి వ్యతిరేకంగ నారాయణరావు వ్యవహరించలేదు - భార్యకు తన పుత్రుణ్ణి మద్రాసు పంపడం యిష్టంలేదు - భార్యమాట నెగ్గింది. ప్రసాదును గుంటూరులోనే వుంచి చదివించ డానికి తలిదండ్రు లిద్దరు తెగని దీర్ఘ చర్చల అనంతరం ఏకాభి ప్రాయానికి వచ్చారు. ప్రసాదు గుంటూరులో యింటర్ చదవడం ప్రారంభించాడు.

బాపయ్య కూతురు స్వర్ణకుమారి చిన్నతనంనాటి జీవితాన్ని గూర్చి అట్టే తెలియదు- పెద్దగ ఇంగ్లీషు చదువులు చెప్పించాలని బాపయ్య అభిప్రాయ పడలేదు. ఒక సందర్భంలో తనకు కాబోయే కోడలు మంచి విద్యావంతురాలుగ వుండాలని, విధిగ కాలేజిలో చదివిన అమ్మాయే తన కోడలు కావాలనేది నారాయణరావు అక్కడక్కడ స్నేహితులతో అంటుండేవాడు. మొదట్లో స్వర్ణకు తెలుగు బాగా చదవడం, వ్రాయడం నేర్పి, సంగీతం నృత్యం కొంతవరకు నేర్పి యింటివద్దనే వుంచుకొని వివాహం చేసివేయాలనేదే బాపయ్య అభిప్రాయం - నారాయణరావుతో తాను సంబంధం తప్పక చేసికొని తీరాలనే నిశ్చయానికి వచ్చిన తరువాత నారాయణరావు అభిమతాలకు అనుగుణంగ తన కుమార్తెను వున్నత విద్యాభ్యాసం చేయించాలని బాపయ్య పట్టు బట్టాడు. సరళకు యీ పెద్దచదువుల గొడవ పట్టదు - పుష్కలంగ డబ్బు పొలం కట్నాలు యిస్తా మంటే కొండ మీద కోతికూడ తన పాదాల దగ్గిర వచ్చి పడుతుందని ఆమె అభిప్రాయం.

నారాయణరావు భార్య కొన్ని సంవత్సరాలు బస్తీ నాగరికతలో వుండిపోవడం వలన గ్రామాల్లో వుండే భూస్వామ్య స్త్రీల అలవాట్లు, వంటకాలు, ఆచారాలు అట్టే గిట్టవు- చుట్టం చూపులకు బాపయ్య యింటికి వచ్చినపుడు తనభార్య చేసే వంటకాలకు నారాయణరావు భార్య పేర్లుపెట్టి ఎగతాళి చేయడం అయినట్లు, కానట్లు వ్యవహరించి వచ్చిన రెండో

రోజులోనే వెళ్ళిపోయేది - ఈ ప్రవర్తన సరళాదేవికి చాలా కోపం బాధ కలిగించి తనను అవమానించినట్లే భావించేది - తన కూతురుకి ప్రసాదుకు పెండ్లి అయిన తరువాత తన వదిన పని గట్టిగ పట్టాలి - మూడుముళ్ళు పడేవరకు సరళ తగ్గి వుండాలని నిశ్చయించుకొని ఆమె వున్నపుడల్లా ఒదిగి మదిగి వుంటు వినయాన్ని వ్యక్తం చేస్తున్నట్లు నటించేది. స్వర్ణ కుమారి తన గ్రామానికి రెండుమైళ్ళ దూరంలో వున్న హైస్కూల్లో చేరి చదువుతూంది.

నారాయణరావు యింట్లో మంచి లైబ్రరీవుంది. కంటికి కనబడ్డ మంచి పుస్తకం ప్రతిది కొనేవాడు. నారాయణరావు వ్యాపారంలో పడ్డాక పుస్తకాలు చదివే తీరికే లేక పోయింది. అలంకారానికి, నలుగురు తన యింట్లో వున్న సొంతలైబ్రరీలో గొప్ప పుస్తకాలున్నాయని చెప్పుకోడానికి మాత్రమే యీ పుస్తకాల్ని సేకరించాడు - యీ పుస్తకాలు చదువుకోడానికి ఎవరయిన అడిగిన యిచ్చేవాడు కాదు.

ప్రసాదుకు చిన్నతనంనుండి కంటికి కనబడ్డ ప్రతిచిన్న పుస్తకాన్ని ఆపుస్తకం ముగిసేవరకు నిద్రాహారాలు లెక్క చేయకుండ చదివే అలవాటువుంది. బడిలో పంతుళ్ళు చెప్పే పాఠాలు శ్రద్ధగవిని నోట్సులు వ్రాసుకుంటాడు. యింటికొచ్చి ఒకటి రెండు సార్లు చదివి కంఠస్తంచేసి వేస్తాడు - మిగతా కాలాన్ని తన తండ్రి సొంత లైబ్రరీలో వున్న మంచినవలలు నాటకాలు, జీవిత చరిత్రలు చదవడానికే వినియోగిస్తాడు.

ఇంటర్ రెండవ సంవత్సరంలో ప్రవేశించేటప్పటికి మార్క్సిస్టు మూలసూత్రాలు, చారిత్రక, గతతార్కిక సూత్రాలు కొంతవరకు అధ్యయనం చేసాడు - విషయాలను శాస్త్రీయంగ ఆలోచించడం, చర్చించడం ప్రసాదుకు అల వాటు పడింది.

కాలేజిలో జరిగే వాగ్వివాద పోటీలలో ప్రసాదు ప్రముఖపాత్ర వహించడం మొదలెట్టాడు - బరువైన మాట లతో, తళుక్కైన పదజాలంతో, చక్కటి వాదనా పటిమతో ఏలాంటి కరుడు గట్టిన మొండి భావాలున్న వారినైన ఎదిరించి తన వాదన వైపుకు త్రిప్పుకోగలడు. వీటన్నిటికి మించి అభ్యుదయ కరమైన రాజకీయ, సాంఘిక భావాలు తన పేరుకు వన్నె తెచ్చాయి. ప్రసాదు మంచి వక్తగా పేరు సంపాదించు కున్నాడు - వాగ్వివాద పోటీల్లో యితర ప్రదేశాలకుకూడ పోయి యింటర్‌లోనే అఖిల భారత బహు మతులు సంపాదించాడు.

క్లాసుల్లో ఎవరయిన అధ్యాపకులు సందర్భ శుద్ధిలే కుండ అవకతవకగ సత్యాన్ని తమ అభివృద్ధి నిరోధక రాజ కీయ సాంఘిక భావాలు అడ్డువచ్చి అసత్యంగ చిత్రించ డానికి పూనుకుంటే అలాంటి వారిని తీవ్రంగ క్లాసులో ఎదిరించి తన అభిప్రాయాలు వెల్లడించేవాడు. అమెరికానుండి ఇంగ్లీషులో అధ్యాపక వృత్తి కోసరం వచ్చిన ఒక లెక్చరర్ ఫ్రాన్సు విప్లవంలో పాల్గొన్న ప్రజల్ని అవహేళనచేస్తు మాట్లాడు తుంటే ప్రసాదు వెంటనే క్లాసులో నిలబడి మీారలా అస

త్యాలు మాట్లాడడం తగదని మందలించాడు- "అయితే నీవు కమ్యూనిస్టువా" అని అధ్యాపకుడు ప్రశ్నించగ సత్యం మాట్లాడడం కమ్యూనిజమే అయితే కమ్యూనిస్టుగ మారి పోడానికి అభ్యంతరం లేదని ధైర్యంగ సమాధానం చెప్పాడు. లెక్చరర్‌ని "అసత్యం మాట్లాడావు" అని అనడం ఒక పెద్ద తప్పుగ చిత్రించి ఆ అధ్యాపకుడు ప్రసాదును క్లాసు నుండి పంపివేసి నాలుగు రోజులు వరుసగ తన క్లాసులకు రాకుండ ప్రిన్సిపాలుకు చాడీలుచెప్పి ప్రసాదును శిక్షించాడు.

కాలేజిలో విద్యార్థులంత గట్టి కమ్యూనిస్టుగ చూచే వారు. ప్రసాదు రాజకీయాలయెడ చూపేశ్రద్ధ నారాయణ రావును బాగా కదిలించి వేసింది. కమ్యూనిస్టు సిద్ధాంతాల ప్రభావం వైపుకు తన కుమారుడు మొగ్గడం మరీ బాధవేశింది. ప్రసాదుపై తండ్రి అనేక ఆశలు పెట్టుకున్నాడు - ఇంటర్ అయిన తరువాత ప్రసాదును మద్రాసు ప్రసిడెన్సికళాశాలకు పంపి ఆనర్సు చదివించాలని, తరువాత అమెరికాపంపి వ్యాపా రానికి సంబంధించిన వున్నత విద్య చెప్పించి తన వ్యాపా రాన్ని విస్తృతంచేసి ఆంధ్ర దేశంలో ఒక బిర్లా కావాలని అతనిఆశ - తన ఆశలు నెరవేర్చడంలో తన కొడుకు సహా కారం పూర్తిగ కావాలని తండ్రి వాంఛ.

ప్రసాదు రాజకీయఅభిప్రాయాలు మార్చడానికి అతని కాలాన్నంత చదువుమీదే కేంద్రీకరించి మొదటితరగ తుల్లో వుత్తీర్ణుణ్ణి చేయడానికి నారాయణరావు చేసిన ప్రయ త్నాలన్నీ విఫలమయ్యాయి. ఇంతకాలంవరకు ప్రసాదు

తండ్రిని గట్టిగ ఎదిరించేవాడు కాదు. ఆయన ఏదో చెప్తూ వుంటే ప్రసాదు మరేదో ఆలోచిస్తూ తండ్రియెడల భక్తి, గౌరవాలు వున్నట్లు నటనచేస్తూ తన కార్యకలాపాలు రహస్యంగ కొనసాగిస్తూ ప్రశాంతంగ కాలాన్ని గడిపేవాడు.

పట్టణ విద్యార్థిసంఘానికి జరిగిన ఎన్నికల్లో ప్రసాదును కార్యదర్శిగ ఎన్నుకున్నారు. యీవిషయం రెండో రోజు పత్రికల్లో ప్రకటించబడింది. "ప్రజాశక్తి" పత్రికఅంటేనే నారాయణరావుకు మంట. ఆ పేపరు కమ్యూనిష్టులది. ఆ పత్రికలో తనకుమారుని పేరు కార్యదర్శిగ ఎన్నికయినట్లు ప్రకటించబడింది. ప్రసాదు కమ్యూనిష్టుగ మారకపోతే వాళ్ళు ఆపత్రికలో అంతప్రముఖంగ ప్రకటించరు. నా కుమారుణ్ణి వాళ్ళు చెడగొట్టారు. నాయింటికి నిప్పంటించారు అంటూ మోకాళ్ళలో తలపెట్టి దీర్ఘంగ విచారించ మొదలెట్టాడు.

ప్రసాదు సాయంత్రం కాలేజి అయిపోయిన తరువాత కొంతసేపు టెన్నిస్ ఆడాడు, క్లబ్బుకెళ్ళి కొంచెంసేపు పత్రికలు తిరగేసి ప్రొద్దు పోయినతరువాత యింటికివచ్చాడు.

"మీటింగులు యిప్పటికిగాని అవలేద ఏమిటి" అని ఎటకారంగ కొడుకుని నారాయణరావు ప్రశ్నించాడు.

ప్రసాదు :- మీటింగులేమిటి - ఇవ్వాళ్ళ ఏమిలేవే.

నారాయణరావు :- కాలేజి ఐదు గంటలకు వదిలితే రాత్రి 8 గం॥ లకు యింటికి రావల్సినకారణం.

ప్రసాదు :- ఈరోజు టెన్నిస్ చాలాసేపు ఆడాను తరువాత క్లబ్బుకెళ్ళి స్నేహితులతో మాట్లాడుతూండే టప్పటికి తెలియకుండానే యింతకాలమయ్యింది.

నారాయణరావు :- వాళ్ళ పత్రికలో నీపేరు ప్రకటించారేమిటి?

ప్రసాదు :- వాళ్ళెవరు

నారాయణరావు :- ఆ...వాళ్ళే... (కమ్యూనిస్టులని తన నోటివెంట పిలవటానికికూడ అతనికి ఇష్టంలేక) ఆ...వాళ్ళే మీవాళ్ళు. ఆ ప్రజాశక్తివాళ్ళు.

ప్రసాదు :- విద్యార్థులు నన్ను జానువిద్యార్థి సంఘానికి ఏకగ్రీవంగ కార్యదర్శిగ వుండమని కోరారు. దానికి నేను అంగీకరించాను. ఆవిషయం ప్రజాశక్తిపేపరు ప్రకటించింది.

నారాయణరావు :- రాజకీయాలజోలికి పోవద్దని చెప్పాను గదా - నాకుతెలియకుండ కార్యదర్శిగ కమ్యూనిష్టుల సంఘానికి ఎందుకున్నావు?

ప్రసాదు :- విద్యార్థిసంఘం కమ్యూనిష్టులదికాదు. అన్ని రాజకీయ పార్టీలవారు అందులోవుండవచ్చు. దేశాన్ని పారిశ్రామికంగ యితరవిధాల అభివృద్ధి చేయడానికి కావాల్సిన దేశభక్తియుతమైన విద్యావిధానం కావాలని విద్యార్థిసంఘం చెప్తూంది. దానిలో చేరండ తప్పుకాదని చేరాను.

తరువాత ప్రసాదు కమ్యూనిజాన్ని గూర్చి ఏదో మాట్లాడ బోయేటప్పటికి నోటిలో మాట నోటిలో వుండగానే చెంప కేసి ఫెళ్ళుమనేటట్లు ఒకగట్టి దెబ్బ కొట్టాడు.

ప్రసాదు తండ్రి చేత పుట్టినతరువాత దెబ్బతినడం యిదే మొదటిసారి. ప్రసాదు మరేమి మాట్లాడకుండ కండ్లవెంట జలజల రాలే కన్నీళ్ళు తుడుచుకుంటూ తండ్రి సమక్షంనుండి వెళ్ళిపోయాడు.

ప్రసాదు రాజకీయ అభిప్రాయాలు మార్చడానికి తండ్రి చేసిన ప్రయత్నాలు విఫలమైపోయాయి. ప్రసాదు రోజులు గడచిన కొలది రాజకీయ సిద్ధాంత గ్రంధాలు చదువుతు తన జీవిత మంతా విప్లవోద్యమాలలో చేరి పనిచేయ డానికి నిర్ణయించుకున్నాడు.

పరీక్షలు అయిపోయిన వెంటనే నారాయణరావు తన కొడుకుని గుంటూరు నుండి ఎక్కడికైనా పంపివేసి వున్నత విద్య చెప్పించడానికి నిర్ణయించుకున్నాడు. తండ్రి ఆశించి నట్లు ప్రసాదుకు ఇంటర్‌లో క్లాసు రాలేదు. తండ్రిపోరు పడ లేక వాల్తేరు, మద్రాసు కళాశాలల్లో ఆనర్సు సీటుకు అప్లై చేశాడు. ఇంటర్‌లో క్లాసు రానందున సీటు రాలేదు. నారాయణరావు యితర్రతా చేసిన ప్రయత్నాలుకూడ సీటు సంపాదించలేక పోయాయి. ప్రసాదు గుంటూరులోనే ఐతే చదువుతాను - లేకపోతే చదువే మానేయదలచుకున్నట్లు తండ్రితో చెప్పాడు. నారాయణరావు అయోమయ స్థితిలో

పడ్డాడు. గత్యంతరంలేక ప్రసాదును గుంటూరులోనే బి. ఎ. క్లాసులో చేర్పించాడు.

స్వర్ణకుమారి తన గ్రామానికి రెండు మైళ్ళ దూరంలో వున్న హైస్కూలుకు పోయి చదువుకుంటుంది. స్వర్ణకోసరం ప్రత్యేకంగా ఒక రిక్షా కొన్నారు. ఆ రిక్షాలో బడికి పోయి యింటివద్ద మంచి ప్రయివేటు మాస్టరు దగ్గర ట్యూషన్ చదువు చదువుకుంటుంది. స్వర్ణకు సంగీతం అంటే, నృత్యం అంటే మంచి యిష్టము. నృత్యంకూడ యింటివద్దనే కొంత కాలం నేర్చుకుంది. స్వర్ణ క్లాసు పుస్తకాలు చదివి ఎక్కువ మార్కులు సంపాదించడంలో అంత పెద్ద తెలివితేటలు ప్రదర్శించలేదు. ఇంటిదగ్గర ప్రత్యేక శ్రద్ధవహించే ప్రయివేటు మాస్టరు వుండడం, దీనికితోడు స్వర్ణ చదివేది కమిటీ హైస్కూలు కావడం, ఆ స్కూలు నిర్మాణంలో బాపయ్య కొంత ధన సహాయం చేసి స్కూలు పాలిటిక్సులో పైచేయి సంపాదించడంతో స్వర్ణకు ఒకటి - అర సబ్జక్టుల్లో కొన్ని తక్కువ మార్కులు వచ్చినప్పటికి చూచీచూడనట్లు ఆమెను పాస్ చేస్తుండేవాళ్లు.

రాఘవయ్య అనే ఒక కమ్మరి కులానికి చెందిన ఒక విద్యార్థి నాలుగో ఫారంనుండి స్వర్ణ క్లాసుమేటు. రాఘవయ్యది మంచి కంఠం. గొప్పగ పాడగలడు - మంచి చిత్రకారుడు - క్లాసులో స్వర్ణకుమారి కూర్చునే బెంచికి ఎదురుగ రాఘవయ్య కూర్చునే బెంచి వుండేది.

మాష్టరు చెప్పేపాఠాలు వింటున్నట్లుండే క్లాసులో వున్న ప్రతి విద్యార్థిని మరో కంటితో కొంటెగ చూస్తూ వారికి ఏవో పేర్లుపెట్టి ప్రక్క విద్యార్థినులతో చెప్పి ఎగతాళి చేసినట్లు మాట్లాడేది - ఒకరోజు క్లాసులో ఎదురుపడ్డ రాఘవయ్యనుచూచి ఫక్కున నవ్వింది- అపుడు స్వర్ణ స్కూలు ఫైనలు క్లాసులో వుంది - ఆరోజు రాఘవయ్య నీరుకాయ బట్టిన చొక్కా గూళ్ళమీద చిరిగిపోయి వున్నది. సగంవరకు కుట్టించి తొడుక్కున్నలాగు మురికిగ వుంది. తన చింపిరి చొక్కానుగూర్చి స్వర్ణకుమారి నవ్విందని రాఘవయ్య ఖిన్నుడయిపోయి క్లాసులో కూర్చుని పదినిముషాలు విచారవదనంతో ఎంతో బాధపడ్డాడు. స్వర్ణ చినిగినచొక్కా చూచి నవ్వలేదు - చాలకాలంగ రాఘవయ్య అంటే అదోక అభిమానం - తెలియని ప్రేమ ఆమెకు అతని యెడల వుండి. అయితే రాఘవయ్య క్లాసులో వంచినతల ఎత్తకుండ తను పాఠాలు వినడం, నోట్సులు వ్రాసుకోవడంలో నిమగ్నుడయిపోవడంతో స్వర్ణచూపుల ప్రభావంలోవున్న మహిమ రాఘవయ్య గుర్తించలేదు- ఆమె ఎందుకయిన నవ్వనివ్వండి అతని ముఖంమీదే నవ్వింది - ఆమె నవ్వు, పండ్లు, కళ్ళు, పెదిమలు, చెక్కిళ్ళు, ముఖ వర్చస్సు అన్ని రాఘవయ్య తన మనసారా చూచాడు - తనని అభిమానిస్తు ప్రేమిస్తు స్వర్ణ నవ్వివుంటే ఎంత బాగుంటుందని తనలో తాను ఖేద పడ్డాడు.

క్లాసులో తీరికలేని విధంగ కనబడే రాఘవయ్య దృష్టి ఆడపిల్లల బెంచివైపు మరలింది. ప్రత్యేకంగ స్వర్ణ కేసి

చూడడం మొదలెట్టాడు. తన చూపులకు స్పష్టమైన సమాధానం స్వర్ణ కండ్లలో కనబడింది - ఇతర విద్యార్థుల దృష్టిలో పడకుండ స్వర్ణ రాఘవయ్యలు ఒకర్నిచూచి మరొకరు ఎంతో ఆనందించు కున్నారు - ఆచూపుల్లో ఎంతో హాయి ఆనందం, గొప్పశక్తి వారికి కలిగినట్లుండేది - స్వర్ణ పుట్టిన రోజు రాఘవయ్య ఆమె చిత్రాన్ని వ్రాసి యిచ్చాడు - స్వర్ణ తండ్రికి చూపించింది. "అమోఘం - అద్భుతం - ఎవరీ చిత్రకారుడు - మనింటికి పిలిపించు" అన్నాడు బాపయ్య. స్వర్ణ 'నా క్లాసుమేటు రాఘవయ్య నాన్నా' అంది.

రెండవరోజు రాఘవయ్య యింటికివచ్చి బాపయ్యకు నమస్కరించాడు. రాఘవయ్య తండ్రి బాపయ్య యింట్లో కమ్మరి పనులు చేస్తుంటాడు - రాఘవయ్య చిత్రాన్నికొని యాడిన బాపయ్య చిత్రకారుడ్నిచూచి ఆయన్ని అభిమానించలేక పోయాడు - కారణం తక్కువకులం, వాళ్ళయింట్లో పనులు చేసేవాని కొడుకు - అంతగొప్పగ చిత్రంగీసిన విద్యార్థి ఏదోగొప్పవారి యింట్లో పుట్టి వుంటాడని బాపయ్య మొదట్లో అభిప్రాయ పడ్డాడు - రాఘవయ్య కనబడేటప్పటికి "ఇతనా మనింట్లో పనిచేసే వాడికొడుకు - కొంత డబ్బిచ్చి పంపుతానులే, నీవు యింట్లోకిపో" అని స్వర్ణతో అన్నాడు. వర్గ కుల అహంకారం, గొప్పకళా నైపుణ్యం తెలివితేటలు వున్న రాఘవయ్యను ఎలా చిన్నచూపు చూచేటట్లు చేసిందో రాఘవయ్య అర్థంచేసు కున్నాడు - బాపయ్య యివ్వబోయే డబ్బు తిరస్కరిస్తు "క్షమించండి - మీ అమ్మాయిని

చూచాను—ఆమె చిత్రాన్ని వున్నది వున్నటుల వ్రాయాలని నా అంతరాత్మ నాకు చెప్పింది. ఆపని చేసినదాకా నిద్ర పోనివ్వలేదు. చిత్రం గీసాను. నాలో వున్న బరువు ఎంతో తగ్గినట్లుంది. మీరేదో డబ్బు లిస్తారు - అందుకు చిత్రాలు గీయమని నాఆత్మ చెప్పలేదు. అందువలన మీడబ్బు నా కవసరం లేదు.'' అంటూ రాఘవయ్య వెళ్ళిపోయాడు.

స్వర్ణ తీరని ఆశాభంగానికి గురిఅయ్యింది. తన స్నేహి తుడు రాఘవయ్యను తనపుట్టినరోజున తనయింటికి తండ్రి ఆహ్వానిస్తాడని ఆశించింది. స్వర్ణ ఆశ నిరాశ అయ్యింది. రాఘవయ్యను గూర్చి తండ్రి చిన్నచూపుతో అన్నమాటలు ఆమెను తీవ్రముగ గాయపరచాయి.

ఇదిజరిగిన రెండోరోజు స్వర్ణ ఒక ప్రేమలేఖ వ్రాసి పుస్తకంలోపెట్టి రాఘవయ్యకిచ్చింది. అది చదివి తన్మయత్వం చెందిన రాఘవయ్య స్వర్ణకుమారి దేహాన్ని ఆపాదమస్తకం వర్ణిస్తు సమాధానం యిచ్చాడు.

రాఘవయ్యను ప్రేమించడం తప్పుకాదు అనే అభి ప్రాయం మనస్సులో వుండటంవలన అతను వ్రాసిన లేఖలు కూడ ఎవరికి తెలియకుండ దొంగతనంగ దాచుకోవాలనే వుద్దేశ్యం వుండకపోవడంతో అవితన టేబిల్ మీద వుంచుకునేది.

ఒకరోజు రాఘవయ్య వ్రాసిన వుత్తరాలకట్ట బాపయ్యకంట్లో పడింది. కుల మత వర్గ విషయాలకు అతి ప్రాధాన్యతనిచ్చి ఆదృష్టితోనే వ్యక్తుల్ని అభిమానించడానికి

అలవాటుపడ్డ బాపయ్య కోపాన్ని, ప్రతీకారభావాల్ని వర్ణించడం అతికష్టమైన పని.

రాఘవయ్య వ్రాసిన వుత్తరాలతో ప్రధానోపాధ్యాయునివద్దకు వచ్చాడు. "రాఘవయ్య విషయంలో తగుచర్య తీసుకోకపోతే వాడిప్రాణాలు దక్కవు, నీవుద్యోగం వుండదు- మాపంతుళ్ళు చెప్పే చదువు యింతముదనష్టంగ వుంది." అంటు గదంతా చిందులుత్రొక్కి తీరని అవమానం తన కుటుంబానికి జరిగినట్లు భావించి వెళ్ళిపోయాడు. హెడ్ మాష్టరు గొప్పవ్యక్తిత్వం వున్నవాడే - అతని బీదతనం. వీటన్నిటికి మించి గంపెడంత పెద్దసంసారం తన విద్యార్థి రాఘవయ్యకు న్యాయం కలుగజేయలేక పోయినవి.

రాఘవయ్యను పిలిపించి జరిగిన వృత్తాంతం అంతా చెప్పి స్కూలునుండి వెళ్ళిపోబాబూ - యిక్కడుంటే నీ ప్రాణం - నావుద్యోగం రెండూ వూడతాయి అని బ్రతిమాలాడు- "ముందు ప్రేమలేఖ వ్రాసింది స్వర్ణగదా ? అలాంటప్పుడు ఆమెను స్కూలునుంచి బయటకు పంపి తరువాత నన్ను పంపాలిగదా ? నన్నొక్కడినే శిక్షించడం ఏమి న్యాయమండి" అన్నాడు రాఘవయ్య. "ఓరి అమాయకుడా నీకు ప్రపంచం యింకా అర్థంకాలేదు. భవిష్యత్తుతో చెలగాటమాడవద్దు. త్రాచుపామునైనా కొన్నిసార్లు నమ్మి స్నేహం చెయ్యి - కాని కుల మత వర్గ దురహంకారుల జాడలకయిన పోవద్దు దయచేసి చెల్లు చీటి తీసుకొని వెళ్ళిపో. ఇక నిన్ను నేను రక్షించలేను."

సాయంత్రం స్వర్ణకుమారి రిక్షాలో యింటికి పోతుంది. రాఘవయ్య దారికాచి, ఆమెతో మాట్లాడాలని నిలబడ్డాడు. రిక్షా కార్మికుడు మెల్లగ పోతుంటే యిద్దరూ మాట్లాడుకుంటు తనవలన రాఘవయ్యకు జరిగిన అన్యాయానికి పశ్చాత్తాప పడుతూ కంట నీరు పెట్టుకుంది. తన యింట్లో పనిచేసే యిద్దరు మనుష్యులు రిక్షాకు ఎదురు రావడం చూచి కవరులో కొన్ని రూపాయి నోట్లు, ఒక వుత్తరం పెట్టి రాఘవయ్య చేతికిచ్చింది. రిక్షా కార్మికుడు పరుగు సాగించాడు. రాఘవయ్య మాట్లాడడం పూర్తికాలేదు. రిక్షా వెంట పరుగెత్తుతూనే ఏదో మాటలు చెప్తున్నాడు. బాపయ్య మనుష్యులిద్దరు రాఘవయ్యను ప్రక్క తోటలోకి లాక్కెళ్ళారు. తీవ్రంగా కొట్టారు. శరీరానికి తీవ్రంగా గాయాలు, గుడ్డలంతా రక్తపు మరకలు. రాఘవయ్య తీవ్రమైన గాయాలతో యింటికి తిరిగి వచ్చాడు. మరి రెండు రోజులకు అతని యింటికి నిప్పంటించారు. తరువాత కుటుంబమంతా గ్రామం వదలి పొట్ట చేతపట్టుకొని యితర ప్రాంతాలకు వలస వెళ్ళిపోయారు.

స్వర్ణ – రాఘవయ్యల ప్రేమ సాఫల్యంచెంది వారిద్దరి మధ్య వివాహం జరిగివుంటే స్వర్ణకుమారి పాతివ్రత్యం ప్రపంచంలో పేరుబడ్డ సీత, సావిత్రి, సీజరు భార్యలను ఓడించి వుండేది. తనకు తానే సాటి అని రుజువుచేసి వుండేది. పురాణాల్లో సీత, సావిత్రి, సీజరు భార్యల పాతివ్రత్యాన్ని తెగ పొగుడుతూ కథ లున్నప్పటికి వారికి ప్రక్కన ఏవో వారి శీలాన్ని శంకించే కథలు, శంకలకు దారితీసే రుజువుకాని పుకార్లు

వున్నాయి. స్వర్ణమాత్రం అనుమానించడానికే వీలులేని అతీతమైన ఆదర్శ గృహిణిగా చరిత్రలో చెరపడానికి వీలులేని పవిత్ర వనితగ పేరుగాంచి వుండేది. కాని ఆమె జీవితాన్ని సంఘంలోని కులాలు, ఆర్థిక అసమానతలు తారుమారు చేశాయి. తను ప్రేమించిన యువకుణ్ణి తనకు దక్కకుండా చేశారు. దీనితో ఆమెకు శాంతి అంటూ, ఆలోచనల్లో నిల కడ అంటూ లేకుండా పోయింది. వీటితో ఆమెలో అనేక అవాంఛనీయమైన భావాలు ప్రవేశించి రాబోయే కాలంలో ఆమె పవిత్ర జీవితాన్ని పాడుజేయడానికి దారితీశాయి.

స్వర్ణ మొదటి సంవత్సరంలోనే స్కూలుఫైనలు పరీక్షలో తప్పిపోయింది. రెండవ సంవత్సరంలో ట్యూషన్ మాష్టరు క్రొత్తవాడు వచ్చాడు. స్వర్ణ దృష్టిని సెక్సు సాహిత్యం మీాదికి మరలించాడు. యీా కాలంలోనే స్వర్ణ వర్ణించడానికి వీలులేని పరమబూతు సాహిత్యాన్ని చదివింది. యీా కాలంలో స్వర్ణ ఆలోచనల్ని మరీ చెడు మార్గంలో పట్టించిన వారిలో ట్యూషన్‌మాష్టరుఒకడు, రెండవదిగ స్వర్ణ కుమారి యవ్వనం యిందుకు సహాయ పడింది.

దురదృష్టవశాత్తు యీామెకు ప్రేమనుగూర్చి, పెండ్లిని గూర్చి అనేక తప్పుడు అభిప్రాయాలు సిద్ధాంతాలు బాగా బుర్రలో నాటాయి– "నేను అందమైన కుర్రాళ్ళందర్ని లవ్వు (Love) చేస్తా. అయితే ఎవర్ని హృదయ పూర్వకంగ ప్రేమిం చను" అంటు తనలో తాను ఒక చిన్న పాట పాడుకునేది.

యీకాలంలో రాజకీయాలంటేకూడ ఖచ్చితమైనఅభిప్రాయాలు స్వర్ణకు ఏర్పడ్డాయి. గ్రామీణ ప్రాంతంలో వ్యవసాయకూలీలు, రైతులు భూమి కోసరం, సుఖ జీవనం కోసం చేసే వర్గ పోరాటాలపట్ల స్వర్ణలో ఒక రకమైన హేయత ఏర్పడింది. ఆమె కేదో తినడానికి పుష్కలంగ పొలం డబ్బు వుండడంవలన అదిచూచి ఓర్వలేక, అసూయతో తన తండ్రిని, తదితర ధనిక వర్గాలను అల్లరి చేయడానికి దౌర్జన్యంతో వారి భూములు లాక్కోడానికి ప్రయత్నిస్తున్నట్లుగ అభిప్రాయ పడేది. వ్యవసాయ కూలీలంటే ఏమాత్రం అభిమానం లేకుండ పోయింది. ఆమెకు కావల్సింది ఆమె జీవితం సంగతి, ఆ జీవితాన్ని ఏలోటు లేకుండ సుఖమయంగ గడపడానికి కావల్సిన వనరులు, మార్గాలు.

రెండవ సంవత్సరంలో అతి కష్టంమీద స్కూలు ఫైనలు పరీక్షలో స్వర్ణ నెగ్గ గలిగింది. అసలు జరిగిన విషయం యిది - ఆమె లెక్కలు పేపరులో ఘోరంగ తప్పింది. ఇంగ్లీషు పేపరులో ఐదు మార్కులు తక్కువ వచ్చాయి. బాపయ్య కావలసి నంత డబ్బుతో మార్కుల వేటకుపోయి డబ్బుతో, తన పలుకుబడినంతా వుపయోగించి మార్కులు వేయించు కొచ్చాడు. దీనితో స్వర్ణ కాలేజీలో కాలు పెట్టడానికి అవకాశం దొరికింది.



# 5

స్వర్ణ కాలేజీలో చేరింది - మొదటి మూడు నెలలు రెగ్యులర్‌గ క్లాసుకెళ్ళినప్పటికి పాఠాలు అట్టే అర్థమయ్యేవి కావు. మొదటి టరమ్ అంతా ఆటలాడుకోవడం, తీరిక సమయాల్లో ఎక్కువగ సినిమాలకు పోవడంతో కాలం గడిపేసింది. మొదటి రోజుల్లో చాలా మౌనంగ మగపిల్లల దృష్టిలో పడకుండ స్వర్ణ కాలం గడిపింది. విచారంగ వుండే స్వర్ణముఖం చాలా అందంగ కనబడేది. విచారంగ వుండే ముఖమే అందంగ వుంటుందనే వాదనకు స్వర్ణ నిదర్శనమా అనిపించేది. కాలేజిలో జరిగే ఆటల పోటీలు, వాగ్వివాద పోటీలు, డ్రామాలు, తదితర వినోద కార్యక్రమాలకు వెళ్ళడం, వీలయినచోట్ల పాల్గొనడంతో స్వర్ణ మొదటి సంవత్సరం కాలేజి జీవితం ముగియక మునుపే కాలేజి విద్యార్థు లందరి దృష్టిలో పడింది.

పరీక్ష లయిపోయాయి. ఎండాకాలం సెలవుల్లో తన పల్లెపట్టు గ్రామంలో వారంరోజులకు మించి వుండలేదు - మూడు నెల్ల సెలవులు గుంటూరులోనే గడిపింది. మగ విద్యార్థులతో ఎక్కువ చనువుగ తిరగడం, స్త్రీ విద్యార్థినుల స్నేహంకన్న మగవారి స్నేహం అంటేనే ఎక్కువ యిష్టం, మంచి సరదా ఏర్పడడం యీ కాలంలోనే జరిగింది. స్వర్ణ

ఇంటర్ ఆడపిల్లల కళాశాలలో చదివివుంటే గొప్ప వున్నత విద్యాభ్యాసంచేసి పెద్ద డిగ్రీలే సంపాదించి వుండేది. మొదటి నుండి చివరివరకు మగ పిల్లలతో కలిసి చదువు కోవడం, జీవిత లక్ష్యాల్నిగూర్చి సమగ్రమైన అవగాహన లేకపోవడం, విద్య వినోదం కోసరమే పఠిస్తున్నాననే తప్పుడు అభిప్రాయాలు బుర్రలో ప్రవేశించడం, చదువుకున్న విద్యతో శ్రమించి పని చేసి తన జీవిత భృతిని తానే సంపాదించుకుంటు మొత్తం భారత జాతియొక్క సమిష్టి శ్రేయస్సుకు తన బాధ్యత నిర్వ ర్తించాలనే దూరదృష్టి లోపించడం, వీటన్నిటికి మించి వున్న ఆస్తి పాస్తులు స్వర్ణ ఆలోచనా విధానాల్ని పూర్తిగ తప్పుడు మార్గాన పట్టించి అహంకారం, గర్వం, యితరు లంటే తేలికగ చూచే దుష్ట మనస్తత్వాన్ని ఆమెకు ప్రసా దించాయి. ఆడ మగ విద్యార్థులు కలిసి చదువుకో కూడదనే వాదన యింత మాత్రంచేత సరికాదు – ఇద్దరు కలిసి చదువు కోవడం, కలసి మెలసి సహజీవనం చేయడం, ఒకరి నొకరు చక్కగ అర్థంచేసుకోడానికి తోడ్పడతాయి. దేశంయొక్క శ్రేయస్సుకు యిది అవసరంకూడాను. కాలేజీలో జరిగే కార్య కలాపాలన్నిటిలోకి కాలేజి మాక్ పార్లమెంటు (Mock Parliament), దాని అధ్వర్యాన జరిగే కార్యక్రమాలు స్వర్ణను బాగా ఆకర్షించాయి. మాక్ పార్లమెంటుకు ఎన్నిక కావడం వున్నతమైన గౌరవంగ విద్యార్థులు భావించేవారు. మాక్ పార్లమెంటులో స్థానం సంపాదించి ఆ వేదిక నుండి కాలేజీలో తన అభిప్రాయాలు, శక్తి సామర్థ్యాలు ప్రదర్శించా లనే కోరిక పుట్టింది స్వర్ణకు. తన కోర్కె నెరవేరాలంటే

13

మంచి వుపన్యాసకురాలుగా తయారుకావాలి - వందల మంది విద్యార్థుల్లో నిర్భయంగా చక్కటి ఇంగ్లీషులో గొప్పగ వుపన్యాసం చేయగల సామర్థ్యం సంపాదించాలి. దేశంలోని రాజకీయ, సాంఘిక, ఆర్థిక, శాస్త్రీయ విషయాలు పూర్తిగ కాకపోయినప్పటికి కొంతవరకైనా తెలిసి వుండాలి. సెలవుల్లో పత్రికల్లో వచ్చే నాయకుల వుపన్యాసాలు కంఠస్థం చేయడం గది తలుపులను మూసివేసి నిలువుటద్దంలో పోజులు చూచుకుంటూ, వందల మంది విద్యార్థులు తనముందర వున్నారని వూహించుకుంటూ వారి ముందర ఆవేశంతో మాట్లాడినట్లు వుపన్యాసాలు చేయడం మొదలుపెట్టి కొన్ని నెలల అనంతరం ఒకమాదిరి వుపన్యాసకురాలుగ తయారైంది.

రెండో సంవత్సరం కాలేజిలో ప్రవేశించే నాటికి స్వర్ణ వేషభాషల్లో గుర్తుపట్ట లేనంతగ మార్పు వచ్చింది. ప్రతిరోజు గోళ్ళకు పెదిమలకు రంగువేయడం, రోజులోనే రెండు పర్యాయాలు దుస్తులు మార్చివేయడం, ఆ ధరించే దుస్తులు చాలా విలువయినవి కావడం, మొదటి సంవత్సరం ఒక జడతో కనబడిన స్వర్ణ రెండో సంవత్సరం రెండు జడలతో గొప్ప అలంకారంగ కనబడడం స్వర్ణలో వచ్చిన మార్పుకు నిదర్శనాలుగ చెప్పుకోవచ్చు. టెన్నిస్, బ్యాడ్‌మింటన్, టేబుల్ టెన్నిస్ ఆటల్లో స్వర్ణ మంచి ఆటగత్తెగ గుర్తింపుకు వచ్చింది.

నూతన సంవత్సరానికి మాక్ పార్లమెంటుకు సభ్యుల ఎన్నిక కావాల్సివుంది. ఓట్లద్వారానే యీ ఎన్నికలు జరిగితే

స్వర్ణకు అందరికన్న ఎక్కువ ఓట్లు వొస్తాయి. కారణం కాలేజిలో మంచి గ్లామరింగ్ గరల్ కావడమే - అయితే యీ సెలక్షన్ ఏదోఒక డిబేటింగులో పాల్గొని ఆ వాగ్వివాద పోటీలో వున్నతమైన శక్తి సామర్థ్యాలు ప్రదర్శించిన వుపన్యాసకులను మాత్రమే ఎన్నుకుంటారు. ఇది ఒక రకంగ స్వర్ణకు యిరకాటము, తలకు మించిన పనిగ మొదట్లో కనబడింది - డిబేటులో మాట్లాడ వలసిన హాంశం స్త్రీ వున్నత విద్యకు సంబందించినది. దీన్నే ఫిప్టి - ఫిప్టిడిబేటు అంటారు. విద్యార్థినులంతా స్త్రీలకు వున్నత విద్య అవసరాన్నిగూర్చి మాట్లాడాలి-విద్యార్థులు వారిఅభిప్రాయాలు ఖండిస్తూ మాట్లాడాలి.

అసెంబ్లీ హాలంతా క్రిక్కిరిసిపోయింది. డిబేటింగ్ ప్రారంభమయింది - మొదట మాట్లాడిన యిద్దరు విద్యార్థులు స్త్రీలకు వున్నతవిద్య భారత దేశంలో పనికిరాదని వారు ఎంత చదివినప్పటికి వారి స్థానం వంటగదిలో చివరకు శాశ్వతంగ వుండిపోయి పిల్లల్నికని పెంచడమే వారివిధి కాబట్టి యిక్కడ చేరిన విద్యార్థినులంతా వారి కాలాన్ని వృధాచేయక వారి సముచిత స్థానమైన వంటగదికి ప్రవేశించడం ఎంత త్వరగ ప్రారంభమయితే అంత త్వరగ సమాజం బాగుపడు తుందని సెలవిచ్చారు - రెండవ వుపన్యాసకుడైన లాజరు మరికొంత దూరం పోయి స్త్రీ స్వాతంత్ర్యాన్నిగూర్చి, వున్నత విద్య అవసరాన్నిగూర్చి అమాయకు లయిన మీరు గట్టిగ వాదించడానికి పూనుకున్నారుగదా! మిమ్మల్ని ఒకే ఒక ప్రశ్న అడుగుతా, సూటిగ సమాధానం చెపుతారా? అంటు స్త్రీ

విద్యార్థులనంక (వేళ్ళు చూపిస్తు కాఫీ, టీ తయారు చేయడం మీకు తెలుసా? తెలిస్తే ఏపాళ్ళలో ఎంతెంత పంచదార, డికాషన్, పాలు వుండాలో చెపుతారా? అని సూటిగ స్వర్ణ కేసి (ప్రశ్నించినట్లు మాట్లాడాడు - యీ (ప్రశ్నతో స్వర్ణ కొంచెం రెచ్చిపోయి 'కాఫీలో వుండాల్సిన ఉప్పూ కారం సంగతి (ప్రస్తావించడం మరచిపోయారు.' అని ఎదురు(ప్రశ్న వేశింది. దీనితో లాజరు ముఖం తెల్లబోయింది - అసెంబ్లి హాలంతా చప్పట్లతో మారు (మోగింది.

స్వర్ణ వారంరోజులనుండి డిబేటింగులో గొప్పగ మాట్లాడాలనే (ప్రయత్నంలోవుంది. ఎనిమిది నిముషాలకు సరిపడ్డ వుపన్యాసం ముందుగానే (వ్రాయించుకుని బాగా కంఠస్తంచేసింది - తనంతటతానే గదిలో నిలువుటద్దంలో పోజులు చూచుకుంటు కంఠస్తం చేసిన వుపన్యాసాన్ని గది గోడల నుద్దేశించి గంభీరంగ పలుసార్లు వుపన్యాసాలుచేసి మంచి తయారుతిని ప్లాటుఫారం ఎక్కింది.

స్వర్ణ రెండుజడలు అటు యిటు ఎగరేసుకుంటు నాజూకుగ మైక్ ని సమీపించే టప్పటికి అల్లరి బెంచీల్లో వుండే విద్యార్థులు ఈలలు, కేకలు పిల్లి కూతలు వేయడంతో గోల (ప్రారంభించారు - అతిసున్నితమైన శైలిలో స్వర్ణ "మిష్టర్ స్పీకర్ సార్" అనేసరికి హాల్లో నిశ్శబ్దం తాండవించింది - ''స్త్రీలనిగూర్చి పాత యుగాలనాటి బూజుపట్టిన భావాలుగల వుపన్యాసాలు యీ పవిత్రమైన కళాశాల వేదిక నుండి వినడం మనందరికి బాధాకరమైన విషయం. వాదన కోస

రమే వాదన అనే దృష్టితో యీ సమస్యను పరిశీలించాలి! అభివృద్ధి నిరోధకమేగాక అశాస్త్రీయం కూడాను. దేశ జనాభాలో సగంమందిగ వున్న స్త్రీలు ఉన్నతవిద్య నభ్యసించి దేశ భవిష్యత్తును తీర్చి దిద్దడంలో సముచితమైన పాత్ర నిర్వహించనిదే దేశాభివృద్ధికాదు, పారిశ్రామిక, వ్యవసాయక రంగాల్లో అధికోత్పత్తి సాధించడానికి, సమాజంలో ఆరోగ్య పరిస్థితుల్ని నెలకొల్పడానికి స్త్రీలకు యీనాడు వున్నతవిద్య ఎంతేని అవసరం – స్త్రీలు డాక్టర్లు, గొప్ప అధ్యాపకులు, ఇంజనీర్లుగ రాణించి ప్రపంచంలోనే గొప్పఖ్యాతిగడించారు. స్త్రీలకు వంటగదే సముచిత స్థానమని, స్త్రీలు వున్నతవిద్యకు పోతే పాకశాస్త్రానికి అపచారం జరుగుతుందని హేళనతో కూడిన వాదనలు కొందరు మిత్రులు లేవనెత్తారు – పాకశాస్త్రంలో స్త్రీలకన్న పురుషులే మిన్న అనడానికి యీనాడు వందలు వేలసంఖ్యలో వంటపనివారుగవున్న పురుషులే యిందుకు నిదర్శనం – దయచేసి మిమ్మల్ని మీరే అవమానించుకునే విధంగ వుపన్యాసాలు చేయడం మీకు, మన సమాజానికి శ్రేయస్కరంకాదు.....................

అమోఘం, ఆనందం, అద్భుతం అంటు అనేకమంది విద్యార్థులు స్వర్ణ వుపన్యాసాన్ని గొప్పగ పొగిడేశారు. స్వర్ణను అభినందిస్తు చాలామంది విద్యార్థులు కరస్పర్శ చేశారు. ఈ కరస్పర్శతో ఆమెచేయి బాగా నలిగిపోయింది. అరచేయి బాగా కందిపోయింది. లాజరు క్యాంటిన్‌కిపోయే దారిలో నిలబడి స్వర్ణ వంటరిగ కాఫీకి రావడం చూచి

'అద్భుతంగా మాట్లాడారండి' అంటు ఆమెతో డిబేటింగు విశేషాలు మాట్లాడుకుంటూ తలవనితలంపుగ కాలేజి క్యాంటిన్‌లో యిద్దరూ ఒకే టేబులు ముందర కూర్చున్నారు. మాటల సందర్భంలో మీ ఇంగ్లీ భాష, వుచ్చారణ, ఆరేషన్ బ్రహ్మాండంగా వున్నాయంటే నమ్మండి అంది స్వర్ణ. కాఫీ కప్పు ముందరకు రాగానే మెల్ల మెల్లగ కాఫీ చప్పరిస్తూ అనుకోకుండా ఆమెకు లభించిన పేరు, పొగడ్తలను గుర్తుకు తెచ్చుకుంటు లోలోపల సంతోష పడుతు, తనలో తాను ప్రక్కన యితకులున్నారన్న సంగతి మరిచిపోయి మెల్లగ నవ్వుకుంటు కాఫీ త్రాగుతుంది. సాయంత్రానికి ఆమె భాగా అలసి పోయి నట్లు కనిపిస్తుంది. వేడికాఫీ సేవించడంతో ముఖబింబంపై కొద్దిగ అక్కడక్కడ చిరిచెమట బిందువులు ముత్యాల్లాగ మెరిసి పోతున్నాయి - బయటకు వెళ్ళిపోవాలనుకునే ఆలోచన వచ్చేటప్పటికి కొద్దిపాటి వర్షం పడడం ప్రారంభించింది. క్యాంటిన్‌లోని విద్యుద్దీపాలు ఒక్కుమ్మడిగ వెలిగాయి. టేబులుమీద మోచేయి ఆనించి గడ్డం అరచేతిలో దాచి మధ్యవ్రేలితో అపుడప్రుడు మీటను నొక్కినట్లు ముక్కుపెదిమెలు తరుచు తడుముకుంటు వర్షపు చినుకులకేసి చూస్తుంది. తీవ్రమైన ఆలోచనల్లో విచారంగవున్న స్వర్ణ ముఖబింబం విద్యుద్దీపాల కాంతిపుంజాలనే ధిక్కరిస్తున్నట్లుంది. తన కండ్లకు కావల్సిన సరయిన ఆహారం ఆరోజే లభించిందా అన్నట్లు తనివితీర స్వర్ణ ముఖంవైపు చూస్తు నోట్లోవున్న సిగరెట్టుపొడి చొక్కా ప్యాంటులమీద పడేది కూడ గమనించకుండ కుర్చీలో కూలబడి పోయాడు

లాజరు. అతని హృదయాన్ని స్వర్ణ నిలువున దోచి పారేశింది. వర్షం వెలియడంలేదు– ఎంతసేపని చినుకులకేసి చూడగలుగు తుంది. లాజరు యీ విషయాన్ని గమనించాడు – ఆహ్లాదకర మైన హాస్యంలోకి దింపాడు – ఇద్దరు చాలా పర్యాయాలు ముఖంలో ముఖంపెట్టి నవ్వుకున్నారు – స్వర్ణను ప్రేమిస్తు గొప్పగ అభిమానించే వ్యక్తులందరిలోకి లాజరంటే ప్రత్యేక అభిమానం ఏర్పడిన రోజు యిదేనని చెప్పవచ్చు.

తనపై ఏర్పడ్డ ప్రత్యేక అభిమానాన్ని లాజరు చక్కగ గ్రహించాడు. లాజరు మంచి ఆటగాడు కావడంతో ఆమెను తనతో టేబుల్ టెన్నిస్, క్యారమ్సులాంటి గేమ్సు ఆడడానికి ప్రోత్సహించాడు. మొదట్లో కొన్నాళ్ళు కలిసి ఆటలాడుకో డానికి యిష్టపడలేదు. క్రమేణా లాజరు గొప్ప నేర్పు, ప్రావీ ణ్యంగల ఆటగాడు కావడం, మంచి సంగీతం పాడగల వ్యక్తి కావడంతో స్వర్ణను తనవైపుకు మెల్లగ త్రిప్పుకొని తను అడి గిన పని కాదనకుండా మొఖమాటపెట్టగల స్థితిలోకి ఆమెను తెచ్చాడు.....తరువాత స్వర్ణ – లాజరు లిద్దరూ నిర్భయంగ కలిసి ఆటలాడుకోవడం, సినిమాలకు కలిసి పోవడం మొదలెట్టారు.

స్వర్ణను గాఢంగా ప్రేమిస్తు అభిమానించే విద్యార్థుల సంఖ్య నానాట పెరగడం మొదలెట్టింది. ఫలానచోట నాతో మాట్లాడి నవ్వింది, కన్నుకొట్టిందని ఆ రెండోరోజు ప్రేమ లేఖలు వ్రాశామని కొంతమంది విద్యార్థులు చెప్పుకునేవారు. అయితే వీరందరిని స్వర్ణ పూరకనే పోనిచ్చేది కాదు. తనని

అభిమానించే వ్యక్తి లందరికి ఏదో ఒకరకమైన పనులు బెతాయించేది. కొందరికి పోస్టాఫీసుకు పోయి కార్డులు కవర్లు కొని తెచ్చేపని, మరికొందరికి వ్రాసిన వుత్తరాలు పోస్టుచేసే బాధ్యల్లాంటి పనులు అప్పగిస్తూ, ఎవరినీ అనవసరంగా అసంతృప్తి పరచేదికాదు. తనని అభిమానించి ప్రేమించే విద్యార్థు లందరిని తన జన్మదినం సందర్భంలో తనింటికి ఆహ్వానించి మంచి టీపార్టీ కూడ యిచ్చింది. స్వర్ణ అభిమానులు మంచి ఖరీదయిన బహుమతులు అనేకం ఆమె పుట్టినరోజున సమర్పించారు. లాజరు మేలురకం జాతికి చెందిన ఒక కుక్కపిల్లని స్వర్ణకు బహూకరించడం మరో చెప్పుకోదగ్గ విశేషంగా పేర్కొనవచ్చు.

స్వర్ణ తెలివి తేటలు అర్థంచేసు కోడానికి ఆనాడు కాలేజిలో జరిగిన ఫిప్టి ఫిప్టి ఓటు ఒక మాదిరిగ ప్రసాదుకు తోడ్పడింది. స్వర్ణ కాలేజిలో చేరిన తరువాత ప్రసాదు - స్వర్ణలమధ్య వివాహం త్వరగా జరపాలనే ఆలోచనలు రెండు కుటుంబాలమధ్య ఎక్కువయ్యాయి - స్వర్ణతో పెండ్లి విషయం యింట్లో తలిదండ్రులు తన సమక్షంలోనే మాట్లాడు కునేటపుడు ప్రసాదు ఆమాటలు వినివిననట్లు వెళ్ళిపోతుండే వాడు. స్వర్ణ అంటే అయిష్టతగాని, ఆమె తనకు భార్యగ తగదనే అభిప్రాయంగాని అతనికిలేదు. స్వర్ణ హైస్కూల్లో చదువుకునే రోజుల్లో ఒకసారి ప్రసాదు యింటికి చుట్టం చూపుగ వచ్చింది. ఆవున్న కొలది రోజుల్లోనే కాఫీ భోజనాల సమయంలో కాలేజి జీవితాన్నిగూర్చి మొదటి సారిగ

ప్రసాదు ద్వారానే తెలిసికుంది. సంభాషణల సందర్భంలో ప్రసాదు వెలిబుచ్చిన అభిప్రాయాలు, బాష, వీటన్నిటికి మించిన వాగ్ధాటికి స్వర్ణ మంత్రముగ్ధురాలయి పోయింది. కాలేజిలో యింగ్లీషు తెలుగు గాక మరే విషయాలు పఠించాల్సి వుంటుందని కాఫీ త్రాగే సమయంలో మెల్లగ అడిగింది. హిష్టరీ, ఎకనామిక్సు, జుయాలజీ, బయాలజీ – పొలిటిక్సు, లిటరేచర్...............................”

“అయి బాబో, మన పూర్ బ్రెయిన్సుకు యివన్నీ పోరపాటున ప్యాసయి కాలేజికి వస్తే అర్థమవుతాయి.” అని వ్యంగ్యంగ నవ్వింది. “తప్పకుండ నీవు కాలేజీలో చేరాలి – వున్నతవిద్య నభ్యసించాలి – ఆసబ్జెక్టుల్లో ఏవో కొన్ని మాత్రమే చదవాలి. అవి నీకు తప్పకుండ అర్థమవుతాయి.” ప్రసాదు యిచ్చిన యీ ప్రోత్సాహం స్వర్ణకు చాలావరకు తోడ్పడి కాలేజీలో చేరడానికి ఒక రకంగ సహాయ పడింది.

స్వర్ణ కాలేజీకి వచ్చిన తరువాత తరుచుగ ఆమెను కలుసుకోడానికి వీలయిన దినాల్లో సాయంత్రం టీ త్రాగడానికి స్వర్ణ యింటికి పోయేవాడు – పండగ సందర్భంలో ప్రసాదు యింటిదగ్గరే యిద్దరు కలసి భోజనం చేసేవాళ్ళు – యీ సందర్భాల్లోనే ప్రయిజోక్సు కొడుతు స్వర్ణకు సంతోషం కలిగే కబుర్లు చెప్పుతు కులాసాగా కాలం గడిపేవాడు. మొదటి దినాల్లో తనకున్న రాజకీయాల ప్రసక్తి స్వర్ణతో అట్టే చర్చించేవాడు కాదు.

ప్రసాదు ప్రేమ - పెండ్లినిగూర్చిన సమస్యలు యితరులతో చర్చించేవాడు కాదు - తనలో తానే చర్చించుకొని కొన్ని నిర్ణయాలకు వచ్చేవాడు - తన జీవితాన్ని కార్మిక కర్షక పార్టీ అయిన కమ్యూనిస్టు పార్టీలోచేరి పీడిత ప్రజల విముక్తి సాధించబడే వరకు విశ్రమించనని ప్రతిజ్ఞ బూనాడు. ప్రేమగాని పెండ్లిగాని తన ఆశయాలకు, ఆదర్శాలకు అడ్డు రాకూడదు. ప్రేమించి పెండ్లి చేసుకున్న భార్య తనను ముందుకునెట్టి తన ఆశయాలు ఆదర్శాలు నెరవేర్చ డానికి తన జీవితంలో ఒక భాగస్వాగ వుండాలేగాని, కష్టాలకు బెదిరి తనను తిరోగమన ముఖం పట్టించేదిగ వుండకూడదు. రాజకీయాలు, విజ్ఞానం యితర శాస్త్రాలు జీవితాన్ని సుఖమయం చేయడానికి ఎంత అవసరమో ప్రేమ - పెండ్లికూడ జీవితానికి అంతే అవసరమని తనలో తాను సంబాళించుకొని సంతృప్తి పడేవాడు. పెండ్లి ఎవరిని చేసుకోవాలి? ఎట్లా చేసుకోవాలి, కట్నాలు అవతలివారు యిచ్చినప్పటికి తీసికోవాలా తిరస్కరించాలా - పెండ్లి చేసికోవడం సనాతన పద్ధతులతోనా, నవీన పద్ధతులతోనా - ఇన్ని అతివాద రాజకీయాలు మాట్లాడుతున్న నేను ఒక వర్ణాంతర వివాహంఎందుకు చేసుకోకూడదు. చాటుగ ఎవరయిన ప్రసాదు ఆలోచనలు పసిగట్టి జాగ్రత్తగ వింటే ప్రసాదుకు పెండ్లి కాకుండ పోతుందనే సందేహం, భయం కలగడం సహజం.

ప్రసాదుకున్న ఆస్తి పాస్తులు మరే యువతికి దక్కకుండ తానే ప్రసాదును పెండ్లి చేసికొని ఆయింటికి యజమానురాలను కావాలనే పట్టుదల స్వర్ణలో నానాట బల

పడడం యీ కాలంలోనే ఎక్కువయింది. తన వివాహం ప్రసాదుతో ఎంత త్వరగ జరిగితే అంత మంచి మేలు క్షేమం తన కున్నదని బాగా గ్రహించింది.

ఎంకడుయిన మంచిది స్వర్ణను రాజకీయంగ అభివృద్ధి చేయాలనే కోరిక పట్టుదల ప్రసాదులో జనించింది. మార్క్సు లెనిన్, స్టాలిన్ సిద్ధాంతాలవైపు ఆమె దృష్టిని మరలించ డానికి, అందుకు సంబంధించిన పుస్తకాలుకూడ గట్టిగ చదివించాలని వుబలాట పడడం మొదలెట్టాడు. గతంలోకన్న స్వర్ణ యింటికిపోవడం ఎక్కువచేశాడు. పోయేటప్పుడు కట్టలకు కట్టలు మార్క్సిస్టు సాహిత్యం తీసుకెళుతుండేవాడు. కొద్ది మాసాలకే స్వర్ణ రూమంతా పుస్తకాలతో నిండి పోయింది. దేశంలోవున్న దోపిడి విధానం పోవాలని, సమాజంలో ఆర్థిక సాంఘిక సమానత నెల కొల్పడానికి మార్క్సిజం ఒక్కటే సరయిన మార్గమని ప్రజల ఆశయ సాధన కోసరం స్వర్ణలాంటి నవయువతులు ముందుకొచ్చి నడుం బిగించి దోపిడి వ్యవస్థను తుదముట్టించడానికి పోట్లాడాలని ఆవేశంతో మాట్లాడు తుండేవాడు. స్వర్ణ యీ కాలంలో ప్రసాదు రాజకీయ భావాలలోతు, తీవ్రత చక్కగ అర్థంచేసి కోడానికి వీరిద్దరిమధ్య జరిగిన సంభాషణలు సమావేశాలు ఆమెకు వుపకరించాయి.

"హింస, దౌర్జన్యాలు ప్రోత్సహించేవిగ రాజకీయ సిద్ధాంతాలు లేకుండావుంటే మీరాజకీయ అభిప్రాయాలతో నాకేలాంటి అభిప్రాయ భేదాలువుండవు సరిగద, వాటిఆశయ

సాధనకు నాశక్తి కొలది సహాయపడతాను" ఎటకారంగ అన్న యీ మాటలలోతు ప్రసాదు గ్రహించడంలో పూర్తిగ విఫలు డయ్యాడు - స్వర్ణకు కమ్యూనిస్టు రాజకీయాల వూసే పనికిరాదు - పైగా వాళ్ళంటేన్నే బహు మంటలు మండి పోతుంది. రాజకీయాలంటే అంతగ ఆశపడే వ్యక్తిని ఎక్కడ వ్యతిరేకిస్తే ఏమి జరుగుతుందోనని అన్ని విషయాల్లోను ప్రసాదుతో ఏకాభిప్రాయానికి వచ్చేది. చర్చల సందర్భంలో అమిత తెలివి తేటలు ప్రదర్శించేది - ప్రసాదు రాజకీయాలతో భేదాభిప్రాయం లేదనే నటన మొదలెట్టి ప్రసాదుని తనవలలో వేసికోవాలి. ప్రసాదుని తన అందానికి దాసుణ్ణి చేయాలి. తరువాత అతని రాజకీయాభిప్రాయాలు మార్చాలి. యిదే స్వర్ణప్రతిజ్ఞ. స్వర్ణ తన మొదటి చూపుల్లోనే అనేకమందిని తన వలలో వేసికోగలిగింది. స్వర్ణ ఒకసారి కన్నార చూచి నోటూర పలకరించి తేచాలు తాను చెయ్యమని అనేకమంది యువకుల చేత చేయించింది. ప్రసాదు స్వర్ణ అందాన్ని చూచి వుల్లాస పడతాడు. స్వర్ణ చూపులు తనకు హాయిని కలుగజేస్తాయి - కాని స్వర్ణ మాటలు సత్యానికి, న్యాయానికి విరుద్ధంగ వుంటే ముఖానే ఖండించి నిర్మొహమాటంగ వ్యవహరిస్తాడు. ప్రసాదుతో యిదొక బాధాకరమైన అనుభవం స్వర్ణకు.

వెంకటరత్నం జగ్గయ్య శ్రీనివాసరావుల్ని ప్రభుత్వానికి పట్టియిస్తే వందల రూపాయల్లో బహుమతులు యివ్వగలమని ప్రభుత్వం పత్రికల్లో ప్రకటించింది - వీరి గుర్తులు తెలియడానికి ఫోటోలుకూడ పత్రికల్లో ప్రముఖంగ ప్రభు-

త్వమే ప్రకటించింది. దీనితో రైతుకూలి కమ్యూనిస్టు పార్టీ నాయకులను అరెస్టు చేయడానికి పోలీసులవేట తీవ్రమయింది. గ్రామాల్లోని భూస్వాములు గూండాలను తయారుచేసి ముఖ్యంగ వెంకటరత్నాన్ని పట్టుకోవాలని తీవ్రంగ ప్రయత్నిస్తున్నారు - భూస్వాములకు మొదట రత్నం పేరు వింటేనే సింహ స్వప్నం. నిద్దట్లో రత్నం గుర్తుకొస్తే పెద్దగ కేకలుపెట్టి తత్తరతో మంచాలమీదనుండి అమాంతంగ క్రింద పడేవాళ్ళు. పోలీసు దాడులు గ్రామ సీమలపై కేంద్రీకరించ బడ్డాయి. వ్యవసాయ కూలీలు, రైతులు తమ ప్రియ తమ నాయకులకు ఆశ్రయమిచ్చి కంటికి రెప్పలాగ కాపాడు కుంటున్నారు. పోలీసు దాడుల స్వభావం అతి క్రూరంగాను నీచంగాను వుండడంతో వెంకటరత్నం కొన్నాళ్లు పట్టణంలో వుండడం మంచిదనే నిర్ణయానికివచ్చి గుంటూరు చేరుకున్నాడు. ఊనులో వెంకటరత్నానికి పూర్తి రక్షణ కల్పించే బాధ్యతలు ప్రసాదుస్వీకరించాడు. వెంకటరత్నం దిన చర్యల్లో కనబడే క్రమశిక్షణ, ఉత్తమ రచనలు చదవడంలో ఆయిన వెచ్చించేకాలం, వీటన్నిటికిమించి కష్టజీవుల సమస్యలయెడ ఆయిన పడేబాధ ఆవేదన ప్రసాదుని ఆశ్చర్య చకితుడ్ని చేసాయి. రత్నంలో మానవత్వం, పేదప్రజలయెడ ప్రేమ తొణికిసలాడుతుంది. నిజాయితీగల ఏవ్యక్తి అయిన ఒకగంటసేపు రత్నంతో మాట్లాడితే ఆవ్యక్తి యిక రత్నం మనిషే అయిపోతాడు - ఆయన మాటల్లోను, చూపుల్లోను వర్ణించడానికి అలవిగాని ఆకర్షణశక్తి లాలనవుంది. రత్నంతో పరిచయం ఏర్పడిన కొలది రోజులకే ప్రసాదులో పెద్దమార్పు

వచ్చినట్లు కనబడింది. క్రమశిక్షణ పెరిగింది. కాలాన్ని వృధా చేయకుండ మంచి పుస్తకాలు, పేపర్లు చదవడం ఎక్కువైంది. సొల్లు వాగుడు తగ్గింది. వీటన్నిటికి మించి చీటికి మాటికి స్వర్ణ యింటికిపోవడం మానేశాడు.

కాలేజీ విద్యార్థులకు క్రిస్టమస్ సెలవులు యిచ్చారు. ఒక జట్టు విద్యార్థులు సెలవుల్లో కాశ్మీరు ఎక్సకర్షను పోడానికి నిర్ణయించుకున్నారు. వీరికి తోడుగ కొంతమంది కాలేజి అధ్యాపకులుకూడ కాశ్మీరు బయలు దేరారు. కాశ్మీరు వెళ్ళడానికి సిద్ధపడిన విద్యార్థిని స్వర్ణ ఒక్కతే. యీ విద్యార్థులంతా గుంటూరునుండి బయలుదేరి కాశ్మీరు వరకు వెళ్ళి అనేక పారిశ్రామిక కేంద్రాలు, చరిత్ర ప్రసిద్ధి గాంచిన పట్టణాలు, వినోద కేంద్రాలు చూచిరావాలి. కాశ్మీరు యాత్రకుపోయే విద్యార్థుల్లో ప్రసాదు పేరులేదు - యీ విషయం స్వర్ణకు తీరని ఆశాభంగాన్ని కలుగ జేసింది. ప్రసాదు లేని కాశ్మీరు యాత్ర స్వర్ణకు చంద్రుడులేని రాత్రిగ కనబడింది. స్వర్ణ వెంట ఎప్పుడు ఎవరో ఒక మంచి యువకుడు వుండాలి. సరదానిచ్చే కబుర్లు చెపుతూ వుండాలి. లాజరుకు కాశ్మీరు వెళ్ళగల ఆర్థిక స్తోమతలేదు. అయినప్పటికి ఏలాగయిన పోవాలని నిర్ణయించు కున్నాడు. తండ్రిని బలవంతపెట్టి నెలకు రూపాయికి రెండు అణాలు వడ్డీ చొప్పున కొంతడబ్బు నోటువ్రాయించి ఒక భూస్వామిదగ్గర సంపాదించాడు. ప్రసాదు లేనికొరత స్వర్ణకు యిపుడు కొంతవరకు తీరింది. ఇప్పటికే స్వర్ణ ప్రసాదులమధ్య కొన్ని ప్రేమలేఖలు నడిచాయి.

కమ్యూనిస్టు భావాలుగల విద్యార్థులందరికి రహస్యంగ ఒక రాజకీయ పాఠశాల సెలవుల్లో ఏర్పాటు చేయించారు. వెంకటరత్నం, శ్రీనివాసరావు, జగ్గయ్య, సుబ్బయ్యలు పాఠశాలకు అధ్యాపకులుగ వచ్చారు. రత్నం మార్క్సిస్టు ఆర్థిక తత్వశాస్త్రాలను భోదించాడు - శ్రీనివాసరావు అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ చరిత్ర, వలస దోపిడినుండి సామ్రాజ్య వాదుల పీడనుండి ఆసియా. ఆఫ్రికా దేశాల్లోని వలసప్రజలు సాగించే సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమాల చరిత్ర వివరించాడు - జగ్గయ్య దున్నేవాడికే భూమిలభించే వ్యవసాయ సంస్కరణల అవసరాన్ని వివరించాడు - పాలేరుగ జీవితాన్ని ప్రారంభించి కళాశాలల్లో చదువుకునే విద్యార్థులకు పాఠాలు చెప్పగలశక్తి సామర్థ్యాలు ప్రదర్శించిన జగ్గయ్య తెలివితేటల్ని విద్యార్థులంతా గొప్పగ మెచ్చుకున్నారు. సుబ్బయ్య యువజన సంఘాలు నిర్మించి యువకుల్ని పాడు వ్యసనాల బారినుండి కాపాడి వారి దేహదారుఢ్యానికి మానసిక వికాసానికి తోడ్పడి ప్రజా సేవవైపు యువకుల్ని మరలించాల్సిన చారిత్రిక అవసరాన్ని వివరించాడు. రాజకీయ పాఠశాల అతి నైపుణ్యంగ నిర్వహించడంలో ప్రసాదు ప్రముఖ పాత్ర వహించాడు. యీ రాజకీయ పాఠశాలలో పాఠాలు నేర్చుకున్న విద్యార్థులంతా తమ జీవితాన్ని ప్రజా సేవకు అంకితం చేయడానికి కమ్యూనిస్టుపార్టీలో చేరి శ్రామిక వర్గ ప్రయోజనాలు సాధించడానికి ప్రతిజ్ఞ పూనారు. యీ విద్యార్థులంతా చదువులుమానేసి వుద్యోగాలకు ప్రయత్నించ

కుండ అనేక తాలూకా, జిల్లాల్లో ప్రజావుద్యమాలు నిర్మించి గొప్ప ప్రజా సేవకులుగ తరువాత కాలంలో రాణించారు.

రహస్య రాజకీయ పాఠశాల అనంతరం రత్నం, జగ్గయ్య. శ్రీనివాసరావు, సుబ్బయ్యలు గ్రామీణ ప్రాంతాల్లో జరిగే పోలీసు దాడుల్ని గూర్చి చర్చించారు. అన్యాయంగ జరిపే యీ పోలీసుదాడుల్ని ప్రజలు, ప్రజాస్వామిక వాదులు తీవ్రంగ ఖండించి ఎదిరించడానికి ప్రజల్ని సిద్ధపరచాలని నిర్ణయించు కున్నారు. తక్షణ భూసంస్కరణల అవసరాన్ని, బంజర్ల పంపకాన్ని ప్రజల్లో తీవ్రంగ ప్రచారం చేయడానికి ప్రత్యేక కార్యక్రమాన్ని రూపొందించారు. వెంకట రత్నం కొన్ని పనులమీద టౌనులోనే వుండిపోవాల్సివచ్చింది. జగ్గయ్య, శ్రీనివాసరావు, సుబ్బయ్యలు తమ తమ ప్రాంతాలకు వెళ్ళిపోయారు. రహస్యంగ అచ్చువేయించిన అనేక టన్నుల కరపత్రాలు, భూసంస్కరణల అవసరాన్నిగూర్చి తెలియచేసే చిన్న పుస్తకాలు గ్రామాల్లో విరివిగ పంచడం ప్రారంభించారు - ప్రజల పౌరసత్వ హక్కులపై జరిగే పోలీసు దాడుల తీవ్రతను తెలియజేసే వాల్‌పోస్టర్లు గ్రామాలనిండా అంటించారు.

స్వర్ణ కాశ్మీరు వెళ్ళింది. కాలేజి విద్యార్థులంతా సుందరమైన ప్రకృతి దృశ్యాలనుచూచి ఆనందించారు. స్వర్ణ లాజరు ఒక జంటగ తిరుగుతు తాము చూచిన విషయాలపై తమకు గలిగిన మొదటి అభిప్రాయాలు డైయిరీలో నోట్సు వ్రాసికుంటున్నారు. కాశ్మీరునుండి విద్యార్థులజట్టు ఢిల్లీ చేరు

కుంది. ఆరాత్రి అంతా కలిసే వున్నారు- తెల్లవారిన తరువాత ఎర్రకోటను దర్శించాలి. స్వర్ణ లాజరు లిద్దరు విద్యార్థి జట్టు నుండి కావాలని విడబడి పోయారు - ఆరోజంతా ఎక్కడు న్నారో తెలియదు - రెండవరోజు ఆగ్రా వెళ్లారు - తాజ్ మహలు వెన్నెల రాత్రిలో దర్శించారు. తాజ్‌మహల్ అందాన్ని, వైభవాన్ని వర్ణిస్తూ లాజరు కొన్ని పద్యాలు అమోఘంగా పాడాడు. లాజరు మధుర కంఠాన్ని గొప్పగ కొనియాడింది. లాజరు వుండలేక మహా మేధావి, మహా కవి శ్రీ శ్రీ వ్రాసిన -

"నైలు నదీ నాగరికతలో
సామాన్యుని జీవన మెట్టిది,
తాజమహల్ నిర్మాణానికి
రాళ్ళెత్తిన కూలీ లెవ్వరు."

చారిత్రక గేయాన్ని పాడి అది తాను వ్రాసినట్లు చెప్పుకోవ డం మొదలెట్టాడు. స్వర్ణకు ఆధునిక కవుల్నిగూర్చి తెలుసో లేదో కనుక్కోడానికి మాత్రమే లాజరు యీ అబద్ధం ఆడాల్సి వచ్చింది. స్వర్ణ వెంటనే అందుకుంది. "ఆపండి యిదంతా మీా కవిత్వం గాదు. శ్రీరంగం శ్రీనివాసరావు వ్రాసిన మాలోళ్ళ కవిత్వం. ఆలాంటి పాటలు పాడడానికి యిది సమయంకాదు. కళకు ,ఒక రకంగ అపకారం కూడాను" ఫ్యూడల్ మనస్తత్వం, ఫ్యూడల్ అహంకారం బలిసిన స్వర్ణకు శ్రీ శ్రీ కవిత్వం నచ్చకపోవడంలో ఆశ్చర్యంలేదు. కళా సృష్టిలో శ్రామిక బుధజీవుల పాత్ర ఫ్యూడల్ బూర్జువా

వర్గాలు గుర్తించరు. బుద్ధిపూర్వకంగ రెండు కళ్ళు తెరిచి ఆడాలనే వారు అబద్ధాలు ఆడతారు.

ఇద్దరూ మరల ఢిల్లీ తిరిగి వచ్చారు. ఆరోజు యిద్దరు ఒకే ప్లేటులో భోజనం చేశారు. ఇద్దరు ఒకే మంచంమీద పండుకున్నారు. లాజరుకు ప్రేమంటే పెండ్లికోసరమేనని. పెండ్లికిదూరమైన ప్రేమను అతను ప్రోత్సహించలేడు. స్వర్ణకు లాజరంటే ప్రేమ వుంది. పెండ్లికి మాత్రము కాదా ప్రేమ. అదొకందుకు లాజరును ప్రేమిస్తుంది. అది అంతే, యీ రహస్యాన్ని లాజరు తెలిసికొనివుంటే స్వర్ణవలన పెద్ద ప్రయోజనాన్ని, సుఖాన్ని పొందివుండేవాడు. స్వర్ణను గట్టిగ కౌగలించుకొని ముద్దుపెట్టుకున్నాడు. స్వర్ణ చేతి వ్రేళ్ళను నెమ్మదిగ వత్తుతు "నిన్నొకమాట అడగాలనుకుంటున్నాను—అయితే మాట స్వభావం చాలా తీవ్రమయినది – ఏమంటావు" "తీవ్ర స్వభావం గల మాటలు యిప్పుడొద్దు, కొన్నిరోజులు గడవనివ్వండి" అంది స్వర్ణ. స్వర్ణ తియ్యటి కబుర్లతో లాజరును ముంచితేల్చుతూ వుంది. ఈవిధంగా నాలుగు రోజులు గడిచాయి. అయిదవ రోజు స్వర్ణయొక్క ప్రేమ స్వభావాన్ని ఖచ్చితంగ తెలిసికోవాలనుకున్నాడు. తన పూర్తి అభిప్రాయం ఆమెతో చెప్పాలని నిశ్చయించుకున్నాడు. "మన యీ ప్రేమను శాశ్వతంగ సార్థకం చేయాలంటే మనిద్దరి మధ్య పెండ్లి ఒక్కటే మార్గమని నా అభిప్రాయం." "పెండ్లా! ఎవరిద్దరి మధ్య" అని ఆశ్చర్యంగా స్వర్ణ ప్రశ్నించింది. "మనిద్దరి మధ్యనే. లేకపోతే యీ ప్రేమ వెర్రి తలలు వేసి చివరకు

పేరే నే బ్రహ్మరాక్షసి స్వరూపం దాల్చి, యువతీ యువకుల్ని అమాంతంగ కబళించివేస్తుంది. ప్రేమ దేవతకు అపచారం చేయకూడదు. ప్రేమికులు విధిగ వివాహం చేసుకోవాలి. అలాంటి అవకాశం లేకపోతే యిద్దరూ యితర ఆలోచనలు లేకుండా శాశ్వత బ్రహ్మచర్యాన్ని స్వీకరించాలి." లాజరుకు జీవితంలో యిది మొదటి అనుభవం. పోతే స్వర్ణకు యిది నాలుగో అనుభవం. అందువలన స్వర్ణలాగ నిలకడగ, అనుభవంతో మాట్లాడ్డంలో లాజరు విఫలుడయ్యాడు. వాస్తవానికి స్వర్ణ పెండ్లికోసరము ఎవరినీ ప్రేమించనని చాలకాలం నాడే నిర్ణయించుకుంది. పెండ్లి చేసుకోమని లాజరు ఆమె వెంటబడడం అర్థంలేని విషయం. ఒకవేళ పొరపాటున అలాంటి స్త్రీతో పెండ్లి జరిగినా అనుభవించే సుఖం లేకపోగా జీవితమంతా అనుమానాలతో, భయంతో, మానసిక వ్యథలతో మగవాడు క్రుళ్ళి కృశించిపోవాల్సిందే. బ్రతికున్నంత కాలం జీవితంలో శాంతి అంటూ మగవాడికి వుండదు. నిద్ర నశించిపోతుంది.

స్వర్ణ :- చదువుకునేవాళ్ళం యిప్పుడే పెండ్లిలాంటి తీవ్రమైన జీవిత సమస్యలు చర్చించడం మంచిదికాదు. చదువు పూర్తిచేసి ఏదో మంచి వుద్యోగంలో ప్రవేశించిన తరువాత పెండ్లిని గూర్చి మాట్లాడ్డంలో న్యాయం వుంటుంది. అసలు నీమాటలే నా కర్థంకాలేదు. నావరకు నేను మా తలిదండ్రుల్ని ఎదిరించి మన్మథుణ్ణికూడ వివాహమాడలేను. నా పెండ్లి పెత్తన మంతా పూర్తిగ మా తలిదండ్రులకే వదిలేశాను. తలిదండ్రులకు యిష్టంగాని యువకుణ్ణి ఏదో ప్రేమ

కోసరం - పెద్ద త్యాగమంటూ కన్నకడుపుల్ని బాధపెట్టడం నాకు యిష్టంలేదు. సిద్ధాంతరీత్యా యీలాంటి విషయాలకు నేను పూర్తి వ్యతిరేకిని. మనిద్దరిమధ్య వివాహం పూర్తిగ అసంభవమయిన చర్చమాత్రమే అవుతుంది.

లాజరు :- నా ప్రేమ కౌగిలిలో నలిగి నజ్జయిపోయావు. నాచేత చేయరాని పనులన్ని చేయించావు. యివన్నీ మీ తలిదండ్రుల అభీష్టంప్రకారం, వారి సెలవుమీదే చేశావా?

స్వర్ణ :- స్త్రీ పురుషులు యౌవ్వన దశలో చేయాల్సిన పనులే చేశాము. ఇందులో చేయరాని పనంటూ ఏమీ చేయలేదు. చేయరాని పని మీ రేదయినా చేసివున్నామను కుంటే ఆవిషయం మొదట్లోనే వ్యతిరేకించి వుండాల్సింది. అదేదో నా అవసరంకోద్దే నావెంట వచ్చినట్లు మాట్లాడుతు న్నావు. ఇది పొరపాటు. పురుషుడికి స్త్రీతో ఎంత అవసరం వుందో స్త్రీకి కూడ పురుషుడితో అంతే అవసరం. అందు కని నేరం అంతా నాపై రుద్దడానికి ప్రయత్నించడం భవిష్య త్తులో మనం మామూలు స్నేహితులుగ వుండడానికి కూడా సహాయకారిగ వుండదు. నాలో బలహీనతలు నీవు జాగ్రత్తగ అర్థంచేసుకుని నా యౌవ్వనాన్ని అందుకు సాధనంగ పెట్టు కొని యీ పాపమార్గంలోకి నీవే నన్ను లాక్కొచ్చావు. నీ లాంటి అందమైన కొంతమంది యువకులతో నాకు పరిచయం లేకపోలేదు. వారితో సరదాగా కాలం గడిపాను. పెండ్లి లాంటి సమస్యలు వారు లేవనెత్తలేదు. మాకు లభించిన

కాలంలో ఏ ఒక్క క్షణాన్ని బాధను కలిగించే మాటలతో వృధా చేయలేను.

లాజరు :- నిన్ను నా హృదయపూర్వకంగా ప్రేమించాను. నా ప్రేమను తిరస్కరించకూడదు. ప్రేమకు కులం, మతం, బీదతనం, తలిదండ్రులు అడ్డంరాకూడదు. ప్రేమ పవిత్రమైనది. పవిత్ర ప్రేమ భగ్నమయిపోరాదు. నా మాటవిను ఎండల కాలంలో మనిద్దరి మధ్య రిజిష్టరు వివాహం జరగాలి.

స్వర్ణ :- ఏడ్చినట్లుంది - రెండో వాళ్ళకు తెలియకుండ ఎవరంతటికి వాళ్ళు కనపడ్డ వాళ్ళందర్ని ప్రేమించి పెండ్లి చేసికోమని వెంటబడ్డం హాస్యాస్పదమైన విషయం.

లాజరు :- నీ శరీరంలోని ప్రతి అవయవాన్ని ముట్టాను. నామీద నీకు ప్రేమలేకుండ, నీ అనుమతి పొందకుండ యీ పనంతా నాఅంతట నేనే నీకు తెలియకుండ నిన్ను చాటుగ ప్రేమించి చేయగలనా? నా బీదతనాన్ని చూచి డబ్బుగల వాళ్ళకు నీశరీరాన్ని అమ్ముకో కూడదు. నీవు అలాచేస్తే అది కటికి పాపం మాత్రం అవుతుంది.

స్వర్ణ :- ఎక్కడ అవకాశంవుంటే అక్కడ జీవితాన్ని సుఖపెట్టుకోవడమే నా జీవితలక్ష్యంగ నిర్ణయించుకున్నాను. నీతోనే నాకు యిది మొదటి అనుభవంకాదు. జరిగిపోయిన జీవితంలో కొంత అనుభవంవుంది. నీవాదన ప్రకారమే అయితే వారిలో ఎవరినో ఒకర్ని వివాహమాడి వుండాల్సింది - నీ మాటప్రకారం చేసివుంటే నాతో నీకు లభించిన సుఖం నీకు లభ్యమయి వుండేదికాదు.

వీరిద్దరిమధ్య జరిగిన సంభాషణల సరళి లాజరులో తీవ్రమైన కోపాన్ని అసహానాన్ని పురి కొల్పాయి - స్వర్ణలాంటి వాళ్ళు జీవించివుంటే సమాజంలో నైతిక ప్రమాణాలు పూర్తిగ నశించి పోతాయని భయపడ్డాడు - స్వర్ణ రెండు గూళ్ళు గట్టిగ పట్టుకొని అమాతంగ పైకి లేపి రాతి నేలపై వదిలాడు. "అమ్మో చచ్చాను" అని పెద్దగ అరిచింది. లాజరు అంతటితో ఆగలేదు - కంఠం పట్టుకోడానికి సమీపిస్తున్నాడు. "నన్ను చంపకండి" అని లాజరు పాదాల పైబడి ఏడ్చింది - విపరీతమైన ఏడ్పు - స్వర్ణ వణికి పోతుంది - వళ్ళంతా చెమటతో తడిసిపోయింది. లాజరు పాదాలు కంటినీటితో తడిసి పోయాయి - లాజరు హృదయం చల్లబడింది. స్వర్ణ పైకి లేచింది. లాజరులో మరలా కోపం బయలు దేరింది. బాగా పైకిఎత్తి క్రిందికి వదలడంతో స్వర్ణకు నడుం విరిగినంత పనయింది. గాజులు పగిలిపోయాయి. గాజుపెంకులు గుచ్చుకొని చేతులవెంట రక్తం కారుతుంది. లాజరు మరలా స్వర్ణను సమీపించి పిచ్చివాడిలా ఆమె జుట్టంతా చిందర వందరగ జిమ్మిపారేశాడు. పమిటి చెంగు క్రిందికిలాగి పారేశాడు. స్వర్ణ కండ్లవెంట కారేనీళ్ళు చనుదొమ్ములపై బడుతున్నాయి. ఏడ్పుతో వున్న స్వర్ణ అందం వర్ణనాతీతంగవుంది.

లాజరు రెండవ గదిలోకి వెళ్ళాడు. బైబిలుతీసి కొంత సేపు చదువుకున్నాడు. పెద్దగ ప్రార్థన చేశాడు. తాను చేసిన పాడుపనికి కోపగించుకోవద్దని క్రీస్తు దేవుడ్ని వినయంగ

వేడు కున్నాడు - నొసటపై చూపుడు వ్రేలితో మూడుసార్లు శిలువ వేసికున్నాడు.

మూటముల్లె సర్దుకొని స్వర్ణతో సంబంధం లేకుండ యింటికి ప్రయాణం కట్టాడు. స్వర్ణకూడ లాజరు వెంట బయలుదేరింది. "దయచేసి నీవు నావెంటరావద్దు నీ నీడకూడ త్రొక్కదలచలేదు. పో. వెళ్ళిపో - నా వెంట రావద్దు" అని గద్దించాడు. స్వర్ణ పగటివేళలో ఎక్కడికయిన పోయి రాగలదు. చీకటి పడితేచాలు - విపరీతమైనభయం. చీకట్లో కాలు మదుచుకోడానికికూడ ఒంటరిగ పోలేదు. ఢిల్లీనుండి ఒంటరిగ యింటికి తిరిగిరావడం ఆమెకు సాధ్యంగాని విషయంగ భయపడి, లాజరు చేతులు పట్టుకొని పెద్దగ ఏడ్చింది - యింటిదాకా పంపిరావాలని ప్రాధేయపడి అడిగింది. జాలిగుండెగల లాజరు అందుకు అంగీకరించాడు. స్వర్ణ డబ్బుతోనే యిద్దరికి సెకండ్ క్లాస్ టిక్కెట్లుకొని బండి ఎక్కారు - తెనాలి చేరేటప్పటికి సాయంత్రం నాలుగు గంటలయింది.

గ్రామానికి చేరుకోవాలి - బస్సుమీద యిరవయి మైళ్ళు ప్రయాణం చేసారు. అక్కడనుండి మూడుమైళ్ళు కాలినడకతో గ్రామం చేరుకోవాలి. గత వారంరోజులనుండి అకాల వర్షాలు కురిసాయి. సూర్యుడస్తమించాడు - లాజరు స్వర్ణ లిద్దరు బస్సుదిగారు. గ్రామం చేరుకోడానికి ఒకే ఒక మట్టిరోడ్డువుంది. వర్షాలవలన రోడ్డుబాగా కదిలి పోయింది. మోకాళ్ళలోతు వరకు దిగే వుబ్బలిలో ప్రయాణం చేయాలి. ఇద్దరు బురదలో బయలు దేరారు. చెంగులు దోపుకొని కుం

డానే నాలుగడుగులు వేసింది - మనిషి మోకాళ్ళవరకు కోక చెంగుతో సహా బురదలో కూరుకు పోయాయి - "ఏమండి కోకఅంచులన్ని బురదలో కూరుకుపోయాయి - ఇదేమయిన తారురోడ్డనుకున్నారా - అంచులు బాగా పైకి కట్టేసేయండి" స్వర్ణ ఒకమైలుదూరం బాగానే నడిచింది.

ఒక ఫర్లాంగు దూరంలో హరిజనవాడలోని దీపాలు కన బడ్డాయి. పల్లెగుండా ప్రయాణంచేస్తేగాని గ్రామం చేరుకో డానికి వేరే దారిలేదు. పల్లెకుపోయే రోడ్డు మరీ అధ్వా న్నంగా వుంది. కాళ్ళకు యినపబండలు కట్టుకొని నడుస్తున్న ట్లుంది ఆ బురదలో ప్రయాణం. బురద జిగటలు సాగిపోతు వేసినకాలు పీక్కోటానికి తలప్రాణం తోకకొస్తుంది. స్వర్ణ బాగా అలసిపోయింది. వళ్ళంతా చెమటపోసింది. దీనికి తోడు లాజరు చేతిలో తిన్న దెబ్బలు బాగా బరువుచేశాయి. లాజరు భుజాలమీదపడి కొద్ది నిముషాలసేపు నిలువు కాళ్ళ మీదే విశ్రాంతి తీసుకుంది. చీర మోకాళ్ళపైకి ఎగగట్టి నప్పటికి బురద నీళ్ళతో కోక పూర్తిగ తడిసిపోయింది. మంచును ధిక్కరించే తెలుపుగల స్వర్ణకాళ్ళు నల్లటి బురద మట్టితో కప్పివేయబడ్డాయి - లాజరు భుజాలమీద తల ఆనిం చిన కొన్ని నిముషాలకు స్వర్ణకళ్ళు గిరున తిరిగాయి - మరల కొద్ది నిముషాలకు తెలివి వచ్చినట్లుంది - లాజరు చేయిపట్టు కొని మెల్లగ బయలు దేరింది. పల్లెసమీపంలోకి వచ్చారు. భరించలేని పెంటలకంపు. ఆ కంపుకొట్టే డొంకలోనే స్త్రీలు ఒకప్రక్క, పురుషులు మరోప్రక్క కూర్చొని వున్నారు

"చూచావా గ్రామీణ ప్రజల అవస్థ - మనుగుడొడ్డుకట్టించే దిక్కు-కూడ యీ ప్రజలకు లేదు - వారిమాన మర్యాదలే మంటగలిసి పోతున్నాయి." స్వర్ణ ముక్కోళ్ళకు గుడ్డ అడ్డం పెట్టుకొని తొందరగ నడవమంది. ఆ తొందరలో కాలుజారి యిద్దరు పడ్డారు. వళ్ళంతా బురద - బురద కడుక్కోడానికి ప్రక్కనున్న పంటకాలువలోకి వెళ్ళారు. భరించలేని వాసన. చచ్చిన కుక్కలు, ఎలుకలు, చర్మం వొలిచిపారేసిన బరిగొడ్ల కుళ్ళిపోయిన మాంసం, ఎముకలు,నత్తగుల్లలు,పీతలపొలుసు. యీ వాసన స్వర్ణ భరించలేక పోయింది. వళ్ళంతా తెమిలింది. రెండు పర్యాయాలు వాంతులు చేసికుంది. రాత్రి ఎనిమిది గంటలయింది. పల్లె నడిబజారుగుండా బయలుదేరారు. నడిబజారులో పెద్దఎత్తున ఎర్రజెండా ఎగురుతూంది. ఆ పూరి గుడిసెల్లో కాపురాలుచేసే ప్రజల జీవితాలు స్వర్ణకు చాలా రోతగ కనబడ్డాయి.

పల్లెదాటి ఫర్లాంగుదూరం వచ్చారు. "అబ్బో ఏదో అరకాలులో" అని పెద్దగ అరిచింది. లాజరు ఏదైనా పురుగు ముట్టుకుందేమోనని భయపడ్డాడు. బ్యాటరీ లైటు వేసి చూచాడు. అరికాలులో రాయి గుచ్చుకుంది. బాగా రక్తం వస్తుంది. ఈరోడ్డుకు మెటల్ వేయిస్తానని బాపయ్య కాంట్రాక్టు తీసుకున్నాడు. ఎండల కాలంలో బాగా మట్టి తోలించి ఆ మట్టిపై పలచగ కంకర తోలించాడు. ఒకటో రకం మెటల్ రోడ్డు వేయించినట్లు ప్రభుత్వం దగ్గర డబ్బు కొట్టేసి, ఎస్టిమేటు అయిన డబ్బులో నాలుగోవంతు ఖర్చుపెట్టాడు. వర్షాలకు

గోడ్లు, మనుషులు బాగా త్రొక్కడంతో రాయి క్రిందికి పోయి మట్టి పైకివచ్చింది. రోడ్డు రిపేరు చేయించనపుడు మను షులు నడవడానికి వుపమోగంగా వుండేది. కంకర తోలిన తరువాత వర్షం కురిస్తే నడవడానికికూడ వీలులేకుండపోయింది. రోడ్డు మరమ్మత్తులో బాపయ్య చేసిన దగా స్వర్ణ అరికాలుకు చుట్టుకుంది. రాత్రి తొమ్మిది గంటలకు స్వర్ణ యింటికి చేరు కుంది. ఆకలి దహించుకుపోతుంది. ఆకలి బాధకు మించిన బాధ మరేదీ ప్రపంచంలో లేదని గ్రహించింది. మామూ లుగ తినే తిండికన్నా మూడురెట్లు అధికంగా తింది.

లాజరు క్రీస్తు మతం స్వీకరించిన నిమ్న జాతి కులస్తుడు. ఈ మతం స్వీకరించడంతో సంఘంలో తనని నిమ్న జాతికుల స్తుడుగ చూడరని అపోహ పడ్డాడు. ఏదయిన సందర్భంవచ్చి కులంపేరు విధిగ చెప్పవలసిన స్తే తను పుట్టినకులంపేరు చెప్పు కోడానికి తెగబాధపడుతు సిగ్గువిడిచి చౌరదనో, నాయుడ్ననో చెప్పుకునేవాడు. జీవితాన్నిగూర్చి కొన్ని తప్పుడు అభిప్రా యాలకు రావడానికి సమాజంలోవున్న బీదతనం, అంటరాని తనం అతనికిబాగా తోడ్పడ్డాయి. చాలినంత డబ్బువుంటే ఎక్కడయిన చెలామణీ కావచ్చునని, ఏపనిఅయినా చేసి సమ ర్థించుకోవచ్చుననీ అతని అభిప్రాయం. నాగరికతా ప్రపం చానికి తలవంపులుగ తయారయిన దారుణమైన కులవ్యవస్థ కట్టుబాట్లువలన లాజరు అనేక పర్యాయాలు అవమానించ బడ్డాడు. అతను ఎవరిని "ఏమండి, గారు" అనితప్ప అన్యథా యితరులకు నొప్పికలిగించే విధంగ పిలవడు – తనలాగ నిమ్న

జాతికులానికి చెందిన తనతోటివారిని అరే ఒరే అని, సవర్ణ కులానికిచెందిన భూస్వామిక వర్గాలవారు పిలుస్తారు. ఉన్న పేరుతో వున్నట్లు పిలవరు. లాజరును కాస్త లాజరుగ అని పిలిస్తేతప్ప వాళ్ళకులంలోవున్న ఆధిక్యత వాళ్ళకు కనబడదు. యీ పల్లదనపు అమర్యాద పిలుపు ఫ్యూడల్, భూస్వామిక వర్గాల్లో మరీ ఎక్కువగ కనబడుతుంది. వర్గ కులవ్యవస్థలను సమూలంగ సర్వనాశనం చేయడానికి గ్రామీణ ప్రాంతంలో వున్న వ్యవసాయకూలి, పేదరైతులు వీటన్నిటికి మూలమైన ఉత్పత్తి సాధనాలైన భూమి, పరిశ్రమలు, డబ్బులాంటి ఆయుధాలు,సమాజపరంచేయడానికి రాజకీయాధికారాన్ని శ్రామిక వర్గాల చేతుల్లోకితీసుకోడానికి, సాగిస్తున్న తుదిపోరాటంపైపు లాజరు ఆకర్షింపబడకపోవడం ఒకవిధంగ లాజరుయొక్క దురదృష్టమనే చెప్పవచ్చు. గ్రామీణ ప్రాంతాల్లో పునాది వర్గాలు అవలంబిస్తున్న శాస్త్రీయ పోరాట పద్ధతులు విడనాడి ఏదోపెద్ద కులంఅనబడే వారియింట్లో పిల్లను పెండ్లి చేసుకుంటే ఆ వున్నత కులా లన్నిటిపైన కక్ష సాధించ వచ్చునని కొన్ని దినాలకు తనుకూడ ఆ పైకులాల్లో కలిసి పోవచ్చుననేది లాజరు అభిప్రాయం. అందుకే పెద్దయింటి అమ్మాయి అయిన స్వర్ణను గాఢంగ ప్రేమించాడు – ఆమెతో ప్రేమయొక్క అంతిమ శిఖరాల్ని అందుకోని బాగాఆనందించాడు. స్వర్ణతో పెండ్లిసమస్య ఎజెండాలోకి వచ్చేసరికి కథ అడ్డం తిరిగింది. అసలు ప్రేమే చాలా సంకుచితంగ, స్వార్థంగ కనబడింది. నిరాశలో క్రుంగిపోయాడు – ఆత్మహత్యకు తలపడాలనేటంత వరకు అతని ఆలోచనలు వెళ్ళాయి. తండ్రి అనేక అప్పులుచేసి

కాలేజిచదువు చెప్పించాడు. యీ గొడవలన్నిటితో పరీక్షలో వుత్తీర్ణుడు కాలేకపోయాడు– ఆశించినంత త్వరగ వుద్యోగం దొరకలేదు – ముసలి తలిదండ్రులు కూలినాలిచేసి సంపాదించిన డబ్బులతో తన జీవితాన్ని గడపాల్సి వస్తుంది. యిది చాలా బాధగ, అవమానకరంగ తోచింది. విధిలేక మిలటరీలోకి వెళ్ళిపోయాడు. కొలది సంవత్సరాలలో పెద్ద ఆఫీసరయ్యాడు.

స్వర్ణ కొన్నిదినాలు యింటిదగ్గర లాజరు చేతిలో తగలిన దెబ్బలన్ని సర్దుబాటు అయ్యేవరకు విశ్రాంతి తీసుకుని మరలా గుంటూరు వచ్చింది. యధాప్రకారంగానే కాలేజీకి పోతూవుంది. ప్రసాదుమాత్రం రెగ్యులరుగ కాలేజీకి రావడం లేదు. ఒకపూటవస్తే మరోపూటరాడు యింగ్లీషు క్లాసుకు వెళితే తెలుగుక్లాసు కట్ (Cut) చేస్తాడు. ఎప్పుడు చూచిన ఏదో హడావుడిగ వున్నట్లు కనబడతాడు – ప్రసాదులో వచ్చిన యీ నూతన మార్పుకు కారణాలు కొగడాపెట్టి వెతికిన స్వర్ణకు కానరావడంలేదు – ప్రసాదు ఏదయిన లవ్వు సిక్కు–కుగురి అయినాడేమోనని అనుమానించింది. ఆజబ్బుకుండే లక్షణాలు కనిపెట్టడంలో స్వర్ణకు మించిన డాక్టరు ప్రపంచంలోనే లేదు – ఆ లక్షణాలు ప్రసాదులో గోచరించలేదు – తనతో ఎడముఖం పెడముఖంగ వుండడానికి కారణం తనపై కాశ్మీరుయాత్రా సందర్భంలో లాజరు వలన కలిగిన అపవాదు, అల్లరి కారణమేమోనని భయపడింది. నిజానికి ఆ అపవాదు వుదంతం ప్రసాదుకు అప్పటివరకు తెలియదు.

స్వర్ణ సిగ్గు లజ్జకులోనయి కొంతకాలం ప్రసాదుతో హృదయంవిప్పి మాట్లాడడానికి తీవ్రంగ భయపడింది. చివరకు లాజరుకు తనతోవున్న పాడు సంబంధాలు ప్రసాదుకు ఏమీ తెలియవని రూఢిగ తెలిసిన తరువాత ప్రసాదును వెంబడించడం మొదలెట్టింది.

ఆదివారం మ్యాట్నీకి పోయివచ్చింది - ఆనాటి సినిమా చాలా ముదనష్టంగవుంది. ఒక్క డ్యాన్సుకూడలేదు- స్వర్ణ పెద్ద అసంతృప్తితో సినిమా మధ్యలోనే లేచి వచ్చింది. నిలువుటద్దంలో తన అందాన్ని ఒకసారి చూచుకుంది. భోజనం చేసి పరుపుమీద పడుకుంటు మధ్యాహ్నంనుండి ప్రసాదు రూముకువెళ్ళి తాపీగ బాతాఖానితో కాలక్షేపం చేయాలనుకుంటూ రెప్పవాల్చింది. ఒకగంట నిద్రపోయింది. ప్రసాదు కలలో కనబడ్డాడు - స్వర్ణకు మెలకువ వచ్చింది. కూనిరాగాలు తీసుకుంటు స్నానపు గదికెళ్ళింది. స్వర్ణ సహజమైన ఎరుపు దేహానికి సబ్బుతో స్నానం చేవఎక్కించింది. స్వర్ణకున్న మొత్తం చీరల్లో ఏచీరె ధరించాలనేది పెద్ద సమస్యగ తయారయింది. సమస్య తేలలేదు - ప్రసాదు పెద్ద ఖరీదయిన చీరలంటె యిష్టపడడని ఆమె అభిప్రాయం. అన్నిటిలోకి తక్కువ ఖరీదుగల నల్లరంగు చీరెధరించింది. గోళ్ళకు శుభ్రంగ రంగువేసికుంది. నీటుగ పెదిమెలకు రంగువేసికుంటూంది. వరండాలోవున్న కుక్కపిల్ల మెల్లగ అరుస్తు గొడవ చేయడం మొదలెట్టింది. కుక్కపిల్ల అరుపు వినగానే తనపాత మిత్రుడు గుర్తుకొచ్చాడు. స్వర్ణ జన్మదినంనాడు తన మాజీ

స్నేహితుడు ఆకుక్కపిల్లను మద్రాసునుండి కొని తెచ్చి ఆమెకు బహూకరించాడు. స్వర్ణకు నల్లటిరంగు కుక్కలంటే మంచి యిష్టం. వాటిని పెంచడంలో అమితశ్రద్ధ తీసుకుంటుంది. లిప్‌స్టిక్ అవతలపెట్టి కుక్కచెంతకు పోయింది. కుక్కపిల్ల దీనంగ స్వర్ణ వైపు చూచింది. పొట్ట లోతుకు పీక్కుపోయింది. నాలుక బయటపెట్టి తోక ఆడించడం మొదలెట్టింది. స్వర్ణ రివ్వునవంగి కుక్కను చంకనెత్తుకుంది. అనేక యాంగిల్సులో కుక్కను ముద్దు పెట్టుకుంది. కష్టపడి పెదాలకు పూసుకున్న రంగుకాస్త కుక్కవంటికి పట్టిపోవడమేగాక నాలుగయిదు వెంట్రుకలు పెదాలకు అంటుకున్నాయి. పెదాల్ని పాడుచేసావు అంటు ఒకచిన్న దెబ్బకొట్టి దానికి కావాల్సినన్ని పాలుపోసి తిరిగి గదిలోకి వచ్చింది. వ్యానిటిబ్యాగ్ చంకకు తగిలించి ప్రయాణంకట్టింది. స్వర్ణ చేతి సంచిలో ఏముంటుందో చూడాలని అనేకమంది విద్యార్థులు కుతూహల పడుతుండేవారు. ఒకనాడు స్వర్ణ కాలేజి లైబ్రరీలోని రీడింగు రూములో సంచి మర్చిపోయి వెళ్ళింది. ఆసంచి కాస్త ఒక అల్లరి విద్యార్థి చేతిలో పడింది. పదిమంది విద్యార్థులు ఒకచోటచేరి సంచిలో ఏముందో చూడాలని తెరిచారు. తీరాచూస్తే రెండుతులాల ఫేస్‌పౌడరు, అరతులం కుంకుమ, కాటికభరణి, దువ్వెన, చిల్లరడబ్బులు, కొన్ని వుత్తరాలు దొరికాయి.

మొదటి గదితలుపులు తెరిచేవున్నాయి. రెండవ గది తలుపులు ఏటవాలుగవేసి వున్నాయి. వెంకటరత్నం అప్పుడే స్నానంచేసి చొక్కాతొడుక్కుంటు ఏదో మెల్లగ ప్రసాదుతో

మాట్లాడు తున్నాడు. స్వర్ణ రాకనుచూచిన ప్రసాదు మొదటిగది వాకిటిలోకివచ్చి నమస్తే అన్న స్వర్ణకు ప్రత్యభి వందనంచేసి కూర్చోమని ఆహ్వానించాడు. వెంకటరత్నం తొందరపాటుతో రెండుగదితలుపులు వేయబోతుండగ స్వర్ణ ఆయన ముఖంకేసి స్పష్టంగ చూచింది. వెంకటరత్నం పడక గదిలోకి వెళ్ళిపోయాడు.

స్వర్ణ ప్రసాదు లిద్దరు ఒకరి క్షేమసమాచారాల్ని మరొకరు కుశలప్రశ్నలద్వారా తెలిసికున్నారు. స్వర్ణ చేతిలో వున్న సినిమాపత్రికలు తీసికొని కొంతసేపు పేజీలు తిరగేస్తు సినిమారంగంపై కొంత చర్చలోకి దిగారు. తరువాత ప్రసాదు చర్చల్ని సాహిత్యంవైపు మరలించాడు. అప్పటికి స్వర్ణ చదివిన జనరల్ పుస్తకాలు ఒక డజనుకు మించవు - ప్రసాదు చదివేసిన నవలలు, పద్య, గద్య కావ్యాలు స్వర్ణ ముందర వల్లించడం మొదలెట్టాడు. అదంతా పచ్చిగ్యాస్ అనిలోన అభిప్రాయపడింది. ఆ పుస్తకాల్లోవున్న ముఖ్య విషయాలు తడువుతు ఆమెను చర్చలోకి దింపిన తరువాత ప్రసాదు చెప్పిన మాటలన్ని నిజమేననినమ్మక తప్పలేదు. ప్రసాదు మాటలన్ని స్వర్ణకు అర్థంకాక పెద్ద గొడవగ తయారవడంతో ఆమె చర్చను ఆటలవైపు మరలించింది. ప్రపంచంలో ఫుట్‌బాల్, బాక్సింగ్, టెన్నిస్, చెస్సు, హాకి ఆటలలో గొప్ప నేర్పరు లెవరో చర్చించు కున్నారు. యీ చర్చల్లో యిద్దరిమధ్య ఏవో కొన్ని భేదాభిప్రాయాలు కలిగాయి. చివరకు యిద్దరి మధ్య చర్చనీయాంశంగ రాజకీయాలు మిగిలాయి. ప్రసాదు

కమ్యూనిస్టు రాజకీయాల ప్రస్తాపన తెచ్చాడు. స్వర్ణకు యీ వూసే పనికిరాదు - లోలోపల అసహ్యించుకుంది. పైకిఏమీ రాజకీయాల గొడవ తెలియదన్నట్లు నటిస్తూ ప్రసాదుచెప్పే దానికల్లా సరేనంటు తలూపుతూవుంది. ఆఖరి వాంశంగ ఎజెండాలో ప్రేమకు సంబంధించిన విషయాలు మిగిలి పోయాయి.

ప్రసాదు:- ప్రేమ కేవలం స్వార్థపరంగ వుండకూడదు. మనల్ని, మనకు కావాల్సిన వాళ్ళను మాత్రమే ప్రేమించడం నేర్చుకోకూడదు - అలా జరిగిననాడు ఆవ్యక్తిలో ఏదో ప్రధానలోపము, బలహీనత వీటన్నిటికి మూలకారణం అయిన స్వార్థం ఆ వ్యక్తిలో విలయ తాండవం చేస్తున్నదని తేలికగ గ్రహించవచ్చు. దేశంకోసరం సంఘంలో కీలకమైన సంస్కరణల కోసరం, సోషలిజం కోసరం అనేక కష్టాలకోర్చి, యిబ్బందులు పడుతున్న దేశభక్తుల్ని, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసరం పోరాడుతున్న అశేష జనసామాన్యాన్ని ప్రేమించడం నేర్చుకోవాలి. అదే నిజమైనప్రేమ. మనుష్యుల రక్త మాంసాలు అమ్ముకొని జీవించే దోపిడి వర్గాలంటే నాకు తగని వళ్ళుమంట. అటువంటి స్వార్థ చింతన కలవారు- వారు స్త్రీలైనా, పురుషులైనా నేను ప్రేమించలేను. అభివృద్ధిని కాంక్షిస్తున్న నవమానవ సమాజానికి ఆలాంటివారు చీడపురుగులు లాంటివారు. అశేష జన సామాన్యానికి తిండి, బట్ట, విద్యావిజ్ఞానం, యిల్లు, తిరస్కరించి, స్వార్థమే పరమార్థంగ భావించేవారి హక్కుల్ని కాపాడడానికి వున్న యీనాటి సాంఘిక న్యాయాన్ని, ఆర్థిక రాజకీయ నీతి సూ

తాళ్లిన్ని పూర్తిగ మార్చివేసి, శ్రామిక ప్రజలకు ఉత్పత్తి సాధనాలపైన హక్కులభించి, రాజకీయాధికారం వారిచేతుల్లోకి మారిననాడే దేశంలో నిజమైన ప్రేమ, సత్యం, ధర్మం వర్థిల్లుతాయి.

స్వర్ణ :- రాజకీయాల పీడ లేని రంగం ప్రేమ రంగం ఒక్కటే ననుకున్నా. చివరకు మీరు ప్రేమలో కూడ పాలి టిక్సు ప్రవేశపెట్టేశారు. అద్భుతం, అమోఘం. మీరు కని పెట్టినది నూతన ప్రయోగం అంటే నమ్మండి.

ఫ్లాస్కులో వున్న కాఫీ రెండు గ్లాసుల్లో పోసి ఒక కాఫీ స్వర్ణకు అందించాడు.

స్వర్ణ :- థాంక్సు.

ప్రసాదు :- నో మెన్షన్.

స్వర్ణ కాఫీ త్రాగుతూ సెక్సు నవల్సులో కాపీకొట్టిన నాలుగు సరిక్రొత్త జోక్సు కొట్టింది. యిందులో రెండు జోక్సు మరీబూతుగ వున్నాయి – దీనితో స్వర్ణ ఆలోచనల వెనకనున్న మనస్తత్వం బాగుండలేదనే బాధ ప్రసాదులో కలిగింది. ప్రసాదు సిగరెట్టు వెలిగించాడు. స్వర్ణకుకూడ సిగ రెట్టు సరదాగా కాల్చాలనే బుద్ధిపుట్టింది. తనసొంతయింట్లో ఎవరికి తెలియకుండ అపుడపుడు రహస్యంగ సిగరెట్లు త్రాగు తుంటుంది. ప్రసాదు ముందర సిగరెట్టు వెలిగించడానికి మొదట్లో కొంత భయపడ్డా కొద్దినిముషాల తరువాత ఒక సిగరెట్టుతీసి వెలిగించింది. "రూములోవున్న వ్యక్తికి కాఫీ

అందించకుండ మనమే త్రాగుతున్నాము. కొంపదీసి ఆయనే మయిన అనుకోడుగదా" యీ రిమార్కుతో ప్రసాదుకు గుక్క త్రిప్పుకోలేనంత పనిజరిగింది. వెంకటరత్నం ఆమెకంటిలో పడలేదని మొదట్లో అభిప్రాయ పడ్డాడు.

ప్రసాదు :- ఆయన పల్లెటూరి మనిషి. కాఫీ టీలు వాళ్ళు త్రాగరు. రోజుకు మూడుపూటలు తడవకు సోలెడు బియ్యపు అన్నం తేలిగ్గా తినేస్తారు.

స్వర్ణ :- యింతకూ ఆయనది ఏవూరు. ఎందుకొచ్చాడు.

ప్రసాదు :- ఆయన నామిత్రుడు రంగారావుగారి పెద అన్నయ్య. దిట్టమైన భూస్వామి. రంగారావు నాలుగురోజుల క్రితం మద్రాసు గుర్రపు పందాలకు వెళ్ళాడు. రంగారావు జీవితం యీ మధ్య పెద్ద అరాజకంగ తయారయింది. యింటి దగ్గర వందలకు వందలే డబ్బు తీసుకురావడం చీట్లపేక ఆడడం, గుర్రపు పందాల్లో తగలెయ్యడం మొదలెట్టాడు - యింట్లోని పెద్దలు యితని ప్రవర్తనయెడల తీవ్రమైన ఆందోళన చెందుతున్నారు.

స్వర్ణ :- అయితే ఆయన మనకు చుట్టమే - మనదగ్గరకు కూడ రాకుండ చాటునే వుండిపోయాడెందుకు.

ప్రసాదు :- మీ నాన్నగారు, యింట్లో యితరులు తెలిసినంతగ నీవు ఆయనకు తెలిసి వుండవు. పల్లెటూరు మనుషులు వయస్సువచ్చిన ఆడపిల్లలతో అట్టే చనువుగ మాట్లాడరు. యుక్తవయస్సు వచ్చినతరువాత ఆడపిల్లలు చదువుకోవడం

వాళ్ళకు యిష్టముండదు. బహుశా యీాయనకూడ అదే బాపతు కావచ్చు. నీవు వంటరిగవచ్చి నాతో యింతసేపు మాట్లాడడనే బహు రోతగ భావించి వుంటాడు.

స్వర్ణ :- సరే - ఆయన గొడవ మనకెందుకు - అసలు నీవు మాయింటికి ఎందుకు రావడంలేదో చెప్పాలి. నాన్న గారు నిన్ననే గ్రామంనుండి టౌనుకు వచ్చారు. నిన్ను చూడాలని, నీతో మాట్లాడాలని నాతో చెప్పి గట్టిగ యింటికి తీసుకురమ్మని పంపాడు.

ప్రసాదు :- యీా వేళ రావడానికి వీలుపడదు.

స్వర్ణ :- ఎందుకు వీలుపడదేమిటి. అంతకొంప లారుపుకు పోయే పనుందేమటి?

ప్రసాదు :- వీలయితే రేపు కాఫీవేళకు ప్రయత్నిస్తాను.

స్వర్ణ : కాఫీకి యింటికి రావడానికికూడ పెద్ద ప్రయత్నం కావాలన్నమాట - పెద్ద బాస్‌లాగ మాట్లాడితే ఎలా. నీవు తప్పక రావాలి. యిది నాన్నగారి ఆజ్ఞ. యిప్పటికే చాలా టైము అయింది. పోయివస్తాను.

స్వర్ణ రిక్షాఎక్కి చేయి వూపుతూ ఛీరియో అంటు వెళ్ళిపోయింది. స్వర్ణ కళ్ళలో వెంకటరత్నం పడడం బహు దురదృష్టంగ ప్రసాదు భావించాడు - తనలో కనబడిన యీా అజాగ్రత్త లక్షణాలకు తననుతాను నిందించుకుంటు రత్నం వద్దకు వెళ్ళాడు. వాస్తవానికి రత్నంఅంటే ఎవరో స్వర్ణకు తెలియదు. ప్రసాదే ఆమెను రూముకు రమ్మని వుంటాడని

రత్నం పొరపాటు అభిప్రాయంలో వుండి ప్రసాదును చెడాబిడా చివాట్లు పెట్టడం మొదలెట్టాడు. రత్నం కోపంతో అనే మాటలకు ప్రసాదు వినడంగ తలవంచుకొని నేలకేసిచూస్తు బొటనవ్రేలు రాతికేసిరాస్తు ఆకోపం వెనకనున్న బాధను అర్థం చేసుకున్నాడు.

రత్నం కోపంలో వుండగ ఆయన ఎదుట ఎవరు ఏ సమాధానం చెప్పటం బహుకష్టం. వెంకటరత్నం కోపం తగ్గిన తరువాత స్వర్ణ తన మేనమామ కూతురని, వారిద్దరిమధ్య పెండ్లి జరగాలని యింట్లో పెద్దల ప్రయత్నమని వివరించాడు.

రత్నం :- ఆమె నాముఖంకేసి బాగా చూచినదను కుంటూను.

ప్రసాదు :- అవును.

రత్నం :- కొంపదీసి ప్రమాదకరమైనవ్యక్తి కాదు గదా?

ప్రసాదు :- ప్రమాదము లేదు - వల్లకాడు లేదు - ఆమెకు రాజకీయాల గొడవపట్టదు -, ఆమె వట్టి ఈజీగోయింగ్ అండ్ జాలిలైప్ ఆఫ్ వుమెన్. బూర్జువా మెంటాలిటి కావాల్సినంత వచ్చింది - అపుడపుడు మన పేపర్లు పుస్తకాలు చదువు తుంటుంది. ఏదయిన ఒకమాదిరిగ అభివృద్ధి అయితే కొంత కాలం తరువాత మన వుద్యమానికి వుపయోగ పడవచ్చు.

రత్నం :- ఆమె మాటలు, చేష్టలు చాటునుండి తిలకిం చాను - నామట్టుకు నాకు ఆమె పరమ బేవార్సు రకంగ కన బడింది. ఏది ఏమయినప్పటికి యీగదిని విడిచి నేను మరో

చోటికి వెంటనే యీరాత్రే వెళ్ళిపోవడం అవసరం. చాల రోజులుగ యీగదిలో వుంటున్నాను. ఇక యిక్కడ వుండడం మంచిదికాదు.

ప్రసాదు ఆరాత్రే రత్నానికి మరోగది మాట్లాడి ఆయనకు కావాల్సిన రక్షణ ఏర్పాట్లన్ని గావించాడు.

రెండవరోజు ఉదయం ఎనిమిది తొమ్మిది గంటలవరకు ప్రసాదుకొరకు స్వర్ణ, బాపయ్యలు ఎదురు చూచారు - ప్రసాదు ఆశించినట్లు యింటికి రాలేదు. బాపయ్య కాఫీ త్రాగుతు గ్రామాల్లో కమ్యూనిస్టులు చాలా ప్రమాదంగ తయారయ్యారని, ధనంగలవాళ్ళ ఆస్తులకు, ప్రాణాలకు కమ్యూనిస్టులవలన రక్షణలేకుండ పోతోందని, భూస్వాముల యిండ్లపై బరిసెలు తుపాకులతో దాడిచేయడం యిండ్లో వున్నధనం అపహరించడం, ప్రాంసరీనోట్లు, తాకట్లు వ్రాయించుకున్న యితర నోటులు వగైరావుంటే తగలబెట్టడం వీరి ప్రస్తుత కార్యక్రమంగ వుంది అన్నాడు.

స్వర్ణ :- ప్రసాదు బావకూడ పెద్ద కమ్యూనిస్టు అని పట్టణంలో అనుకుంటున్నారు. కొంపదీసి బావకూడ రౌడిగ, దౌర్జన్యవాదిగ మారిపోడు గదా ?

బాపయ్య :- కమ్యూనిస్టుల మతంపుచ్చుకున్న ప్రతివాడికి దౌర్జన్యం, దొంగతనాలు, హత్యలు తెలిసి వుండాల్సిందే.

స్వర్ణ :- వాళ్ళు దౌర్జన్యంగ వ్యవహరించేది బాగా డబ్బువున్న మనబోటివాళ్ళ దగ్గరేనా ! లేక మామూలు ప్రజలందరి యెడ దౌర్జన్యపూరితంగా వ్యవహరిస్తారా ?

బాపయ్య :- ఈనాడు మనకున్న పొలం, డబ్బు మనం కష్టపడి సంపాదించామంటే వాళ్ళు ఒప్పుకోరు. ఈ ధనం, పొలం పోగుపడడానికి మనం కూలీల్ని, రైతుల్ని దోచుకుని వాళ్ళ శ్రమశక్తిని అపహరించి అన్యాయంగా కూడబెట్టిన పాపపు సొమ్ము అని వాళ్ళ అభిప్రాయం. పొలాలు, డబ్బు కూలీనాలి, కార్మిక జనానికి సమానంగ దక్కాలని ఆ బీదవాళ్ళం దర్నీ మనమీదికి రెచ్చగొడుతుంటారు. మనల్ని వాళ్ళు పిచ్చికుక్కలకన్నా నీచంగాచూస్తూ, మనల్ని దూషిస్తుంటారు.

స్వర్ణ :- బావ కమ్యూనిస్టు గదా, అయితే ఆయనకు సంక్రమించే ఆస్తినంతా బీదలకు పంచివేస్తాడంటావా !

బాపయ్య :- వాళ్ళ ఆస్తులు బీదలకు పంచరు. వాళ్ళ ఆస్తుల్ని తెగనమ్మి బీద జనాన్ని ధనికులమీదకు పురిగొల్పడానికి కావాల్సిన కొన్ని సంఘాల్ని నిర్మించడానికి, వాళ్ళ పార్టీపత్రికలు, సారస్వతం ప్రజల్లో విరజిమ్మడానికి ఆ డబ్బులు ఖర్చుపెడుతుంటారు. సుబ్బరాయుడని మనకు ఒక దూరపు చుట్టం వున్నాడు. ఆయన కొడుకుని యమ్.ఎ. చదివించాడు. వాడు కాలేజీలో కమ్యూనిస్టుగ మారిపోయాడు. తరువాత తండ్రిలో తనకు రావాల్సిన ఆస్తిని పంచుకున్నాడు. ఆ ఆస్తినంతా అమ్మివేసి పార్టీకి యిచ్చివేశాడు. వాడు యిప్పుడు కమ్యూనిస్టువాళ్ళ ఆఫీసులో పనిచేస్తున్నాడు. వాడికి నెలకు డెబ్భయి రూపాయల చొప్పున కమ్యూనిస్టులే యిచ్చి వాడిని పోషిస్తున్నారు.

స్వర్ణ :- ప్రసాదు భవిష్యత్తు నిగూర్చి నాకు చాల భయంగ, ఆందోళనగ వుందినాన్నా.

బాపయ్య :- వాడి ముఖం కమ్యూనిస్టు - వచ్చే ఎండల కాలంలో నిన్నిచ్చి పెండ్లిచేస్తాను. వెంటనే లండను యూనివర్శిటికి పంపుతాను. అక్కడ అరిస్టాక్రాటిక్ సొసైటితో పరిచయం ఏర్పడి ఆ తెల్లదొరలతో కలిసిపోతాడు. ఇండియాకు తిరిగి రాగానే పెద్ద లీడింగ్ లాయరు అవుతాడు. దీనితో వాడిలో కమ్యూనిజం, గిమ్యూనిజం ఎగిరిపోతుంది. అన్నిటికి మించి నీ అందం, నీలోవున్నశక్తి ప్రసాదును కమ్యూనిస్టులకు దూరంగా అట్టిపెట్టగలవనే విశ్వాసం నాకు పూర్తిగ వుంది. ఇంతకూ వాడిచదు వేలావుంది.

స్వర్ణ :- చదువు శూన్యం. అరడజను సంవత్సరాల్లో బి.ఎ. పరీక్ష ప్యాసు కాగలిగిన తిరుపతి వెంకటేశ్వరస్వామికి లక్ష కొబ్బరికాయలు కొట్టవచ్చు. ఎప్పుడూ ఏవో సమావేశాలు, సంభాషణలు, స్నేహితులు, కామ్రేడ్సు - అంతా ఆయన రక్తాన్ని పీల్చి పిప్పిచేస్తున్నారంటే నమ్మండి.

బాపయ్య :- వాడికేమైనా అజ్ఞాతవాసంలోవున్న కమ్యూనిస్టులతో పరిచయమున్నట్లు నీకు తెలుసా ?

స్వర్ణ :- ఆలాంటి విషయాలు నాకేమి తెలియవు. నిన్న ప్రసాదు రూముకెళ్ళేసరికి ఎవరో పల్లెటూరి మనిషి రెండో గదిలో వున్నాడు. నన్నుచూచి మరోగదిలోకి వెళ్ళిపోయాడు. తరువాత ముఖమైనా చూపించలేదు.

తరువాత తండ్రి కుమార్తెలు యింటి సంగతులు మాట్లాడుకున్నారు. గరువు పొలం బాగా పండిందని, రేగడి పొలం వరదపాడిచి పోయిందని, పసుపుధర పూర్తిగ పడిపోయి గిట్టుబాటుగ లేదని, పెసర, మినుములు తెగులు తగిలి పూర్తిగ పంటకురాకుండా పోయిందని, పలావ ఆవు యీని కోడె దూడను పెట్టిందని, నాములకు, వడ్డీలకు, ధాన్యం డబ్బు తీసు కెళ్ళిన వాళ్ళదగ్గరనుండి వసూళ్ళు సకాలంలో రావడంలేదని, యింకా చాల సంగతులు స్వర్ణతో బాపయ్య మాట్లాడాడు.

రెండవరోజు వుదయం ఎనిమిది తొమ్మిది గంటలమధ్య విద్యార్థులుండే లాడ్జీలపై పోలీసులు దాడిచేశారు. విద్యార్థి రూము లన్నిటిచుట్టూ పోలీసు కాపలా పెట్టి రూములు వెతక డానికి పోలీసు ఆఫీసర్లు లోన ప్రవేసించారు. పోలీసుల యీ చర్య విద్యార్థిలోకంలో తీవ్రమైన అసంతృప్తిని, ఆవేశాన్ని కలుగజేశాయి. దేశంలో పౌరసత్వ హక్కులు భగ్నమయి పోతున్నాయని విద్యార్థులు ఆందోళనచెందారు. రూములు సోదా చేసే సందర్భంలో విద్యార్థులు పోలీసుల మధ్య వాదోప వాదాలు జరిగాయి. వందల సంఖ్యలో చేరిన విద్యార్థులు 'గో బ్యాక్ పోలీసు' అని కేకలు వేస్తున్నారు. ఈ పరిస్థితి ఘర్షణకు దారితీస్తుందనే భయం పురజనుల్లో కలిగింది. పోలీ సులకు కావాల్సిన అజ్ఞాత వ్యక్తులు ఎవరూ ఏ విద్యార్థి రూములోను కనిపించలేదు. నిషిద్ధ సాహిత్యం అసలే దొరక లేదు. ప్రసాదు రూము కొన్ని గంటలసేపు పోలీసులు సోదా చేశారు. ప్రసాదు రూములో వున్న మాన్యుస్క్రిప్టులు, ఎంగిల్సు,

లెనిన్, స్టాలిన్, మావో, సుందరయ్యల ఫోటోలు బ్రద్దలు కొట్టారు. వెంకటరత్నం ఎక్కడున్నాడో చెప్పమని పోలీసు ఆఫీసరు ప్రసాదును గద్దించి అడిగాడు. వెంకటరత్నం అంటే మా కాలేజిలో వున్న తెలుగు లెక్చరరేగా, అయితే ఆయన యింటిదగ్గర వున్నాడు పొండని ఎటకారంగా ప్రసాదు మాట్లాడేసరికి ఆఫీసరుకు కోపం వచ్చింది. ప్రక్కనున్న విద్యార్థులు ఫక్కున నవ్వారు. ఆఫీసరు చిన్నబోయాడు. ప్రయాస పడినా ఫలితం దక్కనందుకు సిగ్గుపడ్డాడు. విద్యార్థి రూముల్లో దొరికిన మార్క్సిస్టు సాహిత్యాన్ని పోలీసులు తీసుకెళ్ళి తగులబెట్టారు.

పోలీసులు జరిపిన యీ అమానుషచర్య విద్యార్థి లోకాన్నేగాక పట్నంలోని కార్మిక, మధ్యతరగతి, తదితర మేధావి వర్గాలను కలవర పెట్టింది. దేశంలో పౌరసత్వ హక్కులు నానాట సన్నగిల్లిపోవడం వారిని తీవ్రంగ కలవర పరచింది. పోలీసుల చర్యకు తగుతీవ్ర అసమ్మతిని తెలియ జేయాలనే చర్చలు ప్రారంభ మయ్యాయి.

బుధవారంనాడు ప్రతిక్లాసులోను,విద్యార్థి వసతిగృహాల లోను విద్యార్థి సంఘంతరఫున అచ్చువేయబడిన కరపత్రాలు పంచుతున్నారు. కరపత్రంలో పోలీసులు విద్యార్థి వసతి గృహాలపై జరిపిన సోదాలు తీవ్రంగ నిరసించబడ్డాయి. దేశం లోని ప్రతిరాజకీయ పార్టీకి స్వేచ్ఛగ ప్రజలకు సేవచేయ డానికి అవకాశాలు వుండాలి. రాజకీయాలపేరుతో ప్రతిపక్ష

రాజకీయ పార్టీలను ప్రజాఉద్యమాలను నిషేధించి వాటిపై పోలీసునిఘా ఏర్పాటు చేయరాదు.

సాయంత్రం ఐదుగంటలకు పార్కులో విద్యార్థుల బహిరంగసభ జరిగింది. ఆ సభలో పోలీసులు విద్యార్థి వసతి గృహాలపై జరిపిన దాడులు తీవ్రంగ ఖండించి పోలీసుల వైఖరికి తగు నిరసన తెలియజేయడానికి రెండు రోజులు శాంతి యుతసమ్మె అన్ని స్కూళ్ళలోను, కళాశాలల్లోను జరపాలని ఏకగ్రీవంగ తీర్మానించారు. పట్టణంలోవున్న అన్ని విద్యా సంస్థల్లోను ఒకేసారి సమ్మె చేయాలనే నిర్ణయం పోలీసు అధి కారుల్ని కంగారుపెట్టింది. అదనపు పోలీసు బలగాన్ని తెప్పించి పట్టణ ముఖ్య కేంద్రాలలో సమీకరించారు.

ఉదయం తొమ్మిది గంటలకే విద్యార్థి వలంటీర్లు కాలేజి గేట్లవద్దకు చేరుకుంటున్నారు. కొద్ది నిముషాలలోనే పోలీసుల్ని విద్యాసంస్థ లన్నిటిముందు దింపివేశారు. అనేక మంది ప్రజలు, కార్మికులు, సమ్మె దృశ్యాలు చూడడానికి రోడ్లపై గుంపులు గుంపులుగ చేరారు. ఆనాడు సమ్మెకు విద్యార్థు లెందుకు తలపడవలసి వచ్చిందో విద్యార్థి నాయ కులు మేగఫోనులో ప్రజల నుద్దేశించి ప్రసంగాలు చేస్తున్నారు. పోలీసులు విద్యార్థి నాయకుల చేతుల్లోని మేగాఫోన్సు లాక్కుని విరగ్గొట్టివేశారు. గేట్లముందరవున్న విద్యార్థి వాలం టీర్ల మొదటి దళాన్ని అరెస్టుచేసి వ్యానులో ఎక్కించారు. దీనితో పోలీసుల దుండగాలు నశించాలి – గో బ్యాక్ పోలీసు

అనే కేకలు బయలు దేరాయి. గుమిగూడిన ప్రజల్ని వెళ్ళి పొమ్మని పోలీసులు గట్టిగ దబాయించడం మొదలెట్టారు.

కొద్ది మందిగవున్న సమ్మె వ్యతిరేకులు రంగంలోకి వచ్చి సమ్మెను విచ్ఛిన్నం చేయడానికి పూనుకున్నారు. యీ సమ్మె విచ్ఛిన్నకులు కాలేజీ లోపలకు, బయటకు పచార్లు కొడుతు, సమ్మె భగ్నమయి పోయినదని నూటికి డెబ్బయి మందివరకు విద్యార్థులు క్లాసుల్లో వున్నారని సమ్మెలో పాల్గొన్న విద్యార్థుల్లో తప్పుడు ప్రచారం చేయడం మొదలెట్టారు. సమ్మె దృశ్యాలను తిలకిస్తు స్త్రీ విద్యార్థులు రోడ్ల ప్రక్కనుండి ఎవరు కాలేజీకి పోకూడదని ప్రచారం చేస్తున్నారు. పోలీసులు రెండో విద్యార్థి దళాన్ని అరెస్టు చేసారు. యీసారి విద్యార్థినులే వాలంటీర్లుగ పాల్గొని మూడవ దళంలో అరెస్టు గావించ బడ్డారు. బయటనుండి ఎవరో పోలీసులపై రాళ్ళు రువ్వారనే నెపంతో కొంతసేపు పెద్ద ఎత్తున పోలీసులు తీవ్రంగ లాఠీచార్జి జరిపి అనేకమంది విద్యార్థుల్ని తీవ్రంగ గాయపరచారు. ఇంతకు ముందుదాకా సమ్మెలో పాల్గొనాలా లేదాఅని ఊగిసలాడుతున్న విద్యార్థులంత సమ్మెను బలపరుస్తు సమ్మె విజయానికి తోడ్పడ్డానికి గట్టిగ రంగంలో నిలబడ్డారు. కాలేజి ప్రిన్సిపాలు గేట్ల దగ్గర కొచ్చాడు. సమ్మెలో విద్యార్థులు ప్రదర్శించిన ధైర్యసాహసాలకు ఆశ్చర్యపోయాడు – "మీరు యిక్కడ నిలబడవద్దు – పెద్ద ప్రమాదంతో కూడిన దుస్సంఘటనలు జరుగవచ్చు. సమ్మె దారులతో చేరకుండ దయచేసి కాలేజీకి పదండి"

అంటు ప్రిన్సిపాలు విద్యార్థుల్ని బెదరించి భయపెట్టి కాలేజీకి తీసుక పోవాలని ఒక ప్రయత్నం చేసాడు. ప్రిన్సిపాలు మాటలువిన్న విద్యార్థులు ఒక్కుమ్మడిగ నవ్వి గోల పెట్టారు. దీనితో ప్రిన్సిపాలు విద్యార్థుల ధాటికి తట్టుకోలేక తలనున్న టోపీతీసి విద్యార్థులకు శాల్యూట్ చేసి కాలేజీ లోపలికి వెళ్ళిపోయాడు.

స్వర్ణకుమారి మొదటినుండి సమ్మెను విఛ్ఛిన్నం చేయడానికి తీవ్రంగ ప్రయత్నిస్తుంది. స్త్రీ విద్యార్థులందర్ని సమ్మెలో పాల్గొనకుండ కాలేజీకి తీసుకు పోవాలని ప్రియత్నించింది. ఆమెమాట ఎవ్వరు వినలేదు - సమ్మెలో పాల్గొన్న నిమ్నజాతి స్త్రీ విద్యార్థుల వద్దకుపోయి మీరు సమ్మెలో పాల్గొంటే ప్రభుత్వంవారు యిచ్చే ఉచిత వున్నత విద్యా సౌకర్యాలు కోల్పోతారు కాబట్టి కాలేజీకి రమ్మని బెదిరించినది. వారుకూడ స్వర్ణమాట తిరస్కరించి గేలి చేసారు - సమ్మె విజయవంతం కావండం, స్వర్ణమాట ఏ విద్యార్థి లెక్కచేయక పోవడంతో ఆమెకు కారం రాచుకున్నంతపని జరిగింది. కాలుగాలిన పిల్లిలాగ కొంతసేపు అటు యిటు గంతులేసి పికెటింగ్ చేస్తున్న విద్యార్థుల దేహాలపైగా నడిచి కాలేజీ ఆవరణలో ప్రవేశించింది. బయటనున్న వందల మంది విద్యార్థులకు స్వర్ణ విద్యార్థుల దేహాలపైగా కాళ్ళతో దాటిపోతుంటే విపరీతమైన ఆగ్రహం కలిగింది. సిగ్గు సిగ్గు అని కేకలు పెట్టి పెద్ద గగ్గోలు చేసారు. సాయంత్రానికి మొత్తం విద్యాసంస్థ లన్నిటిలోను సమ్మె దిగ్విజయం అయినట్టు

విద్యార్థి సంఘం ప్రకటించింది. ఆనాటి సమ్మెకు నాయకత్వం వహించిన విద్యార్థి నాయకులు, మొత్తం వాలంటీర్లు మూడు వందలకుపైగా అరెస్టు గావించబడ్డారు. విద్యార్థులు రెండోరోజుకూడ సమ్మె సాగించడానికి నిర్ణయించుకోవడంతో పట్టణంలోని విద్యాసంస్థ లన్నిటిని కాలనిర్ణయం లేకుండ మూసివేసారు.

పట్టణంలోని కార్మికులంత మరుసటిరోజు విద్యార్థుల సమ్మెకు సానుభూతి, సహకారం అందచేయడానికి వేలమంది పనుల్లోకి పోవడం మానివేసి సాయంత్రం వేలమంది వూరేగింపులో పాల్గొని పెద్ద పెద్ద ప్రదర్శనలుచేసి దేశంలో పౌరసత్వ హక్కులు కాపాడ బడాలని ఎలుగెత్తి చాటారు.

నగరంలోని విద్యార్థుల తలిదండ్రులు, ఇతర పెద్దలు, విద్యార్థి శ్రేయోభిలాషులు అరెస్టు గాంచబడ్డ విద్యార్థుల విడుదలకు కృషి చేయడానికి అన్ని వర్గాలతో కూడిన ఒక కమిటీని ఏర్పాటు చేసారు. ప్రభుత్వ అధికారుల వద్దకు రాయబారం నడపడానికి నిశ్చయించుకున్నారు - సంప్రదింపుల కమిటిలోని పెద్దలు ముందు నడుస్తుంటే వారి వెనక వందల మంది విద్యార్థులు వూరేగింపుగా బయలుదేరి విద్యార్థి నాయకుల్ని విడుదల చేయాలంటూ నినాదాలు చేసికుంటూ పోలీసు అధికారుల్ని సమీపించారు. పోలీసు ఆఫీసర్లతో సంప్రదింపుల అనంతరం విద్యార్థుల్లోను, వారికి అండగ నిలబడ్డ పట్టణ ప్రజల్లోను ప్రదర్శితమైన ఐక్యతముందు పోలీసు ఆఫీసర్లు తమకు ఓటమి సంభవించినట్లు భావించి విద్యార్థి నాయ

కుల్ని విడుదల చేసారు. విద్యార్థి నాయకుల్ని పుర వీధుల గుండా వూరేగించి విద్యార్థి హక్కుల్ని గూర్చి నినాదాలు యిచ్చుకుంటు పార్కుకుచేరి అక్కడ బహిరంగసభ ఏర్పాటు చేసి ఆసభలో సమ్మెలో ధైర్యంగ పాల్గొని విజయవంతం చేసిన విద్యార్థుల్ని ప్రజల్ని అభినందిస్తు సమ్మె విరమింపచేసి నట్లు ప్రకటించారు.

స్వర్ణ నిజస్వరూపాన్ని ప్రసాదు ఆచరణలో చూడ గలిగాడు. లాజరుతో కాశ్మీరుపోయి తిరిగివచ్చిన తరువాత నెలతప్పింది. రెండు నెలలు ఆగి చూచింది. మెన్సెస్ రాలేదు. మూడో నెల గడుస్తుంది. కాలేజీకిరావడం మానేసింది. ఒక ప్రయివేటు హాస్పిటల్లో చేరి ఆపరేషన్ చేయించుకుని కడుపు తీసివేయించుకుంది. కొంతకాలం విశ్రాంతి తీసుకొని కాలేజీకి వచ్చింది. యీసారి స్వర్ణ బాగా చిక్కిపోయింది. శరీరంలో రక్తంలేనట్లు కనబడుతుంది. వక్షోజాలు ఒంగిపోయిన వసారా లాగ వున్నాయి. పెదాల్లో కనబడే దొండపండురంగు, బుగ్గల్లో విరజిమ్మె గులాబికాంతులు స్వర్ణలో కనబడడం లేదు.

బాపయ్య పోలీసులకు రిపోర్టుయిచ్చి విద్యార్థి హాస్టళ్ళపై దాడులు చేయించాడనే విషయాలు ప్రసాదుకు తెలియదు. సమ్మె విచ్ఛిన్నానికి స్వర్ణ చేసిన పాడు ప్రయత్నాలు ప్రసాదును తీవ్రంగ గాయపరచాయి. స్వర్ణతోవున్న మామూలు సంబంధాలన్నిటిని త్రెంచివేసు కోవాలనే గట్టి నిర్ణయానికి వచ్చాడు.

వర్షాలు పడనారంభించాయి. భూమిఅంతా బాగా పచ్చబడింది. కాలువల్లో నీళ్ళు అంచుల్ని తన్నుకుంటు సారవంతమైన బురద నీటితో ప్రవహిస్తున్నాయి. ఎత్తు పెరిగిన ఆకుమళ్ళు కొంచెం వంగిపోయినట్లు కనబడుతున్నాయి - లేత వరినారు రోజుకోవిధంగ చూడముచ్చటగ పెరుగుతుంది. దుక్కులు దున్నడం పూర్తి అయిన చేలకు గండీలుతీసి నీళ్ళు పెట్టడానికి సిద్ధం చేశారు - పొలాల్లో నీటి ఎద్దడివున్న ప్రాంతాల్లో రైతులు అక్కడక్కడ కీచులాడు కుంటున్నారు.

వ్యవసాయకూలీలు యీ సంవత్సరం సాగుకు పనికి వచ్చే బంజరు భూములు ఆక్రమించుకొని గట్లు పెట్టుకున్నారు - మెరక పల్లాలు సరిచేసికొని బంజరు భూముల్లో ఎరువులు తోలుకుంటున్నారు.

ఊడ్పులు సమీపిస్తున్నాయి. కూలి అన్ని గ్రామాల్లోను ఒకేవిధంగలేదు - వున్నకూలి రేటుకూడ బహు స్వల్పంగ అర్ధాకలి తీర్చుకోడానికి మాత్రం తోడ్పడుతుంది. స్త్రీకి యిచ్చేకూలి పురుషునికిచ్చే కూలికన్న తక్కువ. కూలి రేటు పెరగాలి, సంవత్సరంలో అన్ని రోజులు వ్యవసాయ కూలీలకు పనులు దొరకాలి, ముందు కూలి రేటు పెంచుకోవాలనే ఆలోచలు బయలు దేరాయి. చాలాకాలంగ వ్యవసాయ కూలిసంఘం ప్రచారం చేస్తున్న యీ నినాదం బీదప్రజలు యీసారి బాగా అందుకున్నారు. కూలి రేటు పెంచుకోడానికి చుట్టుప్రక్కల గ్రామాల్లోవున్న వ్యవసాయకూలీల్ని ఐక్యం చేసి పోరాటానికి తలపడాల్సిన అవసరాన్ని ప్రచారం చేస్తు

న్నారు. ప్రతి గ్రామంలోను సమ్మె కమిటీలు ఏర్పరుచుకున్నారు. వ్యవసాయకూలీ పెద్దలు, కార్యకర్తలు కూలిరేటు మరోమాసిక అదనంగ పెంచాల్సిన అవసరాన్ని గూర్చి ముందుగ భూస్వాములతో రాజీ సంప్రదింపులు జరిపారు - "మాకు దయగలిగియిస్తే తీసికోవడంతప్ప యిదొక హక్కుగ వున్న రేటును పెంచమంటే యిప్పుడున్న యీ కూలిరేటు కూడ తగ్గిస్తా"మని బెదరించారు భూస్వాములు. దీనితో వ్యవసాయకూలీలకు కూలిరేటును పెంచగల సాధనం ఐక్యసమ్మె పోరాటంతప్ప మరొకటి కనబడడం లేదు. సమ్మెలో పాల్గొని తమ న్యాయమైన కూలిరేటు కోసరం పోట్లాడ వలసిందిగ అచ్చువేసిన కరపత్రాలు గ్రామాల్లో పంచుతు కార్యకర్తలు రేయింబవళ్ళు తీవ్రంగ కృషి చేస్తున్నారు - గ్రామాల్లోని ముఖ్యప్రాంతాల్లోను, గోడలమీద కూలీల న్యాయమైన కూలిరేటును తెలియజేసే నినాదాలు వ్రాయబడ్డాయి. భూస్వాములు చిన్నరైతుల్ని రెచ్చగొట్టి వ్యవసాయ కూలీలకు వ్యతిరేకంగ త్రిప్పి రైతుకూలి సామరస్యాన్ని చెడగొట్టి కుల తగాదాలు రెచ్చగొట్టి వూరు - పల్లె అనే రెండు భాగాలుగ గ్రామాన్ని బ్రద్దలు చేయడానికి తీవ్రంగ ప్రయత్నిస్తున్నారు - సమ్మెను విచ్ఛిన్నం చేయడానికి పెద్దరైతుల నుండి చందాలు వసూలుచేసి వందల రూపాయలతో సిద్ధంగ వున్నారు. గ్రామాల్లో భూస్వాములమాట, పెత్తనం తిరిగి పునరుద్ధరించుకోడానికి యీ సమ్మెను అడ్డంపెట్టి తీవ్రంగ ప్రయత్నిస్తున్నారు. రైతాంగంలో వ్యవసాయ కూలీల న్యాయమైన కూలిరేటు యివ్వాల్సిన అవసరాన్ని గూర్చి

శ్రీనివాసరావు, సుబ్బయ్య, సూర్యావతి తీవ్రంగ సమావేశాలద్వారా ప్రచారం చేస్తున్నారు. పేదరైతు వ్యవసాయ కూలికి మానెడు గింజలు అదనంగ కూలిపెంచితే దరిద్రుడయి పోడని, పేదరైతు బాగుపడడానికి పన్నుల విధానంలో మార్పు, న్యాయమైన కౌలురేటు, భూసంస్కరణల అమలు ద్వారానే రైతుల స్థితిగతులు బాగుపడగలవని, అందుకు రైతు వ్యవసాయ కూలీలు ఐక్యంగ భూస్వామ్య విధానంలో భూమిమీద కష్టపడి పనిచేసేవారు లాభపడే విధంగ కీలకమైన మూలమలుపు సంస్కరణల కోసరం పోట్లాడాలని ప్రచారం చేసి రైతుల్ని చైతన్య వంతుల్ని చేస్తున్నారు. గ్రామంలోని వ్యవసాయ కూలీలు - సామాన్య రైతాంగంమధ్య అగాధం ఏర్పరచి సమ్మెను విచ్ఛిన్నం చేయాలనే భూస్వాముల ప్రయత్నాలకు ఓటమి సంభవించింది. దీనితో భూస్వాములకు పాములు జెర్రులు కరచి వేధించి వంతపని జరిగింది. భూస్వాములు విచ్చలవిడిగ రంగంలోకివచ్చి సమ్మెను విచ్ఛిన్నంచేయడానికి ప్రయత్నిస్తుంటే, సుబ్బయ్య, జగ్గయ్య, శ్రీనివాసరావు, సూర్యావతి రహస్య జీవితం గడుపుతు పోలీసుల, భూస్వాముల కంట బడకుండ రహస్యంగ పనిచేస్తు సమ్మె విజయానికి కృషి చేస్తున్నారు.

వ్యవసాయకూలీలు అడిగిన కూలి రేటును భూస్వాములుతిరస్కరించడంతో కూలీలు సమ్మె ప్రారంభించారు. ఇతర ప్రాంతాలనుండి దొంగకూలీలను తెచ్చి పనులు చేయించుకోవాలని భూస్వాములు చేసిన ప్రయత్నాలుకూడ సఫలం కాలేదు.

భూస్వాములు నూతన ఎత్తుగడలతో సమ్మెను భగ్నం చేయడానికి పూనుకున్నారు. దేశంలో అతివాద రాజకీయ పార్టీలపైన, ప్రజా సంఘాలపైన, ప్రభుత్వం అమలు జరుపుతున్న దారుణ నిర్బంధ విధానాలు, నిషేధాలు యీసమ్మెను విచ్ఛిన్నం చేయడానికి పాచికగ భూస్వాములు వుపయోగించు కోదలచారు. వ్యవసాయ కూలీలు భూస్వాములపై దౌర్జన్యానికి పూనుకుంటున్నారని, తమయిండ్లపై దాడులుచేసి ధన మాన ప్రాణాలకు అపాయం కలుగ జేయడానికి ప్రయత్నిస్తున్నారని దొంగ రిపోర్టులు ప్రభుత్వానికి, పోలీసు ఆఫీసర్లకు పంపారు. సమ్మెను విచ్ఛిన్నం చేయడానికి పోలీసుల సహాయం తీసికోవడానికి కొన్ని వేల రూపాయలు మంచినీళ్ళ ప్రాయంగ ఖర్చు పెట్టేసారు. దీనితో గ్రామీణ ప్రాంతంలోని వ్యవసాయకూలి పేదరైతులు గ్రామ చరిత్రలోనే కని విని ఎరుగనంత తీవ్ర పోలీసుదాడులకు, క్రూరమైన హింసా కాండకు గురి అయ్యారు. పోలీసులు ప్లాను ప్రకారం గ్రామాలపై దాడులు సోదాలు చేయడం ప్రారంభించారు. స్త్రీలను పురుషులను అమానుషంగకొట్టి హింసించారు. సమ్మె చేయిస్తున్న నాయకులను పోలీసులకు పట్టి యివ్వమని సామాన్య ప్రజలను చిత్రహింసలకు గురిచేసి స్త్రీలను అవమాన పరచారు. ఇండ్లలోవున్న కుండలు మంచాలు బద్దలు కొట్టారు. బియ్యం పప్పుధాన్యాలు కిరసనాయిలుపోసి తగులబెట్టివేసారు. యీ దాడులవెంట భూస్వాములువుండి స్వయంగ జరిపిస్తున్నారు. తమకు కక్షవున్న వారిపై చిత్తంవచ్చినట్టు పగసాధించుకున్నారు. ఒకరాత్రి జరిగిన పోలీసుదాడిలో జగ్గయ్యతో

సహా అనేకమంది వ్యవసాయకూలి కార్యకర్తలు పట్టుబడ్డారు. జగ్గయ్యను పోలీసులు, భూస్వాములు చచ్చేటట్లు చావమోదారు. జగ్గయ్యను అరెస్టుచేసి పోలీసులు తీసుకెళ్ళారు.

ప్రజలు యింతకుముందు పెద్దఎత్తున పోలీసు దాడులకు తీవ్ర నిర్బంధ విధానానికి అలవాటుపడి యుండలేదు. బ్రిటీషు పాలకులు సహితం ఇంత పెద్దఎత్తున గ్రామాలపై దాడులు చేసి స్త్రీ పురుష విచక్షణ లేకుండ హింసించిన ఘటనలు కాంగ్రెస్ ప్రభుత్వంతో పోల్చినపుడు తక్కువనే చెప్పాల్సి వుంటుంది. ప్రజలకు పోలీసు దాడులనుండి తమ్ము తాము రక్షించుకుంటు తమన్యాయమైన కూలిరేటు కోసరం, ప్రజా స్వామిక హక్కుల కోసరం ఎలా పోట్లాడాలో నిరాయుధు లైన ప్రజలకు అర్ధంకాలేదు - సమ్మె అన్ని గ్రామాల్లోను తాత్కాలికంగ విరమించ బడ్డది. భూస్వాములు సమ్మెను విచ్ఛిన్నం చేయగలిగినందుకు, అనేక వందలమందిని లాఠీలతో చావ యోదించి నందుకు సంతోషించారు. వ్యవసాయ కూలీలు భూస్వాముల పాదాలక్రింద శాశ్వత బానిసలుగ పడి వుంటారని అపోహ పడ్డారు.

జగ్గయ్యను రాజమండ్రి జైలులో డిటెయిన్ చేయ డానికి బండి ఎక్కించారు. రైలుబండి బెజవాడ దాటిన తరు వాత జగ్గయ్య పోలీసుల కండ్లలో కారంకొట్టి బండిదూకి పారిపోయాడు.

జగ్గయ్య రైలుబండిలో పోలీసుల బారినుండి తప్పించు కున్నాడన్న వార్త భూస్వాముల చెవినిబడగానే గుండెలు జారి

పోయాయి. జగ్గయ్యను హతమార్చడానికి, వ్యవసాయ కూలీల కండ్లముందరనుండి జగ్గయ్యను వేరిపారేయడానికి కృత నిశ్చయు లైనారు. భూస్వాల దృష్టి వ్యవసాయ కూలీలు సాగుచేసికుంటున్న బంజరు భూములపై మరలింది. మాల వాళ్ళకు భూములుంటే డబ్బుగల వాళ్ళమాట లెక్కచేయరు. వాళ్ళ దోపిడికి మూలసాధనాలైన వడ్డీవ్యాపారం, నాము పద్ధతి దెబ్బతిని పోతుంది. అదీగాక భూస్వాములకు పొలం వుండి, సామాన్య వ్యవసాయ కూలీలక్కూడా పొలంవుంటే భూస్వాముల ప్రత్యేకత ఘనత ఏముంటుందని యీర్ష్యతో కుళ్ళి కుళ్ళి ఏడ్చారు. వ్యవసాయ కూలీలు కష్టపడి సాగులోకి తెచ్చి వరిపైరు వేసికున్న బంజరు పొలాల్లో గొడ్లను తోలి చిందర వందరగ పైరంతా త్రొక్కించి వేశారు. పైరును గేదెలకు మేపివేసారు.

# 6

కర కరమంటు పరుగెత్తుకొచ్చే సూర్యుని హడావుడి చూచి చంద్రుడు నీలిమబ్బుల్లో మాయమవడానికి మూటముల్లె సర్దుకుంటున్నాడు – రాత్రి అంతా ప్రశాంతంగ నిదురించిన పసిపాపలు గుక్కపెట్టి ఏడుస్తు తెల్లవారబోతుందని నిద్రిస్తున్న తల్లులకు తెలియ జెప్పుతున్నారు – చనురొమ్ము నోట్లోపెట్టి తెల్లవారితే మాత్రం మీకేమి భయమన్నట్లు తల్లులు పిల్లల్ని వూరడిస్తున్నారు – పగలెల్ల కష్టించిన ప్రజలు నిదురమత్తుతో, బడలికతో లేవలేక అటూయిటు పొర్లాడుతున్న జనానికి పనులకు పోయే వేళయిందని కోడికూతలు గుర్తుకు తెస్తున్నాయి. అంతకుముందే పెద్ద పాలేళ్ళు పనుల్లోకి పోయి వుంటారు – చిన్న పాలేళ్ళు యింకా పనుల్లోకి బయలు దేరలేదు–ముక్కుపచ్చలారని పసిగందుల్ని తల్లులు బలవంతాన లేవగొట్టి జీతాల్లోకి పంపిస్తున్నారు. ముసలి ముతక జనాంగం గుల్ల పుగాకు చుట్టలు మూతులకు తగిలించి కుంపట్లవద్ద చేరి చలి కాగుతున్నారు – ఇళ్ళలోని పనులు చక్కబెట్టు కోడానికి యువతులు నిదురమత్తుతోవున్న ముఖాల్ని చలి నీళ్ళతో శుభ్రంగ కడుక్కొని నడుంబిగించి చీపిరికట్టలు చేతబట్టారు – ఆనాటి సూర్యోదయం చాల భయంకరమైనది. కొద్ది దూరంలో ఒకటో రెండోసార్లు పోలీసువాళ్ళ వ్యానుల హారన్ మోతలు విన

బడ్డాయి - అంతపెద్ద ధ్వనిఏమి వినిపించలేదు - పల్లెకు కొంత దూరంలోనే, వ్యానులు ఆగాయి. పల్లెలోని జనం తప్పించుకొని బయటకుపోలేని విధంగ పల్లెచుట్టు పోలీసు కాపలా వుంచారు. మిగతా పోలీసులు పోలీసు ఆఫీసరు - భూస్వామి బాపయ్య పల్లెలో ప్రవేశించారు - పోలీసులు యిండ్లలో జొరబడి ప్రజలను లాఠీలతో బాదుతు బయటకు నెట్టుకొస్తున్నారు. ఇళ్ళలో జొరబడి కుండ చట్లను పగల గొడుతున్నారు- స్త్రీ పురుష విచక్షణ లేకుండా అందర్ని క్రూరంగ హింసిస్తున్నారు - పిల్లలు భయంకరంగ ఏడుస్తున్నారు. స్త్రీలను నానా విధాలుగ దుర్భాష లాడుతున్నారు. అనేక మందికి బలమైన దెబ్బలవలన కలిగిన గాయములనుండి రక్తం కారుతుంది మంచాలు విరగ గొట్టారు. యిండ్లలోవున్న పచ్చడి జాడీలను ఫొటోలను పగలగొట్టారు - దీనితో సంతృప్తి పడలేదు - ఇండ్లలోవున్న కాయధాన్యాల్ని ఒక చోట కుమ్మరించి కిరసనాయిలుపోసి నిప్పంటించారు.

లీల ఇంట్లో యిద్దరు పోలీసులు జొరబడ్డారు. ఒకడు యింట్లోవున్న లీల తల్లిని రెక్కలుపట్టి బయటకు విసిరాడు- లీలతల్లి నడుం విరిగిపోయింది - చాలకాలం నడుంలేక అనేక భాదలు పడుతు తీసుక తీసుక ఆమె చచ్చిపోవచ్చింది. బ్యాటరీలైటు సాయంతో రెండవవాడు లీల ముఖంకేసి చూచాడు. ఆమె ముఖంనుండి వెలువడే కాంతి పుంజాలు బ్యాటరీలైటు కాంతిని త్రిప్పికొడు తున్నాయి - పోలీసుల అత్యాచారాన్ని చూస్తున్న లీల ఆవేదనకు గురి అయింది.

ఆమె ముక్కునుండి వెలువడే ఉశ్వాస నిశ్వాసములు తెల్లత్రాచు బుసను గుర్తుకు తెస్తున్నాయి - బయటకు రావాలని ప్రయత్నించిన లీలను పోలీసువాడు చేతితో గట్టిగ పట్టుకున్నాడు – 'నీ మొగుడేడా' అన్నాడు. లీల కండ్లు ఎర్రజేసి కోరచూపుతో సమాధానం యిచ్చింది. "మన మొచ్చామని మొగుణ్ణి బయటకు పంపింది" అన్నాడు రెండవవాడు. అయితే పారిపోతున్నా వెక్కడికే, మేమూ మనుష్యులమే, నంటు వెకిలిగ నవ్వాడు. లీలకు ఒకపాటి మగవాణ్ణి కొట్టగల సత్తా, ధైర్య సాహసాలు లేకపోలేదు – కాని కండలు తీరిన ఆ నీచులకు కామం తోడయినది. వాళ్ళ నేత్రాలు కామంతో పసర్లు వేసిపోయాయి - లీల రెండుగూళ్ళు పట్టుకొని గోడకేసికొట్టాడు. ఆమెతల గోడకు కంగ్‌మని తగిలింది. కంగ్‌మన్న ఆధ్వనిలోనుండి ప్రతీకారశబ్దం ప్రలాపించింది. బంతిలాగ లీల ముంకొచ్చి చంప పగిలేటట్లు రెండు చేతుల్తో రెండు పుచ్చుకుంది. ఆ మొద్దుకు ఆదెబ్బ లెక్కడాని చచ్చాయి. ఆదెబ్బలు కొద్దిపాటి పెద్ద బంతిపూవుతో సరసానికి కొట్టినట్లనిపించింది. పైపెచ్చు లీల వాడి దవడల్ని తాకినందుకు తన్మయత్వంలో పడింది వాడివ్యవహారం – అంతేకాదు స్వర్గంలో సగందూరం ప్రయాణం చేసినంతపనిలాగ తోచింది. లీల మొదటివాడిని తప్పించుకొని బయటకు పారిపోవడానికి తలుపు దగ్గరకు ప్రవేశించింది. వాకిటి ముందున్నవాడు లీలను కాలితో తన్ని యింట్లోకి నెట్టాడు – లీల ఒక్కుమ్మడిగ పెద్దపెట్టున గోలపెట్టి అరచింది– ఏమి చేయాలో తోచక అయోమయంలో పడింది. తన పవిత్రమైన అవివాహిత జీవితం అన్ని

టికి మించిన శౌశీల్యం దుర్మార్గుల చేతుల్లో భగ్నమై పోతుం దేమోననే భయం ఆమెను కలవరపెట్ట సాగింది. శరీరమంతా చిరిచెమట్లతో నిండిపోయింది. 'నీ కాళ్ళముందర యీ ప్రాణాలనైనా విడుస్తాను - కాని నిన్నుమాత్రం విడిచి పెట్ట లేను - అనవసరమైన గొడవ చేయక - ఊ అను' అంటూ మరల వెకిలిగనవ్వి లీలను సమీపించ బోయాడు - లీల పెద్దగ కేకలుపెట్టింది - అరిస్తె ప్రాణాలు పోతాయని బాయనెట్ చూపించాడు - లీల అరుపులు చుట్టుప్రక్కల జనం విన్నారు. జనం వెంటనే యింటిచుట్టు మూగారు.

లీల రెండుగూళ్లు గట్టిగ పట్టుకొని గోడకేసి అదిమి పట్టాడు - చేతులుకూడ మెదలాయించు కోడానికికూడ వీలు లేకుండవుంది. ఆమె పరిస్థితి - ఏ చేతికి వీలు చిక్కినా వాడి చెంపలు ఖచ్చితంగ పగిలి పోతాయి - అమృతం స్రవించే ఆ పల్చటి లేత పెదిమలనుండి విషాదాగ్నులు చెలరేగు తున్నాయి. చంద్రబింబంలాంటి ఆమె వదనం చిరిచెమటల చాటున ఆ దుర్మార్గులకు జడిసి దాక్కుంది. కమలాల్లాంటి ఆమె నేత్రాలనుండి చింత నిప్పులు చెలరేగు తున్నాయి - పొగాకు వాసనకొట్టే వాడి పెదిమెలు ఆమె లేత చెక్కిళ్ళను తాకాలని తహ తహ లాడు తున్నాయి - మంటలు మండే నిప్పుల్లోనుండి పప్పు లేరబోతే చేతులు కాలకుండా వుంటాయా? లీల ముఖంలో వాడి ముఖం పెట్టాలను కుంటున్న వాడి ముఖంపై లీల అనేక పర్యాయాలు వూసింది. ఆమె నోటి పుమ్మినీరు వాడి కదేదో అత్తరు పన్నీరు ముఖాన జల్లినట్లని

పించింది. లీల యిక చూస్తూ వూరుకుంటే లాభం లేదనుకుంది. శరీరంలోని సత్తువనంతా అరికాలిలోకి కేంద్రీకరించింది. పొత్తి కడుపుకు బెత్తెడు ఎడంగ పకేలుమని ఒక శేతన్ను తన్నింది — ఆ తన్నుతో వాడు యింట్లోవున్న నిట్టాడికి కరుచ్చుకున్నాడు. తన్నుకు మించినదెబ్బ నిట్టాడి తాకిడి యిచ్చింది. యింతలోనే బయట వున్న జనం యింట్లో జొరబడి పోలీసుల్ని బయటికి తరిమి కొట్టారు.

బజారులో మందవేసి కొట్టి హింసించిన ప్రజలను గుడ్డలు వూడదీయించి స్త్రీ పురుష భేదం లేకుండా మొండి మొలలతో గ్రామంలో నడివీధులగుండా త్రిప్పారు — గ్రామంలోనుండి పోలీసుల కంటబడకుండ పారిపోయిన ప్రజలు చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలకు పోలీసుల అత్యాచారాలను వివరించారు— చుట్టుప్రక్కల గ్రామాల ప్రజల కోపానికి అంతుపంతు లేకుండావుంది — "ప్రభుత్వ నిర్బంధ విధానం నశించాలి. పోలీసుల రాక్షస కృత్యాలు నశించాలి" అంటు నినాదాలు చేసికుంటు చుట్టుప్రక్కల గ్రామాలనుండి అనేక వందలమంది ప్రజలు వూరేగింపులో బయలుదేరి వస్తున్నారు. పోలీసులు యీ ప్రజా వాహినిని చూచారు — వేలసంఖ్యలో ప్రజలు పోలీసు రాక్షసకృత్యాన్ని ఖండించడానికి ఆవేశంతో రొప్పుకుంటు రోజుకుంటు త్వర త్వరగ వస్తున్నారు — ప్రజా వెల్లువ వచ్చి తమపైబడే లోపుగ పోలీసులు పలాయనం చిత్తగించారు — జగ్గయ్య ప్రజలలో తిరుగుతు ప్రజల హక్కుల కోసరం పనిచేయడమంటే భూస్వాములకు ఎడతెగనిమంట — పైపెచ్చు విపరీతంగ హడలిపోతున్నారు — జగ్గయ్య రైలు

బండిలోనుండి పారిపోయి నందుకు తిరిగి ప్రజా సేవలో నిమగ్న మయినందుకు జగ్గయ్య జన్మించిన పల్లెలోని ప్రజలను తీవ్రంగకొట్టి అవమానించారు - స్త్రీ పురుషులను దిగంబరులను చేసి బజార్ల వెంట త్రిప్పిన ఘటన నాగరికత ప్రపంచాన్ని తలలు వంచేటట్లు చేసింది - ఆడపడుచులకు జరిగిన యీఅవమానాన్ని భారత నారీలోకం ఎన్నడు మరచిపోలేదు. ఆడపడుచులు అవమానంతో కార్చిన కన్నీరు, పడిన ఆవేదన ధనిక ప్రభుత్వాల త్వరితగతి పతనానికి శాపనార్థాలుగ మారక తప్పవు.

చుట్టుప్రక్కల గ్రామాలనుండి వచ్చిన ప్రజలు పోలీసు దాడికి గురిఅయిన ప్రజలను వోదార్చారు. ప్రజలు పోలీసు జులుం ఖండిస్తు గ్రామంలో ప్రదర్శనాలు చేశారు - అంతలోనే జగ్గయ్య ఎక్కడనుండో వచ్చి ప్రజల్లో కలసి పోయాడు. జగ్గయ్య ప్రజల నుద్దేశించి యిలా వుపన్యసించాడు.

సోదర సోదరీ మణులారా?

రైతు కూలీలైన మీరు కష్టజీవుల జెండాక్రింద నిలబడి పీడని పట్టుదలతో మొక్కపోని ధైర్యంతో యీనాడు పోలీసుజులుంను ఖండించ డానికి అనేక గ్రామాలనుండి యిక్కడకు రావడం మన గ్రామప్రజల జీవిత చరిత్రలోనె ఒక అపూర్వ సంఘటన. ఈలాంటి ధైర్యసాహసాలు దున్నే వానికి భూమిపైహక్కు పొందుటకు, న్యాయమైన కూలి రేటుకొరకు వెట్టిచాకిరికి వ్యతిరేకంగ, పౌరసత్వ హక్కుల రక్షణకు భవిష్యత్తులో మీరు ఎన్నోసార్లు ప్రదర్శించ వలసి

యున్నది - యీనాడు మీరు ప్రదర్శించిన ఐక్యత దేశంలో తమ హక్కులకోసరం రైతుకూలి, కార్మికజనం తమ న్యాయమైన హక్కుల కోసరం సాగిస్తున్న పోరాటాలకు ఆదర్శంగ వుండగలదు - ప్రజల ఐక్యతముందర ఏ మారణా యుధాలు పనిచేయలేవు - పొంగివచ్చే ప్రజా వెల్లువను ఆపాలని తాపత్రయపడే ధనికవర్గ ప్రభుత్వ ప్రయత్నాలు ఏటికి ఎదురీతలాంటిది మాత్రమే కాగలదు - పోలీసులాఠీలకు విరిగిన ఎముకలు జీవం పోసుకున్నాయి - ప్రజల మూల్గులు విప్లవ నినాదాలుగ మారాయి. తుపాకి కాల్పుల్లో చని పోయిన మృతవీరుల జీవితచరిత్రలు ప్రతి యింటిలోను పవిత్ర గాధలుగ చెప్పుకో నారంభించారు - తమకు జరిగిన అవమా నాన్ని గురించి ఆలోచించడము మానివేసిన మహిళలు యుద్ధరంగంలో దెబ్బతిన్న బెబ్బులి చందమున ప్రతీకారానికై తమ న్యాయమైన హక్కుల కోసరం మరలా పోట్లాడాలని కంకణం కట్టుకున్నారు.

చైనాలో కమ్యూనిస్టుల నాయకత్వాల సామాన్య రైతు కార్మికులు ప్రభుత్వాన్ని హస్తగతం చేసికున్న విప్లవ ఘటన మన దేశంలోని వ్యవసాయ కూలీల్ని రైతులను వుత్సాహ పరిచింది. చైనాలో అమలు జరిపిన భూసంస్కర ణలు, ప్రజాస్వామిక పరిపాలనా విధానము మన దేశంలో పనిచేసి జీవించే మేధావి వర్గంయొక్క పీడిత ప్రజలయొక్క ప్రశంశలకు గురి అయింది- పదిహేను సంవత్సరాలుగా రైతు, కార్మిక, వ్యవసాయకూలీ సంఘాలు జరిపిన రాజకీయాందో

శనలు, వర్గ పోరాటాలు దేశంలోని ప్రజలలో గొప్ప చైతన్యాన్ని ఆత్మ విశ్వాసాన్ని కలుగ జేసాయి.

గ్రామీణ ప్రాంతంలో నూటికి నలభై యాభైమందిగ నున్న వ్యవసాయ కూలీలు ఫ్యూడల్ ధనిక వర్గాలకు, ధనిక వర్గాల రక్షణకు పూనుకున్న ప్రభుత్వానికి వ్యతిరేకంగ ఒక బ్రహ్మాండమైన శక్తిగ రూపొంది తనచుట్టు యితర వర్గాల పీడిత ప్రజానీకాన్ని సమీకరించు కుంటుంది - ప్రపంచంలో పెట్టుబడిదారి, సామ్రాజ్యవాద దాస్యంనుండి పొందినవిముక్తి, పీడితప్రజల విప్లవ పోరాటాలు గ్రామీణ ప్రాంతాలలోని రైతు వ్యవసాయకూలి వుద్యమానికి నైతికబలాన్ని చేకూర్చాయి.

దేశంలో పెట్టుబడిదారి, భూస్వామ్య ప్రభుత్వం ప్రపంచంలో వచ్చిన మార్పులు, మన దేశంలోని పీడిత ప్రజలలో వస్తున్న రాజకీయ చైతన్యాన్ని, ప్రజలు భూమికోసరం, పౌర సత్వాల కోసరం, న్యాయమైన కూలిరేట్ల కోసరం సాగించిన పోరాటాల చరిత్రనుండి పాఠాలు నేర్చుకోవడం ప్రారంభించింది - నూతన పద్ధతిలో తమ దోపిడిని నిరాఘాటంగ సాగించడానికి పద్ధతులు ఆలోచించడం ప్రారంభించింది. వ్యవసాయ కూలి రైతు నాయకులు పీడిత ప్రజలందరిని సంఘటితపర్చి ఉద్యమ నిర్మాణాన్ని చక్కదిద్దడానికి ప్లానులు వేయ ప్రారంభించారు.

స్వర్ణకు పెండ్లి చేయాలనే నిర్ణయానికి తల్లిదండ్రులు వచ్చారు. ప్రసాదుపై స్వర్ణకుమారి పెట్టుకున్న ఆశలు ఫలించలేదు - బాపయ్యకూడ ప్రసాదును అడిగి కాదనిపించు

కున్నాడు. బాపయ్యకు స్వర్ణ పెండ్లి ఒక పెద్ద సమస్యగ తయారయింది. స్వర్ణ సంగతి తెలిసిన చుట్టుప్రక్కల గ్రామాల లోని యువకులు స్వర్ణతో పెండ్లికి అంగీకరించ లేకపోయారు. కడుపు తీసివేయించిన తరువాత స్వర్ణ విపరీతమైన మార్పుకు గురి అయింది – అందచందాలు దెబ్బతిన్నాయి – మానసికమైన బాధకు స్వర్ణ గురికావడంతో ముఖవర్చస్సు మటుమాయ మయింది. స్వర్ణ తనకున్న ధనంతో సంతృప్తి పడలేక పోతుంది – అనిర్వచనీయమైన ఏదో వస్తువు, ఎవరో వ్యక్తి తనకు కావాలి – తను కోరినంత మాత్రాన అవి స్వర్ణకు లభించేవికావు – స్వర్ణ కోరికలు జీవితంలో తీర్చుకోలేని కోరికలుగ మిగిలి పోయాయి. యుక్త వయస్సులో వున్న స్వర్ణకు పెండ్లి అవసరం యిపుడు బాగా తెలిసి వచ్చింది – గతంలోని తన అరాజక, అవినీతి జీవితాన్నిగూర్చి యిపుడు పశ్చాత్తాప పడడం ప్రారంభించింది. కావల్సిన టైములో బండిని స్వర్ణ అందుకోలేక పోయింది. అందుకు చింతిస్తుంది. స్వర్ణకు యీజీవితంలో ఆబండి అందదు. ఆబండిలో ప్రయాణంచేసే మనిషి అసలే దొరకడు – స్వర్ణకు కాలేజీ విద్యమీదకూడ విరక్తి పుట్టింది – కాలేజీకి పోవడం మానివేసింది. ఏదోఒక సెక్సునవలు చదవడం స్వర్ణకు అలవాటు – యీ కాలంలోనె స్వర్ణ అనేక నవల్సు చదివింది – స్వర్ణ తానుగ ప్రయత్నించిన యువకులను పెండ్లి చేసుకోలేక పోయింది – యువకులు తిరస్కరించడమే దానికి కారణము. చుట్టరికంలో ఏదోఒక యువకుడికి అంటగట్టాలని బాపయ్య చేసిన ప్రయత్నాలుకూడ విఫల మయ్యాయి

దీనితో బాపయ్య లక్షరూపాయలు కట్నంతో పెండ్లిండ్ల మార్కెట్టుకు ప్రయాణం కట్టాడు - తగిన వరుని కోసరం రూపాయలసంచి చేతిలో పెట్టుకొని మార్కెట్టు అంతా గాలించడం ప్రారంభించాడు - ఎట్టకేలకు తనరక్తం చెమటగ మార్చి తనకు కావలసిన అల్లుడ్ని సంపాదించుకో గలిగాడు. స్వర్ణకు కాబోయే భర్తపేరు భుజంగరావు ఇంటర్ వరకు చదువు కున్నాడు. తరువాత వ్యాపారంలో ప్రవేశించాడు. వాళ్ళ నాయనకు పంచదార ఫ్యాక్టరీలలో వాటాలున్నాయి. భుజంగరావు కలకత్తా, బొంబాయి నగరాలలోవుండి వ్యాపారంచేస్తు వుంటాడు. వీరి వ్యాపారం విదేశాలతో కూడవుంది. పొగాకు, పసుపు పంచదార ప్రధానమైన వ్యాపార సరుకులు యీ వ్యాపారంమీద భుజంగరావు చాలా ధనాన్ని ఆర్జించ గలిగాడు - ఆస్తి పాస్తుల విషయంలో బాపయ్యను కొట్టిన వాడే. అయితే భుజంగరావుకి యిది మొదటిపెండ్లి మాత్రం కాదు. వయస్సు నలుబది సంవత్సరా లుంటాయి. మనిషి ఒకమాదిరి అందంగ వుంటాడు - మొదటి భార్యను పెండ్లి సందర్భంలో వాగ్దానం చేసిన కట్నాలు ఆమె తల్లిదండ్రులు యివ్వలేదని యింట్లోనుండి వెళ్ళగొట్టారు - కొంతకాలం తరువాత రెండో పెండ్లి జరిగింది. రెండవపెండ్లి పెండ్లామంటే భుజంగరావుకు చాలా యిష్టంగ సరదాగా వుండేది. ఆమెతో రెండు సంవత్సరాలు సుఖవంతమైన జీవితం గడిపాడు. భుజంగ రావు భార్య తనయింట్లో తీవ్రమైన అసంతృప్తికి గురి అయింది. భుజంగరావు యింట్లో డబ్బుగాని, వినోదాలు గాని ఆమెను సంతృప్తి పరచలేక పోయాయి-యీామె చాలా

ధనిక కుటుంబంలో పుట్టినస్త్రీ - రెండవ సంవత్సరములో ఆమెకు యింట్లోపనిచేసె ఒక నౌకరుతో పరిచయాలు ఏర్పడ్డాయి - వీళ్ళిద్దరు పడక గదిలో వుండడం భుజంగరావుతల్లి చూచింది. ఆ సందర్భంలో భుజంగరావు యింట్లో లేడు - మరుసటిరోజు భుజంగరావు భార్య నౌకరుతో ఎక్కడికో లేచిపోయింది. భుజంగరావు రెండవ పెండ్లాము నౌకరుతో లేచిపోయిన తరువాత చాలాకాలం పెండ్లితలంపు లేకుండానే వున్నాడు - ఈకాలంలోనే భుజంగరావుకు యిద్దరు వుంపుడు గత్తెలతో సంబంధాలు ఏర్పడ్డాయి - పెండ్లి చేసి కుంటానని భుజంగరావు చేతిలో పరాభవం మోసంచేయబడ్డ స్త్రీలు సహితం లేకపోలేదు - పెండ్లిసంగతి వచ్చేటప్పటికి "అదంతా మాతల్లిదండ్రుల యిష్టం, వాళ్ళు ఎలాచెపితే అలానడుచు కుంటాను - అంతా వాళ్ళ యిష్టం" అంటు తప్పుకునేవాడు. ఇపుడు కాబోయే మూడవభార్య తొలిచూపుల్లో భుజంగరావుకు నచ్చలేదు - సెంకడ్ హ్యాండ్ లాగ వుందని అసంతృప్తి పడ్డాడు - భుజంగరావు వందల చేతులుమార్చి వుంటాడు - భుజంగరావుతో పోల్చితె స్వర్ణ చాలరెట్లు మెరుగు - పైపెచ్చు లక్షరూపాయలకట్నం తెస్తుంది. కాలేజీలో విద్యాబుద్ధుల్ని గణించింది-వీటన్నిటికి మించి లక్ష రూపాయలఆస్తి భుజంగరావును సంతృప్తి పరచింది - లక్ష రూపాయలు సంపాదించడమంటే ఎంత కష్టమో భుజంగరావుకు బాగా తెలుసు.

స్వర్ణకు మూడవ పెండ్లివానితో పెండ్లికి అంగీకరించడం అంటే మొదట్లో చాలా బాధవేసింది - పెండ్లి కొడుకును

చూచిన తరువాత భుజంగరావు చాలాచేతులు మార్చిన వాడిలా స్వర్ణకు గోచరించాడు - స్వర్ణ భుజంగరావును పెండ్లి చేసికోడానికి అంగీకరించదని అందరూ అభిప్రాయ పడ్డారు. భుజంగరావును చూచిన వారం రోజులదాకా స్వర్ణ తన అభిప్రాయాలను తల్లిదండ్రులతో ఔను, కాదు, అనే సమాధానం చెప్పకుండ దాచివుంచింది. స్వర్ణతల్లికి కుమార్తె వహించిన మౌనం చాలా ఆందోళన కలుగ జేసింది - బాప య్యకు మాత్రం తన కుమార్తె తను చెప్పినట్లు చేస్తుందనే ధైర్యం మొదటినుండివుంది. స్వర్ణ తల్లిది రోజు ఒకటే గొడవ "ఏంతల్లి నామాటవిని యీ పెండ్లికి అంగీకరించు. ఫలాన పుల్లయ్యకూతురు ఏభయి ఏళ్ళవాడిని పెండ్లిచేసికొని నలు గురు పిల్లల్ని కంది. మరోఆమె కూతురు ఒక ముసలాడ్ని పెండ్లాడి ఒక కొడుకును కంది - ఆ కొడుక్కు లక్షరూపా యలుచేసే ఆస్తి దక్కింది. ఆమె యిపుడు నిక్షేపంలాగ బ్రతుకుతుంది - మనకు యింత ధనంగల యిండ్లలో నుంచి వచ్చిన సంబంధాన్ని కాదంటే యింతకన్న డబ్బుగలవారు దొరుకరు - ఎక్కడయిన బెల్లంవుంటేనే చీమలు చేరేది - డబ్బుంటేనే యీనాడు గౌరవం, మర్యాదలు సమస్తం వున్నాయి - ఏదో ఒకడ్ని అడ్డంపెట్టుకొని యిద్దరు పిల్లల్ని కంటే తరువాత నీ యిష్టం వచ్చినట్లు నీవు తిరుగవచ్చు. పిల్లలు పుట్టిన తరువాత నీ గొడవ మీ అత్తగారుగాని భర్త గాని అంతగ పట్టించుకోరు. ఆయనకున్న లక్షలఆస్తి అంతా నీకే దక్కుతుంది. గతంలో నీ ప్రవర్తన సరిగలేని సంగతి చాలామందికి తెలుసు - మనం అంటే గిట్టనివాళ్ళు, మనం

పచ్చగ బ్రతకడం యిష్టంలేనివాళ్ళు మన యింటిచుట్టు వున్నారు. యీ గిట్టనివాళ్ళు పెండ్లికి వచ్చిన వారితో నీకు శీలంలేదని మంచిదానివి కాదని చాడీలుచెప్పె ప్రమాదంవుంది. కాబట్టి యీ విషయాలన్ని వాళ్ళ చెవుల్లో పడకముందే సరి అను తల్లి" ఈవిధంగ స్వర్ణ తల్లి లోకం పోకడను సవిస్తరంగ ఆమెకుచెప్పి చివరకు భుజంగరావుతో పెండ్లికి అంగీకరింప జేసింది - స్వర్ణ తల్లి పట్టలేని ఆనందంతో తన్మయం చెందింది. తను ఎన్నోరోజులుగ చేసిన పూజ ఫలించి నందుకు సంతోషించింది.

స్వర్ణకుమారి పెండ్లి ఖచ్చితంగ పదిరోజులుంది. పెండ్లి లగ్నాలు పెట్టుకున్న తరువాత భుజంగరావు ఇంటి వైభవాన్ని, డబ్బును, కార్లనుచూచి వచ్చినవారు ఆమె ముందర వర్ణనలు చేయడం మొదలెట్టారు - పెండ్లిరోజు సమీపించే కొలది ఆమె రాత్రి వేళలందు ఎన్నో కలలు కనడం ప్రారం భించింది - ఒకనాడురాత్రి ఆమెకు కలకత్తా నగరజీవితం కండ్లకు గట్టినట్లు గోచరించింది. కలకత్తా మహాపెద్దనగరం. పెద్ద పెద్ద ఎత్తయిన మేడలు, బస్సులు, ట్రాములు ఎలక్ట్రిక్ దీపాలు, విశాలమైన పెద్ద బజార్లు, రేడియో పార్కులు హార్బరులోని ఓడలు, విమానాశ్రయం, సుందరమైన థియే టర్లు - సూర్యోదయానికి ముందు నగరం ఎంత ప్రశాంతంగ వుంటుంది - కలిగినవాళ్ళకు సుఖజీవనానికి ఆటపట్టు.

భుజంగరావు యింట్లోవున్న వజ్రాలు, బంగారు నగలు, ధన రాసులు ఆమె కండ్ల ముందరే కనబడుతు త్వరగా

రమ్మని ఆహ్వానిస్తున్నాయి. ఎక్కడెక్కడో ఎందరితోనో ఆమె ప్రయాణాలు చేస్తున్నట్టు ఎన్నో వింతలు విశేషాలు చూచినట్లు నూతన అనుభవాలను క్రొత్తరకమైన రుచులను చవిచూస్తున్నట్లు కనబడుతుండేవి - కళ్ళు తెరిస్తేమాత్రం అంతా శూన్యం - శూన్యంలోకి ఎంతసేపు చూడసా ఆలోచించనా అనే ఆందోళన. ఆమె హృదయంమాత్రం అనిర్వచనీయమైన సంతోషంతో నిండిపోయింది. ఆ హృదయంలో పరమాణువును సహితం యిమడ్చగల సందులేదు - అంతకు ముందు ఆమె ముఖంలో కనబడె విషాదచ్ఛాయలు మటుమాయ మయ్యాయి. వాంఛా సాఫల్యంకానున్నదనే విశ్వాసంతో ఆమె సంభ్రమానందాలతో వోలలాడి పోయింది.

రెండవ రోజురాత్రి - గదిలో స్ప్రింగ్ మంచం, కీలు పరుపు - గాలిదిండ్లు-పడకకుర్చి వీణ. స్వర్ణ పండుకోబోయే టప్పుడుసహితం తలదువ్వి చక్కగ అలంకరించు కుంటుంది. మొగముపై గవిసిన ముంగురులు వెనక్కు దువ్వేవరకు నల్ల మబ్బులోనుండి వెలువడిన చంద్రబింబంవలె ఆమెముఖం ప్రకాశించింది. కొంతసేపు సినిమా పత్రికలు తిరగేసి బొమ్మలు చూచింది. నిద్రపట్టడంలేదు - చలంగారి 'స్త్రీ' పుస్తకం తీసి కొన్ని పేజీలు చదివింది - తనకు తెలియకుండానే గాఢ నిద్రకు లోనయింది. - యిక కొద్దిగంటలకు తెల్లవారుతుంది - స్వర్ణ కలగనడం ప్రారంభించింది. అవేవో భయానక దృశ్యాలు ఆమె కండ్ల ముందర కనబడు తున్నాయి. రిక్షాలు ఫ్యాక్టరీలు - మిల్లులు-పీక్కుపోయిన డొక్కలతో, లోతుకు

పోయిన కళ్ళతో, వాడిపోయిన ముఖాలతో ఎందరెందరో కష్టజీవులు ఆమె కండ్ల ఎదుట కనబడు తున్నారు. ఆ జనానికి వంటినిండా దుమ్ము, చాలి చాలని చింపిరి పొంతలతో కేరిం తలు కొడుతు పొట్టసాధనాని కోసరం డొక్కచేత్తో పట్టుకొని పనులకు పోతున్నారు. ఇంతపెద్ద సుందరమైన పట్నంలో కూడానా! తిండిలేని వాళ్ళున్నారా! వాళ్ళందర్ని అయితే కార్మికు లంటారు — అంటే ఏదో ఒకరోజున ధనిక వర్గాల మీద తిరగబడి సోషలిజాన్ని స్థాపించడంలో ప్రధానపాత్ర వహించే సైన్యం — అయితే యిక్కడకూడ తిరుగుబాటు తత్వాన్ని ప్రబోధించి అశాంతిని కలుగ జేసేవాళ్ళు వున్నా రన్నమాట — యిక్కడకూడ సమ్మెలు — ప్రదర్శనాలు తప్పవు — స్వర్ణ కలయొక్క మొదటి భాగంలో ఆమెకు గోచరించిన విషయాలు, తట్టిన ఆలోచనలు — స్వర్ణ నిద్రలో కెవ్వున కేకవేసి రివ్వున లేచింది — స్వర్ణ ముఖం కందిపోయింది — గదిలోని లైటు ఆరిపోయింది. స్వర్ణ కేకను నిద్రమత్తులోవున్న తల్లి వినలేదు. స్వర్ణకు ఏమీ తెలియడం లేదు. వెంటనే మంచంమీద పడిపోయింది. మైకం ఆవరిం చింది. మరలా ఆమెకండ్లముందర వందల కొలది కాకిదుస్తులు ధరించిన సిపాయిలు, తుపాకులు, లారీలు మిలటరీ పెరేడ్ — ఆమె కండ్లముందర ప్రత్యక్ష మయ్యాయి — ఆమె గుండె గుండెల్లోకివచ్చి చేరింది. చెమట ఆరిపోయింది. నాకేంభయం అని పెద్దగ అరిచింది. అంతలోనే తెల్లవారింది. స్వర్ణముఖం సుప్రసన్నమయింది — స్వర్ణ నిద్రలో కేకలు పెట్టినపుడు తన

తల్లి మేల్కొనడందుకు ఆమెమీద కొంచంసేపు అలిగింది - అలిగినపుడు అలిగిన కుర్రపిల్లలా అందంగా నేవుంది.

స్వర్ణ పెండ్లికి బాపయ్య వేల రూపాయలు ఖర్చు పెట్టాడు. పెండ్లి అయిపోయిన వారం రోజులదాకా ఎక్కడ చూచిన స్వర్ణ పెండ్లికి చేసిన సన్నాహాలనుగూర్చి చెప్పు కున్నారు. పెండ్లిమాత్రం తిరుపతి వెంకటేశ్వరస్వామి కొండ దగ్గర జరిగింది - పెండ్లి అయిన మొదటి సంవత్సరములోనే స్వర్ణకు ఆడపిల్ల పుట్టింది. తరువాత స్వర్ణ జీవితాన్నిగూర్చి అంతగ చెప్పుకోదగింది ఏమీలేదు.

మబ్బు కీకామండలంగ పట్టింది. తుపర తుపర చిను కులతో ప్రారంభమయిన వర్షం కుండ పోతపోయ సాగింది. రెండుమూడు దుక్కుల వర్షందాక పడింది - ఒక గంట పాటులో బాగా తెరిపిచ్చింది - యిండ్లముందర నీళ్ళు కాలు వలుగట్టి పారుతున్నాయి. ఉరుములు మెరుపులు మాత్రం తగ్గలేదు - పిడుగులు పడతాయనే భయంతో జనం అర్జున, ఫల్గుణ అని కిరీటి పదిపేర్లు వరుసగ మననం చేయడం ప్రారం భించారు. వర్షం వెలిసినట్లేవుండి మరల కొద్దిగ చినుకులు పడనారంభించాయి. పెద్ద చినుకులు పడేటప్పుడు జగ్గయ్య ఒక గొడ్లచావిటిలో తలదాచుకున్నాడు. జగ్గయ్యను భూస్వా ములే పట్టి పోలీసులకు ఒప్పజెప్పాలనే ప్రయత్నాలు గ్రామా లలో తీవ్రంగ సాగుతున్నాయి. చినుకుల్ని లెక్కచేయకుండ గోనెసంచి 'గూడు' నెత్తిన తగిలించుకొని బురదలో రొప్పుతు రొజుకుంటు ప్రయాణమై వస్తున్నాడు. మోకాళ్ళవరకు

బురదమయ మయింది. – బురదనీళ్లు కట్టుకున్న పంచమీాద చెదిరి పడ్డాయి. ఎంత వంగినప్పటికి యింటిచూరు ఆకులు నెత్తికి తగలకుండ తప్పించుకోలేక పోయాడు. ముఖానపడ్డ పాగచూరునీళ్ళు తుడుచుకుంటు యింట్లోకి కాలుపెట్టాడు.

అప్పటికే లీల పేలాలు రెండువాయలదాకా వేపి బుట్టలోపోసింది. మంగలం బాగా వేడిఎక్కివుంది. మూడో వాయికి మొక్కజొన్నలు మంగలంలోపోసి తెడ్డుతో త్రిప్పు తుంది. చిట పటామని పూవులు బయలుదేరు తున్నాయి. వాయిదించి బుట్టలో పోసింది. యింతలోనే వాకిట్లో కాళ్ళ చప్పుడు వినబడుతుంది. నల్లటి చేయెత్తుమనిషి వాకిట్లో కను పించాడు – "ఒక చెంబెడు నీళ్ళతో నావద్దకు వచ్చివుంటే ఎంతబాగుండేది" అన్నమాట ముగిసి ముగియడంతోనె "ఇది చాలా సాహసంతో కూడినపని – నిన్నటిరోజునే పోలీసులు నీ కొరకు ప్రక్కగ్రామంవచ్చి గాలించిపోయారు" అంటూనె లీల నీళ్ళకోసరం పోయింది. కాళ్లుకడుక్కున్న జగ్గయ్య పొయ్యకు సమీాపంలో పేలాల బుట్టముందర కూర్చున్నాడు ఇంటిపైకప్పు అక్కడక్కడ చదలు తినిపోయింది. అదిగాక చాలాకాలం క్రిందటనేసిన తాటియాకులయిల్లు. వర్షపు నీళ్ళవలన యింటిలోపలిభాగం చాలచోట్ల తడుస్తుంది. లీల తల్లి యింట్లోచేరిన నీళ్ళను పళ్ళెంలోకితోడి బయట పార బోస్తుంది.

ఇపుడు లీల జగ్గయ్యలమధ్య పేలాలబుట్ట మాత్రమే వుంది. పొయ్యిలోని కట్టెలమంటద్వారా యిద్దరూ చలికాగు

తున్నారు. లీలకు వ్యవసాయకూలి వృద్యమంతో పరిచయం లేనపుడు జగ్గయ్య ఆమెతో ఎన్నడు మాట్లాడిగాని పలుకరించిగాని ఎరుగడు. అయితే వీళ్ళిద్దరకు ఒకమాదిరిగ చిన్నతనం పోతు పోతువున్న రోజుల్లో ఒక ఘటన తలవని తలంపుగ జరిగింది. పల్లెలో ఒక పెండ్లి జరిగింది. పెండ్లి అనంతరం పెండ్లి పెద్దలంతా బాగా కల్లు సారాయి త్రాగారు- పెండ్లికూతుర్ని ఒకరిభుజాలమీద, పెండ్లికొడుకుని మరొకరి భుజంమీద ఎక్కించుకొని డేగాటకు బయలుదేరారు – వీధులన్ని వూరేగుతు జలకమాడుకుంటు ఒకరిపై ఒకరు పసుపు, గులాము నీళ్ళు చల్లుకుంటు స్త్రీ పురుష భేదంలేకుండ బజార్ల వెంట పెండ్లి వూరేగింపు జోరుగ సాగిపోతుంది – చిన్నతంలో జగ్గయ్య మహా పోకిరి – తనవంతు ముప్ఫయి నలభయి మందిని నీళ్ళతో తడిపి మరో ఏభయిమందిమీద పసుపు గులాము అప్పటికె చల్లాడు. అంతలోనె ఒక సందులో లీల ఎదురయింది. ఆమెనుకూడ నీళ్లుపోసి తుక్కుగ తడిపి ముఖం నిండా పసుపురాసి నోట్లోకూడ పసుపు కుక్కాడు. లీలకు ఆనాటినుండి యీలాంటి పోకిరివాళ్ళతో చతుర్లు అంటే గిట్టవు. జగ్గయ్యమీద తీవ్రంగ కోపపడ్డది. తను జగ్గయ్యమీద నీళ్లు పోయడానికి ధైర్యంలేక లీలకు అప్ప వరుసఅయిన మనిషి చేత జగ్గయ్యను కుడితినీళ్ళతో తడిపించింది – జగ్గయ్య చర్య లీలకు మొదట్లో బాధాకరంగ తోచినప్పటికి అది క్రమేణ ఆనాటి నుండి ఒకరకమైన అభిమానానికి ప్రేమకు దారితీసింది.

లీల పెద్దపిల్లఅయిన తరువాత మరో సంఘటన జరిగింది. ఒకనాడు బాపయ్యచేలో నాటుకుపోయింది. ఆచేనంత

జలగలమయం – డొంకప్రక్క చేనుకావడం వలన గట్లన్ని చెండాలంగ పెంటలతో నిండివున్నాయి – యీచేలో నాటు అంటేనె లీలకు మహాచీదర – అదీగాక యీచేను చాలా ఆలస్యంగనాటుకు వస్తుంది. అనేకచోట్ల నీళ్ళలోతిరిగి నాట్లు పనికి పోవడంవలని కాళ్ళు బాగా పాచిపోయాయి. జగ్గయ్య కూడ ఆరోజుల్లో బాపయ్యదగ్గర పెద్దపాలేరుగ వుండేవాడు.

లీల నాజూకుగ, మంచివడిగ నాటువేయడమేగాక తన ప్రక్కనే మునుములో వంగిన ముసలి లేక పిల్ల కూలీలుంటే వారినికూడ కలుపుకుపోతుంది. అదేరోజున జగ్గయ్య అదే చేనులో నారు అందించాల్సి వచ్చింది. నారుదొడ్లోనుండి నారుమోపులు చేలోకి చేరవేసి చేలో నారుపిల్లు జిమ్ము తున్నాడు– వెనుక మునుములో స్త్రీలు నాటువేసు కొస్తుంటే జగ్గయ్య ముందుభాగంలోవుండి నారుపిల్లు విసురుతున్నాడు – జగ్గయ్య పిళ్ళు విసిరేటప్పుడు నీళ్లు చింది లీలమీద పడ్డాయి – చుట్టు నాటువేసే ఆడవాళ్ళు అందులోను లీలకు వరుసఅయిన ఆడవాళ్లు పక్కున నవ్వారు. లీల యిది గ్రహించి కోపంగవున్న ముఖంతో కళ్ళువురిమి జగ్గయ్యవైపు కేసి చూచింది. జగ్గయ్యమాత్రం యీ గొడవలు పట్టించుకోకుండా తనపనితాను చేసికుంటు పోయాడు – జగ్గయ్య నిజంగ లీల మీద నీళ్ళు చెదిరిపడాలని పిళ్ళు విసిరివుంటే లీల చాలా సంతోషించివుండేది. అలా నారుపిళ్ళు విసరడంలో జగ్గయ్యకు మరేలాంటి వుద్దేశ్యం లేదు.

జగ్గయ్య లీల యిద్దరు మాటలు చెప్పుకుంటు పేలాలు తింటున్నారు - జగ్గయ్య మూడుగుప్పెళ్లు తినేటప్పటికి లీల ఒక గుప్పెడు పేలాలు మాత్రమే తినగలుగుతుంది. ముసలి దాని వాటాకువచ్చే పేలాలు ఒక సోలలో పోసిదాచి మిగ తావి యిద్దరు తినడం ప్రారంభించారు. మాటల సందడిలోనే మూడువాయిల పేలాలు పూర్తి కావస్తున్నాయి. కొంతసేప టికి లీల దవళ్ళు నొప్పిపుట్టడంతో ఒక్కొక్కగింజే ఎగరేసు కుంటు నాజూకుగ తింటున్నది. ఈతిండి సందడిలో జగ్గయ్య మాటలుకూడ మానివేసాడు - చివరకు మిగిలిన పేలాలు రెండు గుప్పెళ్లనిండ నింపుకొని పట్టిబుట్ట లీలముందరకు నెట్టాడు. "ఎంత ఆకలయితేమాత్రం ఇంత కడుపాత్రమా - ఇంతమొరటుతిండా" అంటు అదో తరహాగ నవ్వి జగ్గయ్య ఎడమ గుప్పెట్లోని పేలాలు లాక్కోడానికి రెండు చేతుల్తో గుప్పెట బలవంతాన పట్టుకుంది. తలవని తలంపుగ జగ్గయ్య రెండుగుప్పెళ్లలోని పేలాలు క్రింద వదిలేసాడు- నిశ్చేష్టుడయి పోయి లీలవంక కన్నార్పకుండ చూస్తున్నాడు. లీలచేతిస్పర్శ జగ్గయ్యకు పరమానందాన్ని కలుగజేసింది. లీల ఒక్కొక్క-గింజే వెక్కిరించినట్లు తింటుంది. ఆ వెక్కిరింపులో వయ్యా రంలో గోచరమవుతున్న అందం వర్ణనాతీతము.

జగ్గయ్య ఏదో మాట్లాడాలని ప్రయత్నిస్తాడు - మాట్లాడలేదు - జగ్గయ్య ఎప్పుడు లీల యింటికివచ్చినా ఏవో ప్రపంచ రాజకీయాలు; ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమాల చరిత్ర చెపుతు వుండేవాడు- అలాంటివాడు కొట్టేసిన కొయ్య లాగ అలానే కూర్చున్నాడు - నిముషానికొక ఆలోచనతో,

భావతరంగాలతో ముఖం పలువిధాల మారిపోతుంది. జగ్గయ్య ముఖంకేసి అదేపనిగ చూస్తున్న లీలకు మరెందుకో సిగ్గు వేస్తుంది - "ఏమిటాలా వున్నావు పేలాలేమైన గొంతున పడ్డాయా? - అయితే మంచినీళ్ళు అడగవేమిటి - ఆడపిల్లలాగ నీకూ సిగ్గేనా" అంటు మంచినీళ్ళు తెచ్చియిచ్చింది - మంచి నీళ్ళు తాగి మరల అలానే కూర్చున్నాడు. "నీస్థితి నాకర్థంకావ డంలేదు - నీబాధ చూస్తుంటే నాకు నవ్వొస్తుంది" అంటు లీల మరల ఫక్కున నవ్వింది. యీసారి లీల జగ్గయ్యను బలవంతాన నవ్వించ గలిగింది - యిద్దరు అమాయకంగ, అకారణంగ నవ్వుకుంటు కొంచెంసేపు తన్మయం చెందిపోయారు - భౌతిక దేహాలురెండు కలవనప్పటికి, ఆనవ్వులో నవ్వు, కళ్ళలో కళ్ళు, హృదయంలో హృదయం కలిసిపోయాయి - ఇద్దరికి సమాన మైన ఆశయాలు, ఆదర్శాలు, నైతిక ప్రమాణాలు వారిద్దరి ముందు నాట్యం చేసాయి.

జగ్గయ్య :- నీతో చాలాకాలంగ ఒకమాట చెప్పాలను కుంటు చెప్పలేక పోతున్నాను.

లీల :- ఇది శుద్ధ అబద్ధం- నాతో ఒకమాటఏమిటి కొన్ని లక్షల మాటలు నాతో యిప్పటికె మాట్లాడి వుంటావు.

జగ్గయ్య :- ఆమాటలుకావు - వేరేమాట.

లీల :- వేరేమాట అదెలావుంటుంది - అంతగా చెప్పా లనుకుంటేచెప్పు - ఊ - తొందరగ.

జగ్గయ్య :- నీవు ఏమీ అనుకోకుండావుంటే చెపుతా.

లీల :- మాటకెవరయిన ఎందుకుగాను ఏమయిన అనుకో వాలి - ఊ - చెప్పు అంటు వేలాలబుట్టతో మోకాలుకేసి పొడిచింది - సుద్ద - ఆమాట నీకొ స్తేగ నాతో చెప్పడానికి.

జగ్గయ్య :- మరేమీలేదు లీల. నీవు పెండ్లి ఎవరిని చేసుకుంటావు ?

లీల :- పెండ్లా...అమ్మయ్యో !- స్త్రీకి పెండ్లి అంటే మగ వాడితో నేగ - అయితే నాకొద్దు మగవాళ్ళు. త్రాగుతారు, తంతారు - అదీగాక పిల్లలు పుడతారు. ఆపిల్లలు ఏడుస్తారు. వంటి గుడ్డలమీద ఒకటికి దొడ్డిపని పూర్తిచేస్తారు. ఏడిస్తే పూరడించడం చేతగాకపోతే చుట్టుప్రక్కలవాళ్ళు ఎగతాళి చేస్తారు. తిండిఅడిగితె మగాళ్ళు చావబాదుతారు. మొగుడు చేతగాని వాడయితే పెళ్లాము, బిడ్డలు తిండిలేక చావాలి.

జగ్గయ్య :- అయితే బ్రహ్మచారిణిగా వుంటావన్నమాట.

లీల :- నాపెండ్లి విషయం - నీకెందుకు?

జగ్గయ్య :- సరేలే - అలిగినట్లు పోజుపెట్టి ముఖం మరో వైపుకు త్రిప్పి కూర్చున్నాడు.

లీల :- ఇదేమిటిబావా! చిన్నవిషయానికి నామీద అలుగు తావు - నాపెండ్లివిషయం అడిగావు - నాకుతోచిన అభిప్రా యాలు చెప్పాను - నేను చెప్పినవిషయం సరికాదనుకుంటే నన్ను సరిచేసేహక్కు నీకుంది - అమాయకంగ కూలినాలి చేసి జీవించె నాకు రాజకీయాలునేర్పావు - తగిన ధైర్యంతో

ప్రజల సమస్యలపై పనిచేయడం నేర్పావు – నీవే నా లెనిన్‌వి. అయితే ఒకమాటబావ– అందరి పెండ్లిండ్ల గొడవని కూర్చి ఆలోచిస్తావు – మరి నీపెండ్లి గొడవేమిటి?

జగ్గయ్య :– నాపెండ్లిసంగతి నేనుబాగానే ఆలోచించాను.

లీల :– ఇంతకు ఆమెను నీవు ప్రేమించడమేనా, ఆమె కూడ నిన్నేమైన ప్రేమిస్తున్న సూచనలున్నాయా.

జగ్గయ్య :– ఆమె నన్నుగాఢంగ ప్రేమిస్తుంది. ఆమె కండ్ల చూపుల్లో, మనోభావాల్లో నాకు కావలసిన ప్రతిచిన్న విషయానికి చక్కటి సమాధానం దొరికింది. భౌతికదేహాలు కలియనప్పటికి, ఒకరితో ఒకరం ప్రేమ పెండ్లివిషయాలు చర్చించుకోనప్పటికి మా హృదయాలు ఏనాడో కలసి పోయాయి – ఏనాడో మా హృదయంలో బీజరూపంగవున్న ప్రేమ మొలకెత్తి బాగా అల్లుకుంది.

లీల :– పిల్ల ఎలావుంటుంది. కాస్త ఆమె అందచందాల్ని గురించిచెప్పు – పేరు – వూరు అన్నీ చెప్పాలి.

జగ్గయ్య :– నేను ప్రేమించినపిల్ల అచ్చంగ నీలాగే వుంటుంది. ఆమెదికూడ నీపేరే – యీవూరే – నన్ను ఆమె లెనిన్‌గ స్టాలిన్‌గ వర్ణించుకుంటుంది.

లీల :– నాపేరుగలపిల్ల నాలాగ వుండేపిల్ల మన పల్లెలో నేనుతప్ప మరెవరులేరే.

జగ్గయ్య :– అయితే నీవేలనుకో.

లీల చూపులతో సమ్మతి కనపరచింది. ఇద్దరు పరవశులైనారు - అప్పటి రసవృష్టి యెవరు వర్ణించగలరు - మాధుర్యంకంటె మధురంగవుంది. ఇద్దరిముఖాలు ఏవో క్రొత్తగ కనబడుతున్నాయి.

జగ్గయ్య :- ఇకముందుకూడ నాజీవితం పూర్తిగ విప్లవోద్యమానికి అంకితం చేయబోతున్నాను. భవిష్యత్తులో యింతకంటె కష్టాలున్నాయి. చాలకష్టాలకు చిక్కులకు గురి కావలసి వస్తుంది. జాగ్రత్తగ ఆలోచించుకో.

లీల :- నా పోషణ, నా సౌఖ్యం ప్రధానంగ దృష్టిలో పెట్టుకొని నేను యీ వివాహానికి అంగీకరించడంకాదు- నేను నీలాగే నా జీవితాన్ని విప్లవోద్యమానికి అంకితంచేసి ప్రజా వుద్యమాల్లో పనిచేస్తు, ఎల్లప్పుడు నిన్నే ప్రేమిస్తాను. నా హృదయంలో నీకుదప్ప మరెవ్వరికి స్థానంలేదు- నీవు తప్పించుకోలేవు - రాత్రులు నీ రూపాన్ని చీకట్లో చూస్తాను.

ఆకాశమంతా వెన్నెల పాలతో నిండినది. సమస్త జీవకోటి అమృతపు వెల్లువలో మునిగి తేలుతుంది. చందమామ వెన్నముద్దవలె తేలియాడుతుంది. చలిగాలి ఉభయుల మధ్యవున్న దూరాన్ని తొలగించింది. ఆ చలిగాలిలో ప్రేమకు అనురాగానికి, చిహ్నమైన నులివెచ్చటి ముద్దుతో లీలను తన కౌగిటిలోకి చేర్చుకున్నాడు. యిరువురకు ముచ్చట్లు ఎక్కువైనాయి. యితరులకు రుచించని కథలన్ని వారికి ఇంపు

గోలుపుతున్నాయి - భావ ప్రపంచంలోనుండి భౌతిక ప్రపంచంలోకి మారేటప్పటికి సంధికాలమే మనుష్యుల జీవితంలో మిక్కిల రసవత్తరమైనభాగం.

ప్రజ్ఞకు, దీక్షకు, పట్టుదలకు కార్యసాధనకు చిహ్నమైన విప్లవ శాల్యూట్‌తో లీల జగ్గయ్యలు కరస్పర్శ అనంతరం విడబడిపోయారు.



# 7

ఈలోకి బాగా వేసిన వరిచేలు పూర్తిగ అడ్రుసులువంచాయి. ఆలస్యంగ నాట్లుపడ్డ పొలాలు అప్పుడే పొట్టలిచ్చి పాలుపోసు కుంటు రోజుకోవిధంగ గింజ బిగుస్తుంది. గింజలు నానాటికి బిగుసుకుంటు వరిపైరు రంగు మారిపోతుంది. రంగు పూర్తిగ మారిపోయి పండి ఒరిగిన పొలాలు బంగారు రేకుల్లా మెరిసి పోతున్నాయి. రెండవ పంటకు పెసర, మినుము విత్తనాలు చల్లడానికి చేలల్లో పాయలు తీయడం ప్రారంభించారు.

యుద్ధకాలంలో వ్యవసాయ కూలీలు అధికాహారోత్పత్తి క్రింద నాగులోకి తెచ్చిన బంజరుభూములు సారవంతమైన పంటపొలాలుగ మారాయి. ఒకనాడు ఎందుకూ పనికిరాని భూముల్ని వ్యవసాయకూలీలు ఎంతో శ్రమను, ధనాన్ని వెచ్చించి బాగుచేసి ఆ భూముల్లో యీనాడు బంగారం లాంటి పంటల్ని పండిస్తున్నారు. బంజరు భూములకు సమీపంలో మంచినీటి మురుగునీటి సౌకర్యాలకు పంట, మురుగు కాలువలు త్రవ్వించాలని రైతు వ్యవసాయకూలి సంఘాలు సంయుక్తంగ చేసిన ఆందోళన దేశంలోని పలుప్రాంతాల్లో ఫలించింది. ప్రభుత్వం వ్యవసాయ అభివృద్ధి కోసరం ఖజానా నుండి ఎక్కువ మొత్తాలు కేటాయించి, ప్రాజెక్టులు నిర్మించి పొలాలకు మంచినీటి సౌకర్యాలు కల్పించుటకు పూనుకుంది.

బంజరుభూములున్న ప్రాంతంలో ప్రాజెక్టులునిర్మించి కాలువలు త్రవ్వించడంతో బంజరు భూములవిలువ మరింతగ పెరిగింది. అనేక సంవత్సరాలనుండి సాగుచేస్తున్న యీ బంజరుభూములకు విపరీతమైన పెనాల్టీలు, శిస్తులు వసూలు చేస్తున్నారు. అధిక శిస్తులు రద్దుచేసి వ్యవసాయకూలి కుటుంబాలకు బంజర్లు పంచి పట్టాలివ్వాలనే ఆందోళన పెద్దగబయలుదేరింది. బంజరు భూములు అసలు సాగుచేయవద్దని భూస్వాములు మొదట్లో అటకాయించారు. ఎదురుతిరిగి సాగుచేసినవారి భూముల్లో పశువులుతోలి పైరు నాశనంచేసారు. వ్యవసాయ కూలీలు; భూస్వాములు, ప్రభుత్వాధికారులు పెట్టిన చిక్కుల్ని యిబ్బందుల్ని సరకుచేయకుండ పొలాల కంటిపెట్టుకొని అధికపంటలు పండిస్తున్నారు. వ్యవసాయ పంటలకు తదితర జీవితావసర వస్తువులకు ధరలు విపరీతంగ పెరిగాయి. ధాన్యరూపంలో కూలి యివ్వడంమాని భూస్వాములు కాంట్రాక్టు కూలిపద్ధతి ప్రవేశపెట్టి తక్కువ డబ్బులకూలి యివ్వడం మొదలెట్టారు. వ్యవసాయ కూలీల ఆర్థిక పరిస్థితులు నానాట తీసికట్టుగ తయారవుతున్నాయి - అప్పులభారం పెరిగిపోతుంది. వ్యవసాయకూలీల శారీరక మానసిక దుస్థితికిలోనయి వ్యవసాయ వుత్పత్తిలో ప్రధాన భాగస్వామిఅయిన వ్యవసాయకూలి వర్గం మొత్తంగానే నిర్వీర్యమైన పరిస్థితులకు దిగజారడం మొదలెట్టింది. కూలిరేటు పెంచుకోడానికి పని గంటల భారాన్ని తగ్గించుకోడానికి వ్యవసాయ కూలీలు మరలా సమ్మెకు తలపడాల్సి వచ్చింది. కూలిరేటుపై భూస్వాముల వద్దకు రాజీకి వెళుతుంటే యీ రాజీ సంప్రదింపులన్ని కూలీల

లోని బలహీనతకు, అనైక్యతకు చిహ్నాలుగ భూస్వాములు భావించి కూలి రేటు పెంచము పొమ్మని తలాయించి కొడుతున్నారు. గత్యంతరంలేక వ్యవసాయకూలి కార్యకర్తలు ప్రధానంగ కూలి రేటు పెంచాలనే నినాదంపై తమశక్తిని బలాన్ని ప్రదర్శించి న్యాయమైన హక్కుల సాధనకోసరం ప్రచారంలోకి బయలుదేరారు. యీ కూలి రేటు సమస్యతో కౌలుదార్ల సమస్యను జోడించి ప్రచారం చేస్తున్నారు. పండిన పంటలో అక్రమవాటా భూస్వాములకు పోరాదని, పండిన మొత్తంపంటలో న్యాయమైనవాటా మాత్రమే భూస్వామికి పోవాలనే నినాదంతో కౌలుదార్లను సమీకరించారు.

జగ్గయ్య, వెంకటరత్నం, శ్రీనివాసరావు, సుబ్బయ్యల మీద ఇంకా ప్రభుత్వ అరెస్టు వారంట్లు వ్రేలాడుతూనే వున్నాయి. వారు బహిరంగంగ తిరిగే అవకాశం లేనందున అజ్ఞాతవాసంలోవుండే తమ రాజకీయ కార్యకలాపాలు ప్రజల అండతో దిగ్విజయంగ కొనసాగిస్తున్నారు.

రాబోయే వ్యవసాయకూలి సమ్మెనుగూర్చి చర్చించడానికి జగ్గయ్య ఒక రహస్య సమావేశాన్ని ఏర్పాటుచేసాడు. యీ సమావేశానికి సుబ్బయ్యమినహా మిగతా కార్యకర్తలందరు హాజరయ్యారు. సుబ్బయ్యకోసరం సమావేశాన్ని ఆపారు. మంచు దట్టంగ పట్టింది. భూమ్యాకాశాలు కలసిపోయాయా అన్నట్లుంది. మంచు తుపర్లు పడుతున్నాయి. పండి ఒరిగినచేలు మంచుభారంతో పూర్తిగ నేలను కరుచు

కొనిపోయాయి. ఎముకలను సహితము కొరికివేసేటట్లుగ చలి గాలి వేస్తుంది.

సమావేశానికి ఒకరోజుముందే సుబ్బయ్య పోలీసు ల చేత అరెస్టు గావించబడ్డాడు. సుబ్బయ్య సంచిలో చైనా విప్లవానికి సంబంధించిన కొన్ని పుస్తకాలు, రహస్యపార్టీ సర్క్యులర్లు పట్టుబడడంతో సుబ్బయ్య రాజకీయరంగు బయట బడి పోయింది. సుబ్బయ్యను పోలీసుస్టేషనుకు పంపించారు. మొదటి రెండురోజులు సెంట్రల్ పోలీసుస్టేషనులో సుబ్బయ్యను వుంచారు. పోలీసువాళ్ళ రికార్డుల్లో సుబ్బయ్యనుగూర్చిన సమాచారం అంతగలేదు - పోలీసు ఆఫీసరే స్వయంగ సుబ్బయ్యవద్దనుంచి సమాచారం సేకరించడానికి పూనుకు న్నాడు. మొదటి ఒకటి రెండురోజులు పోలీసుఆఫీసరు సుబ్బ య్యతో చాలా మర్యాదగ పిచ్చిగోవులాంటి అమాయకంగ వ్యవహరించాడు. సుబ్బయ్యకు కాఫి టిఫిన్ కావాల్సినన్ని మార్లు అందజేయ వలసినదిగ హుకుంజారి చేసాడు. సుబ్బ య్యకు కాఫీత్రాగే అలవాటులేదు. పైపెచ్చు పోలీసుఆఫీసరు అందజేసే యీ కాఫీ టిఫిన్ ముట్టడానికి అతని మనస్సు అంగీ కరించలేదు - అందువలన తిరస్కరించాడు. మరింతచనువుతో సుబ్బయ్యను మూడవరోజు సంభాషణల్లోకి దింప ప్రయత్నిం చాడు. తనకు చదువుకునే రోజుల్లో విప్లవకర భావాలుండే వని, అతివాద రాజకీయాలంటే నాలుక కోసుకునేవాడినని, నిషిద్ధ కరపత్రాలు పుస్తకాలు తనరూములో జాగ్రత్తగ దాచి అజ్ఞాత దేశభక్తులకు అందజేసేవాడినని సుబ్బయ్య ముందర చెప్పుకున్నాడు. తన కుటుంబం మధ్యతరగతికిచెంది

యుండడంవలన కుటుంబంలోని మిగతా చిన్న సోదరుల్ని తనబాధ్యతమీదే చదివించాల్సి వచ్చేటప్పటికి డబ్బుసంపాదనకోసరం, యీ పాడుపోలీసువృత్తిలో దిగాల్సి వచ్చిందని లేకపోతే తనుకూడ సుబ్బయ్యలాగా గొప్ప విప్లవకర భావాలుగల దేశభక్తుడనయి వుండేవాడినని చెప్పుకున్నాడు. తరువాత రష్యా దేశం ఆర్థిక సాంస్కృతిక రంగాలలో సాధించిన విజయాలు అమోఘంగ వున్నాయని పొగడేసాడు. ఎంతసేపు మాట్లాడిన పోలీసుఆఫీసరే మాట్లాడవలసి వస్తుంది. సుబ్బయ్య మాత్రం మంచి శీవితో ఆఫీసరు చెప్పేదల్లా జాగ్రత్తగ వింటు న్నాడు. యీసందర్భంలోనే తలపై హోంగార్డులు కొట్టిన గాయాన్ని తిలకించాడు. "ఎనడాపశువు. నిన్ను అంత రాక్షసంగ కొట్టాడు." అంటూ హోంగార్డుల్ని, పోలీసుల్ని కొన్ని నిముషాలపాటు చెడాబడా బండబూతులు తిట్టివేసాడు. ఆఫీసరు తిడుతుంటే "అయ్యో చిత్తం చిత్తం" అంటూ తిట్టే తిట్టుల్ని గాలికి పోకుండ శుభ్రంగ మింగివేసారు. ఒకపోలీసు వానిచేత రెండు కాఫీలు తెప్పించాడు. కాఫీ టేబులుమీద వుంచాడు. కాఫీగ్లాసు ఆఫీసరే సుబ్బయ్య కందించబోయాడు. "అయామ్‌సారి" అన్నాడు సుబ్బయ్య. కాఫీకి పెద్దపట్టింపు ఏమిటి కామ్రేడ్ - కాఫీ తాగడం చెడుఅలవాటు క్రిందకు కూడరాదు - ఫర్వాలేదులే త్రాగు" అంటు అదొకరకమైన హేళనభావంతో ఆఫీసరు సుబ్బయ్యముఖంకేసి దీర్ఘంగ చూచాడు. సుబ్బయ్య ముఖంలో ఏదయినమార్పు వచ్చిందేమోనని తదేక దీక్షతో పరీక్షించాడు - సుబ్బయ్యముఖం తీవ్రంగ నిండుగ కనబడింది. భయానికి సుబ్బయ్యంటే తీరని

భయమన్నట్లు దడిసి పారిపోయినట్లుంది. పాపము ఆఫీసరు కొట్టే స్టంటులకు సుబ్బయ్య ఐస్ అయిపోయి హృదయమిచ్చి మాట్లాడుతాడని పగటికలలుకన్నాడు. సుబ్బయ్యను కాఫీ త్రాగవలసినదిగ రెండవ పర్యాయం కోరాడు. సుబ్బయ్య మర్యాదగ మరలా తిరస్కరించాడు. దీనితో ఆఫీసరులోవున్న సహనం కొంతమట్టుకు సడలింది. అయినా యీ కాఫీ నీకెక్కడానిచస్తుంది–ఒక భూస్వామిదో పెట్టుబడిదారుని శరీరంలోదో ఒకగ్లాసు వేడినెత్తురయితే ఘటఘటమని మూడుగుక్కల్లో పీల్చిపారేస్తావు. రెండణాలు చెయ్యని యీకాఫీత్రాగే దుర లవాట్లు మీలాంటి విప్లవకారుల కెందుకుంటాయి. అంటూ పకపకా వెకిలిగ నవ్వాడు.

సుబ్బయ్య అరెస్టు గావించబడ్డవార్త స్థానిక భూస్వాములకు, ముఖ్యంగ బాపయ్య వర్గానికి తెలిసింది. సుబ్బయ్య రాజకీయ జీవితానికి సంబంధించిన రిపోర్టులేగాక హత్యలు దోపిడీలు చేయించాడనే తప్పుడు రిపోర్టులుకూడ పోలీసుల కిచ్చారు. ఒకసంవత్సరంపాటు తెలంగాణా అడవుల్లోవుండి తుపాకియుద్ధం నేర్చుకొని తెలంగాణా కమ్యూనిస్టులతో పాటు హత్యలు దోపిడీల్లో భాగస్వామిఅని అబద్ధాలుఅల్లి సుబ్బయ్య జీవితాన్ని తుదముట్టించడానికి కావాల్సిన ప్రయత్నాలన్ని అతిత్వరగ పూర్తిచేస్తున్నారు. పోలీసు స్టేషన్లపై దాడిచేసి తుపాకులు అపహరించాడని, పోలీసుల్ని ఒకవైపు రెచ్చగొట్టడం సుబ్బయ్యను కాల్చి చంపకపోతే ఆపని భూస్వాములే చేయడానికి సంసిద్ధత వెలిబుచ్చడం, యీ రెండు

పనులు చేయకపోతే పోలీసు ఆఫీసరు భరతం పడతామని బెదిరించుతు భూస్వాములు వళ్ళు తెలియకుండ పిచ్చికుక్కల్లా వీరవిహారం చేస్తున్నారు. నాల్గవరోజు సుబ్బయ్యనుగూర్చి పూర్తిసమాచారంతో పోలీసు ఆఫీసరువచ్చాడు. ఆఫీసరు గదిలోకి సుబ్బయ్యను రప్పించారు.

ఆఫీసరు :- నీపేరేమిటి?

సుబ్బయ్య :- 'య'

ఆ :- హోంగార్డులు నిన్ను అరెస్టుచేసిన తేదిఏది ?

సుబ్బయ్య :- డిసెంబరు 1949 సం॥

ఆ :- తేది

సుబ్బయ్య :- డిసెంబరు ఒకటో తారీఖు.

ఆ :- నీవుచెప్పింది నీ నిజమైన పేరేనా ?

సుబ్బయ్య :- నేనుచెప్పిందే నా పేరు. అదే నిజమయినది.

ఆ :- నీమారుపేరు ఏమిటి ?

సు:- మారుపేరు అంటు లేదు.

ఆ :- నీకు రమేష్ అనే మారుపేరు వుందా లేదా? ఆ పేరుతో మీపార్టీవాళ్లు నీకు వుత్తర ప్రత్యుత్తరాలు జరుపుతుంటారా? లేదా?

సుబ్బయ్య :- అయితే ఈ విషయాలు నాకేమి తెలియవు.

ఆ :- నీదిఏవూరు - ఎక్కడికెళుతున్నావు.

సుబ్బయ్య :- ఫలానవూరు - ఫలానచోటికి

ఆ :- నీమీద అరెస్టు వారంటు వున్నసంగతి తెలియదా?

సుబ్బయ్య :- తెలుసు.

ఆ :- అయితే పోలీసులకు లొంగిపోయి న్యాయవిచారణకు నిలబడడానికి జంకి ఎందుకు దొంగలా అజ్ఞాత వాసంలో వుంటున్నావు.

సుబ్బయ్య :- సమాజంలో సామాన్యరైతు, వ్యవసాయ కూలి, కార్మిక పేదప్రజల రక్తమాంసాలు దోచేస్తున్న పగటి గజదొంగలున్నారు పెద్దమనుష్యుల్లా. తెల్లగుడ్డలతో వ్యవహరించే యీ గజదొంగల పని పట్టాలంటే నాబోటి యువకులు జైళ్ళలోవుంటే లాభంలేదని భావించాను. దొంగలాకాదు - దేశభక్తుడుగ ప్రజల్లో తిరుగుతు ప్రజలకు సేవచేస్తున్నాను.

ఆ :- వెంకటరత్నం జగ్గయ్యాలు ఎక్కడుంటున్నారు.

సుబ్బయ్య :- తెలియదు.

ఆ :- నీవు మాట్లాడేది పచ్చిఅబద్ధం వాళ్ళను కలుసుకోడానికి నీవు పోతున్నావని మాకు మీవాళ్ళనుండే భోగట్టాచేరింది.

సుబ్బయ్య :- అయితే యిది అబద్ధం.

ఆ :- వెంకటరత్నం నాలుగురోజుల క్రితమే కాల్చి చంపి వేయబడ్డాడు. చచ్చేటపుడు మీవిషయాలన్ని చెప్పాడు.

సుబ్బయ్య :- వెంకటరత్నంకు చావంటులేదు - చావు తప్పనిసరిఅయితే నీలాంటివాళ్ళను అరడజనుమందిని అతని తుపాకికి ఎరవేసిగాని మరి చావడు. నా విషయం అంతా రత్నంనీకు చెప్పాడనేది కటికి అబద్ధం.

ఆఫీసరు సహనమంతా సన్నగిలిపోయింది. లోడ్ చేసిన పిష్టలు చేత్తోపట్టి కొద్ది నిముషాలు అటూ యిటూ గదంతా పచార్లు కొట్టాడు. బుర్ర వేడెక్కిపోయింది. ఒక్క విషయంకూడ సుబ్బయ్యనుండి సేకరించలేకపోవడం తనని తాను అవమానించుకున్నట్లు సుబ్బయ్యచేత పెద్దగ అవమానం పొందినట్లు చిందులేయడం మొదలెట్టాడు.

ఆ :- ఇది లోడ్ చేసిన పిష్టలని తెలుసా? తెలిస్తే దీనితో నీలాంటివాళ్ళు ఎంతమంది ఆహుతి అయిపోయింది తెలుసా?

సుబ్బయ్య :- ఆ... తెలుసు.

మెల్లగ ఎగతాళిని సూచించే నవ్వు నవ్వాడు.

ఆఫీసరుకు కోపంవచ్చింది. హంటరుతో రెండుదెబ్బలేసాడు. "నీవు బ్రతికి బయటపడాలంటే నీ ప్రయాణం ఎక్కడికో మీవాళ్ళు ఎక్కడున్నారో చెప్పు - లేకపోతే నీప్రాణాలు నీకుదక్కవు."

సుబ్బయ్య :- నాకు తెలిసినదంతా నీకు చెప్పాల్సిన పని లేదు - నాయాత్ర పీడితప్రజల సాంఘిక, రాజకీయ, ఆర్థిక విముక్తికి ప్రజా పీడకులను సర్వనాశనం చేయడానికి, నాపేరే మంటల పిడుగు, నావూరు విప్లవనగర్ నా గమ్యం దోపిడి, స్వార్థం, చీకు చింతలేని వర్గరహిత సోషలిస్టు సమాజ సంస్థాపన.

ఆ :- చావాలని నీకు అంతపెద్ద సరదాగావుంటే నిన్ను బ్రతికించడం బ్రహ్మతరం కూడా కాదు. నీమేలుకోరి

చెప్తున్నాను. మొదట రత్నం జగ్గయ్యలు జాడచెప్పు. కనీసం యిద్దరి ఆచూకి చెప్పలేకపోయిన ఒకరిజాడ అయిన చెప్పు. నిన్ను కాల్చకుండ వదలివేస్తాను.

సుబ్బయ్య :- నా చావుకు భయపడి శ్రామికవర్గ నాయకత్వాన్ని నాశనం చేయమంటావు. పీడిత ప్రజలకు ద్రోహం చేయమంటావు. ఆపని ఎన్నటికి జరగదు. యీ సుబ్బయ్య కంఠంలో ప్రాణం వున్నంతవరకు పీడితప్రజల్ని ప్రేమిస్తాడు. ఆ ప్రజల ప్రేమలోనే అపారమైన శక్తి ధైర్యం బలం సమకూడుతాయి - ఆశక్తి బలంతోనే మీ పన్నాగాలన్నిటిని ఓడించి తీరుతాను. నా ప్రాణం కావాలంటే తీసుకోనండి - నా వేడిరక్తం కావాలంటే మీరంతా నాపైబడి జుర్రండి - మీరు చేయగలిగింది నా భౌతిక కాయాన్ని నా ప్రజల ముందు లేకుండ చేయగలరు - శ్రామికవర్గ అంతిమ లక్ష్యమైన కమ్యూనిజాన్ని మీరు ఏనాటికి హత్యచేయలేరు. నన్ను వధించినచోట నా నెత్తురుతో తడిసినభూమి పావనమవుతుంది. ఆగడ్డనుండే మిమ్మల్ని హతమార్చడానికి వందలు వేలు విప్లవ వీరులు ముందుకు వస్తారు. నేను కార్చబోయే రక్తం వృధాకాదు. నా జెండాను మరింత ఎరుపుచేస్తుంది. నా ఆశయాల్ని ఆదర్శాల్ని మరింత త్వరగ నెరవేరడానికి సోపానాల్ని వేస్తుంది.

ఆఫీసరు తన ప్రక్కనేవున్న మరోఛోటా ఆఫీసరువైపు చూచి కన్నుగొట్టాడు. ఇద్దరు బయటకువెళ్ళి కొంతసేపు మాట్లాడుకున్నారు.

తరువాత నలుగురు యమ భటుల్లాంటి పోలీసులు సుబ్బయ్యగదిలో ప్రవేశించారు. వాళ్ళకు అలుపువచ్చేదాకా బాదడం మొదలెట్టారు. కీళ్ళు తొలగదీసారు. వ్రేళ్ళలో సూదులుగ్రుచ్చి హింసించారు. పట్టకార్లతో సున్నితమైన శరీరభాగాలను దుర్మార్గంగపట్టి గాయపరచారు.

యీ దెబ్బలు సుబ్బయ్యకు చెప్పలేనంత బాధను కలుగజేసాయి — మనిషి తెలివిలో లేడు. ఒకఅరగంటసేపు కట్టెలాగ పడిపోయాడు. మూలుగులు బయటకు వినబడు తున్నాయి. విపరీతమైన దాహం వేస్తుంది — ఒకమూలనున్న కూజాదగ్గరకు మంచినీళ్ళకోసరం దొర్లి వెళ్ళబోయాడు — అది అతనికి అందుబాటులో లేకుండ తీసివేసారు. మంచినీళ్లు కావాలని అడగడంమానేసి నాలుకతో పెదిమల్ని తడుపు కున్నాడు. ఇంతలోనే ఆఫీసరు మరలా గదిలో ప్రవేశించాడు. "ఇప్పటికైనా మునిగిపోయిందిలేదు. నీవు బ్రతికి బయట పడడానికి పూర్తి అవకాశాలున్నాయి. వాళ్లు ఎక్కడున్నారో చెప్పు."

సుబ్బయ్య :— నన్ను హింసించడంద్వారా నాలో నీవు పిరికిమందు నూరిపోయాలని పగటికలలు కంటున్నావు. ప్రాణంమీద ఆశచూపి స్వార్థానికి మోసానికి ఒడిగట్టమంటున్నావు. మీరు అవలంబిస్తున్న యీ రాక్షస పద్ధతుల్ని ఓడించడానికి పంటికి పన్ను, కంటికి కన్నులాంటి సిద్ధాంతం ఒక్కటే సరయినమార్గం కనబడుతుంది. యీ మాటలువిన్న ఆఫీసరు తోకత్రొక్కిన త్రాచులాగ బుసలుకొడుతు సుబ్బ

య్యను స్థంభానికేసి కాళ్ళుచేతులు విరగ గట్టమన్నాడు. సుబ్బయ్యను స్థంభానికిబాగా త్రాళ్ళతో అంటగట్టారు. ఇష్ట మొచ్చినట్లు పోటీలుపడి చావబాదారు. యిది చాలదా అన్నట్లు మొండి కత్తులతో శరీరంలో అక్కడక్కడ గాట్లు పెట్టారు.

రాత్రికి వేడినీళ్ళతోను, వేయించిన వుప్పుతోను శరీరానికి కాపులు కాయించారు. దెబ్బలుతగిలిన యీ శరీరానికి యిలా కాపులుకాచి రెండవరోజు అదేశరీరంమీద దెబ్బలు కొడుతుంటే ఆ దెబ్బలబాధ వర్ణనాతీతము. హింసకు తట్టుకోలేక సుబ్బయ్య రహస్యాలు బయటపెడతాడని పోలీసు ఆసఫీసు ఊహ.

సైరన్ మ్రోగింది. రాత్రి పన్నెండుగంటలు దాటుతుంది. జిన్నాటవరుదగ్గర పల్చపల్చగ రిక్షాకార్మికులు బండిలో పడి కునికిపాట్లు పడుతున్నారు. తలదాచుకోడానికి గుడిసెలు కూడలేని నికృష్ట పేదజీవులు రోడ్లప్రక్కనే నిదురిస్తున్నారు. విశ్రాంతిలేని లారీడ్రయివరు ఏమాత్రం గాడితప్పితోలినా వారి ప్రాణాలు గంగపాలుకావల్సిందే. పడక గదిలో అలిసిపోయిన ప్రేయసీ ప్రియులు, తిన్నది జీర్ణంగాక అజీర్తిరోగంతో పరుపులమీద బాధపడే ఆగర్భ శ్రీమంతులు, పస్తులతో అర్థాకలితో డొక్కలో మోకాళ్ళుపెట్టి బాధపడుతున్న శ్రమజీవులు. ఒకవైపు దోమకాటు రెండోవైపు నల్లులబాధ. ఆసుపత్రిలో క్షయరోగుల దగ్గులు - మున్సిపాలిటివారి సైడుకాలువలనుండి విరజిమ్మే భరించరాని కుళ్ళుకంపు ఆర్థిక సాంఘిక

న్యాయంకోసరం పాటుపడే విప్లవయోధుల రహస్య మంత్నాలు - వారికోసరం వేటాడే ప్రభుత్వ వేగులవాళ్లు.

రెండవరోజుకూడ సుబ్బయ్యను క్రూరంగ హింసించారు. రహస్యాలు రాబట్టడానికి ఆధునికంగ కనిపెట్టిన హింసా పద్ధతు లన్నిటితోను సుబ్బయ్య శరీరంమీద, మనస్సుపైన ప్రయోగంచేసి చూచారు - ఏమీ లాభంలేకపోయింది. సుబ్బయ్య నోటినుండి ఒక్కమాటకూడ రాలేదు - జూలియస్ ఫ్యూజిక్ అన్న "ఒక వికలాంగుని దృశ్యంకంటె, తన అంతరాత్మనీ స్వాభిమానాన్ని చంపుకున్న వ్యక్తిని చూడడం దుస్సహంగ వుంటుంది. ఇక్కడ ప్రతిక్షణమూ నీయెదుట తిరుగాడుతున్న మృత్యువు - ఆ మృత్యువు నీ కండ్లపై చల్లగ వాలితె, నీవు పునర్జన్మ పొందితే, ఎవరు భయంతో ఒణికిపోతారో, ఎవరెవరికి ద్రోహంచేస్తారో, స్వార్థం కోసరం ఇతరుల ప్రాణాలకు ప్రమాదం కలిగించేదెలాంటి వ్యక్తులో స్పష్టంగా గ్రహించగలవు. బలహీనుల్ని చూస్తే జాలివేస్తుంది. తమ ప్రాణాలకోసరం ఇతరుల ప్రాణాలను బలిగొనేవాడు బ్రతికి ఏంబావు కుంటాడు" ఈ వాక్యాలు స్ఫురణకు వచ్చాయి.

ధైర్యాన్ని తెచ్చుకున్నాడు. ఫ్యూజిక్ అన్నమాటలు లోలోన అనుకుంటుంటే ఆఫీసరును తిడుతున్నట్లుగ భావించి పెద్దకర్రతో సుబ్బయ్య తలపై గట్టిగబాదాడు. తల దానిమ్మ పండులా బ్రద్దలయ్యింది. దీనితో గదంతా రక్తమయమయింది. శ్రామిక జనంలో విప్లవకర భావాలను వెద

జల్లిన రక్తం - దేశంలోని అక్రమాలు, అన్యాయాలు చూచి ఆక్రోశించినరక్తం, పవిత్ర భావాలచేత పావనమైనరక్తం, ప్రజాసేవలో మరింత ఎరుపుబారినరక్తం.

తెల్లవారుఝామున మూడు గంటలయింది. పండు లాంటి వెన్నెల ప్రకాశవంతంగ కాస్తుంది. సుబ్బయ్యను ఒకపో లీసువ్యానులో ఎక్కించారు. వ్యవసాయ కూలి రైతు యువజన సంఘాలు బలీయంగవున్న గ్రామాలదగ్గరకు పోలీసు వ్యాను చేరుకుంది. తాళ్ళతోపులోకి సుబ్బయ్యను యీడ్చుకుపో యారు - సుబ్బయ్యను పారిపొమ్మన్నారు. కీళ్ళువిరగగొట్టబడి శరీరమంతా గాయాలతో నిండిన ఆ విప్లవయోధుడు ఎక్కడికి పారిపోగలడు - ఆ సుబ్బయ్య నెందుకు అక్కడికి తీసుకొ చ్చారో సుబ్బయ్యకు బాగా తెలుసు. "ఓరి నా కుక్కల్లారా నన్ను నిరాయుధుడ్ని చేసి చంపబోతున్నారు. ఇది అన్ని కాలాలకు అన్ని యుగాలకు విరుద్ధమైన ధర్మం. నా ముందర కూడ ఒక తుపాకికట్టె పారేయండి. మీతడాకా నాతడాకా చూచుకుందాం. చరిత్రలో పిరికివాళ్ళులాగ వ్యవహరించ బోతున్నారనే అపకీర్తి మీకురాకుండ వుండాలంటే నాకు మీతో పోట్లాడడానికి అవకాశం యివ్వండి - సహజమైన చావుకు అవకాశం కల్పించడి." సుబ్బయ్యమాటలు విన్నతరు వాత ఒకరిద్దరు పోలీసులు కంటతడి పెట్టుకున్నారు.

గాలిలో తుపాకులు ప్రేలాయి. నిశ్శబ్దం పటాపంచ లయింది. "విప్లవం వర్ధిల్లాలి" అని సుబ్బయ్య చివరిసారిగ విప్లవ నినాదాలతో సింహగర్జనలు చేసాడు. చెట్లమీద

పక్షులు కంపించిన భయంతో ఆకాశంలో దారి తెన్ను తెలియక గందరగోళంగ ఎగురుతున్నాయి. తన కళ్ళముందర జరిగే రాక్షసత్వాన్ని చూడలేక చందమామ మబ్బుల చాటుకు పారిపోయింది. "విప్లవం వర్ధిల్లా"లంటు ఆ వీరయోధుడు నేల కొరిగాడు.

తుపాకి కాల్పులతో చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు మేల్కొన్నారు. పోలీసువ్యాను శరవేగంతో మాయమయింది. ఎవరో దేశభక్తుడ్ని ప్రభుత్వం పొట్టన బెట్టుకుందని ప్రజలు అనుమానపడ్డారు. కాల్పులు జరిగినచోటికి వందలాది ప్రజలు పరుగులు తీసుకుంటు వెళుతున్నారు. తుపాకి గుండ్లకు బలిఅయిపోయిన సుబ్బయ్య దేహాన్ని చూచారు. అంతా ఒక్కుమ్మడిగ ఘొల్లున ఏడ్చారు. ఆ వీరయోధుని శవాన్ని ప్రక్కనున్న పల్లెకుచేర్చారు. ఆమృత కళేబరాన్ని ఎర్రజెండాలతో అలంకరించి చుట్టుప్రక్కల గ్రామాల్లో వూరేగించారు - వేల ప్రజలు ఎర్రజెండాలుపట్టి వూరేగింపులో పాల్గొని సుబ్బయ్యకు జోహారులర్పించారు. సుబ్బయ్య సుందర వదనాన్ని వేల ప్రజలు దర్శించి తమ ప్రియతమ నాయకునికి శ్రద్ధాంజలి ఘటించారు. సర్వాంగ సుందరంగ నిర్మించిన సమాధిలో ప్రజలు సుబ్బయ్యను దాచుకున్నారు.

మరుసటిరోజు పత్రికల్లో ఆశ్చర్యకరమైన వార్తలు ప్రకటించబడ్డాయి. సుబ్బయ్య తుపాకితో పోలీసులతో తలపడగ పోలీసులు ఆత్మరక్షణకోసరం ఎదురు కాల్పులు సాగించవలసి వచ్చిందనీ, యీ కాల్పుల్లో సుబ్బయ్య మరణించాడనీ ప్రముఖంగ ప్రకటించాయి.

భూస్వాములు, ప్రభుత్వము ఆశించినట్లుగ సుబ్బయ్య మరణవార్త ప్రజలలో భీతాహాన్ని కలిగించలేదు - ప్రజలలో ప్రతీకారం, తమ న్యాయమైన హక్కులకోసరం నిలబడి పోట్లాడాలనేదీక్ష గతంకన్న యినుమడించాయి. ధర్మం న్యాయం కోసరం పోట్లాడాలనే దీక్ష ఎక్కువయ్యింది. ప్రభుత్వ చర్య స్త్రీ పురుషుల్ని వయోవృద్ధుల్ని వృద్ధికర్తుల్ని చేసింది.

సుబ్బయ్య చనిపోయేనాటికి ముప్ఫయి సంవత్సరాలు నిండాయి. అంటరాని వ్యవసాయ కూలీల ఆర్థిక సాంఘిక పరిస్థితుల్ని చక్కదిద్దడానికి తనజీవితం అంకితం చేసాడు. పదు నెనిమిదవ సంవత్సరంలోనే కమ్యూనిస్టుగ మారాడు. రోజులో ఎక్కువకాలం పల్లెలో గడుపుతు వారిలో రాజకీయ సాంఘిక చైతన్యం కలుగజేయడానికి తీవ్రకృషి చేసాడు. సమాజంలోని పీడిత ప్రజలనుండి వేరుబడిపోయి తనకు తానుగ స్వార్థంగ బ్రతుకుతు పెద్ద ఆస్తిమంతుడు కావాలనే ఆలోచనకు చిన్ననాడే స్వస్తిచెప్పాడు. పీడిత ప్రజల ఆశయమే సుబ్బయ్య ఆశయం - వారి సుఖదుఃఖాల్లో భాగస్వామిగ జీవితాన్ని గడిపాడు. ఉన్న ఆస్తిలో ఎక్కువభాగం ప్రజా వుద్యమాల నిర్మాణంకోసరం ఖర్చు పెట్టేసాడు. తన వాటాగ వచ్చిన ఆస్తిలో చిల్లిగవ్వకూడ మిగలకుండ ఖర్చు చేసాడు. పది సంవత్సరాలు యువజన వ్యవసాయకూలి రంగాల్లో తీవ్రంగ పనిచేసాడు. అయితే సుబ్బయ్య ఏమి సాధించి చచ్చిపోయినట్లు అన్నప్రశ్న సామాన్యులకు కలగడం సహజం - ఒక డాక్టరు లేక లాయరు పది సంవత్సరాల తన

సర్వీసులో ప్రజలవద్ద సంపాదించిన డబ్బుతో అందంగ నిర్మించుకున్న భవనాన్ని, కారుని బ్యాంకులోవున్న డబ్బునుచూచి మురిసిపోతాడు - అతని శ్రమశక్తికి ఫలితం దక్కినట్లు భవిష్యత్తులో లోటు లేకుండ జీవించగలననే సంతృప్తితో తిరుగుతాడు. సుబ్బయ్య డాక్టరు లాయరులాగ డబ్బు సంపాదించలేదు సరిగదా వున్నడబ్బు అంతా ప్రజలకోసరం ఖర్చుపెట్టి తలిదండ్రులకు, భార్యకు తినడానికి సరిగ తిండికూడ లేకుండపోయింది. అయితే సుబ్బయ్య చచ్చిపోయి సాధించినదేమిటి?

అణగారిపోయిన సమాజంలో అట్టడుగునవున్న అంటరాని వ్యవసాయ కూలీల్లో సుబ్బయ్య బోధనలు నూతన చైతన్యాన్ని, మానవత్వం కాపాడు కోడానికి కావల్సిన పట్టుదల కార్యదీక్ష పెంపొందించాయి - సుబ్బయ్యలాంటి యువకులకృషి త్యాగాల ఫలితంగ కటికి దరిద్రం బానిసత్వంలో వుండికూడ తెలంగాణ రైతువ్యవసాయ కూలీలు భూమికోసరం, స్వేచ్ఛాస్వాతంత్ర్యాల కోసరం నైజాంనవాబు, రజాకార్ల పీచమణచడానికి ఆయుధాలుచేపట్టి వీరోచితంగపోట్లాడి దేశంలోని పీడిత ప్రజలకు వెలుగు బాటలు చూపించారు. భూస్వామ్య పెట్టుబడిదారి వర్గాల పగటిదోపిడిని సవాలుచేసి వాళ్ళుచేసే అన్యాయాలు అరికట్టడానికి పేదప్రజల్ని కార్యరంగంలోకి తెచ్చారు. ఒకమాటలో చెప్పాలంటే సుబ్బయ్య నిర్మించిన ప్రజా వుద్యమాలు దోపిడి విధానంతో బ్రతికే పెట్టుబడిదారి భూస్వామ్య వర్గాల ప్రభుత్వాన్ని అధికారం నుండి దించి పీడితప్రజల ప్రభుత్వాన్ని స్థాపించడానికిగల అవకాశాలు స్తోమత సంపాదించు కున్నాయి.

సుబ్బయ్యను హత్యచేసినంత మాత్రాన వ్యవసాయ కూలీలు భయపడి సమ్మె ప్రయత్నాలు విరమించుకోలేదు. భూస్వాముల ఆశలు నిరాశలయ్యాయి. సుబ్బయ్య మరణ వార్త వవ్యసాయకూలీల్లో ఐక్యతను సాధించడానికి సుబ్బయ్య ఆశయాలు ఆదర్శాలు అక్షరాల నెరవేర్చడానికి తోడ్పడ్డా యేగాని భూస్వాములు ఆశించినట్లు ప్రజల్లో భీతావహాన్ని కలిగించడానికి తోడ్పడ లేదు.

వ్యవసాయకూలి కార్యకర్తలు, పెద్దలతో కూడిన సమావేశం జగ్గయ్య నాయకత్వాన రహస్యంగ ఏర్పాటు చేయబడింది. ప్రభుత్వంచేత అన్యాయంగ కాల్చి చంపబడిన సుబ్బయ్యకు జోహారు లర్పిస్తు తీర్మానించారు. ఆయన కుటుం బానికి అన్నివిధాల సహకారాన్ని సహాయాన్ని భవిష్య త్తులో అందజేయడానికి తీర్మానించు కున్నారు. సుబ్బయ్య ఏపవిత్రాశయాలకు తన జీవితాన్ని బలిదానం చేసాడో ఆ పవిత్ర ఆశయాల కోసరం ఎడతెరిపిలేని పోరాటాలు సాగించ డానికి శపథం బూనారు. రాబోయే వ్యవసాయకూలి సమ్మె ఎలా నడపాల్సింది చర్చించి నిర్ణయాలు తీసుకున్నారు. యీ సమావేశానికి స్త్రీలుకూడ రావడం గమనించదగ్గ విషయం సమ్మె కమిటిని ఎన్నుకొని కార్యకర్తలు పనివిభజన తరువాత సమావేశాన్ని ముగించారు.

సమ్మె పెద్దఎత్తున ప్రారంభ మయింది. దొంగకూలీలను తీసుకొచ్చి సమ్మెను విచ్ఛిన్నం చేయడానికి బాపయ్య ముఠా చేసిన ప్రయత్నాలన్ని సమ్మె కమిటీవారు తగిన ఎత్తుగడలతో

వమ్ము చేసారు. బీద మధ్యతరగతి రైతాంగం సమ్మెకమిటి వారితో సంప్రదించి వ్యవసాయ కూలీలు అడిగిన కూలి రేటు యివ్వడానికి తమ అంగీకారాన్ని తెలియజేసారు. దీనితో భూస్వాములపని కుడితిలోబడ్డ ఎలుకల మాదిరిగ తయారయి వుక్కిరిబిక్కిరి లాడుతున్నారు. రైతుసంఘ కార్యకర్తలు వ్యవసాయ కూలీలుకోరేకూలి న్యాయసమ్మత మైనదని ఒక మానెడు గింజలు అదనంగ ఆకూలీలకు కూలియిస్తే రైతుకు పోయేది లేదని, రైతును ముఖ్యంగ వేధిస్తున్న అధిక పన్నుల బెడద, న్యాయమైన కొలు రేటు లేకపోవడం రైతులకు కావాల్సిన ఎరువులు, విత్తనాలు యితర వ్యవసాయ పరికరాలు ప్రభుత్వం సకాలంలో యివ్వలేకపోవడం రైతులు తీరని నష్టాలకు గురికావాల్సి వస్తుందని, వీటన్నిటికి మించి దున్నేవాడికి భూమి లభించేవిధంగ భూసంస్కరణలు అమలుజరిపి, విద్య వైద్య సౌకర్యాలు పేదవారికి వుచితంగ కలుగజేసిననాడే యీ బీదతనం కొంతవరకు రూపుమాసి పోతుందనే రాజకీయ ప్రచారం తీవ్రంగ చేయడంతో బీద మధ్యతరగతి రైతులు భూస్వాముల పలుకుబడినుండి విడిపోయి రైతు సంఘాలవైపు ఆకర్షించబడ్డారు. సమ్మె కమిటి పేదమధ్య తరగతి రైతుల చేల్లో పనులు ప్రారంభించాల్సిందని వ్యవసాయ కూలీలకు విజ్ఞప్తిచేసింది. సమ్మె కమిటి కోరినకూలి యివ్వడానికి అంగీకరించిన రైతుల చేల్లో కోతలు కోయడం కుప్పలువేయడం ప్రారంభ మయింది. కూలీలు అడిగినకూలి రేటు యివ్వ తిరస్కరించిన భూస్వాముల చేలు పాడుబడ్డట్లు కోతలుకోసి కుప్పలువేసే దిక్కులేక అలానే వుండిపోయాయి.

పాయలుతీసి రెండవపంటకు విత్తనాలు చల్లిన చేలల్లో పెసర, మినుము, జనుము, వులవమొక్కలు కత్తికి అందే ట్లుగ పెరిగిపోతున్నాయి. పండి ఒరిగినచేలు సకాలంలో కోతలు కోయనందున కంకిబాగా కుమిలిపోయి వెన్ను రాలి పోసాగింది. బాగా పంటపండినచేలు యీవిధంగ పాడుబడి పోవడంవల్ల భూస్వాముల్లో తీవ్రమైన ఆందోళన బయలుదే రింది. పొలాలు పాడుబడిపోయినప్పటికి కూలీలకోర్కెలు అంగీ కరించకూడదని బాపయ్య పట్టుబట్టాడు. పొలాలు పాడుబెట్టు కోడానికి బాపయ్య ముఠాలోని అధిక సంఖ్యాకులు అంగీ కరించడంలేదు. బాపయ్యమాటలు తిరస్కరించి సమ్మెకమి టీతో సంప్రదింపులు జరిపి కూలీలు అడిగిన కూలియివ్వ డానికి అంగీకరించడంతో బాపయ్యపని యిరకాటాన పడింది. కల్లుతాగి నిప్పులుత్రొక్కిన కోతిలాగ మతిపోయి తన పరువు మర్యాదలు మంటగలిసి పోయాయన్నట్లు చిందులేయడం, తన సహచరుల్ని తిట్టడం ప్రారంభించాడు.

ఇప్పటికే బాపయ్య పొలంలో చాలాభాగం ఎందుకూ పనికిరాకుండ పోయింది. కూలీల సమ్మెను సాకుగ తీసికొని బాపయ్యఅంటే గిట్టని గ్రామంలోని మున్సిఫ్‌కు చెందిన ముఠా బాపయ్య చేల్లో గొడ్లను పందుల్నితోలి మేపి వేయడం మొదలెట్టారు - కూలీల్లో చీలికలులేకపోతే, బీద రైతాంగం సహకారం భూస్వాములకు లభించకపోతే కూలి సంఘాన్ని అణగద్రొక్కడం దుస్సాధ్యమని సొంత అనుభవం ద్వారా బాపయ్య గ్రహించాడు. భవిష్యత్తులో కూలీలతో అవసరం బాపయ్యకు లేకుండావుంటే పంటానికైనా ఆయేటి

పంటలు పాడుబెట్టి వుండేవాడు. తనకున్న భూమి తనక్రిందే అట్టిపెట్టుకొని కులకాలం టే వ్యవసాయ కూలీలు లేనిదే తన వందల ఎకరాలు భూమిసాగుచెయ్యలేడు. 'తట్టతో వడ్ల, వడ్లతో తట్ట' అన్న సామెత బాపయ్యకు బాగా అనుభవమయ్యింది. వారిశ్రమశక్తిని కొల్లగొట్టే బాపయ్య ధనవంతుడయ్యాడు. ఆ వ్యసాయకూలీల న్యాయసమ్మతమైన హక్కులు బాపయ్య తిరస్కరించడానికి పూనుకుం టే తనపొలాలు బీళ్లుగ మారిపోవాల్సిందే. వ్యవసాయ కూలీలకోర్కెలు అంగీకరించాలి. లేకపోతే గ్రామాన్ని వదలి మరెచ్చటికైనా బాపయ్య వలసవెళ్ళిపోవాలి. రెండేమార్గాలు గత్యంతరం లేదు. ఇది బాపయ్య పరిస్థితి. విధిలేక వ్యవసాయ కూలీల న్యాయమైన కూలిరేటు యివ్వడానికి అంగీకరించాడు. బాపయ్య జీవితంలో మొట్టమొదటిసారిగ కూలీల ఐక్యఆందోళనా పోరాటం ముందర తలవంచాడు. ఐక్యతలోవున్న అపారమైన శక్తి పీడిత ప్రజలకు అర్థమయింది.

సమైకమిటి సమ్మె విజయవంతమైనట్లు ప్రకటించింది. అనేక గ్రామాలలోని వ్యవసాయ కూలీలు విజయోత్సవాలు జరుపుకున్నారు. పీడితప్రజల ఐక్యతలో దాగివున్న అపారమైన శక్తిని, బలాన్ని, తెలియజేసే నాటికలు, బుర్రకథలు యీ విజయోత్సవాల సందర్భంలో యువకులు ప్రదర్శించారు. వ్యవసాయకూలీల సమ్మె సందర్భంలో రైతు వ్యవసాయ కూలీల్లో ప్రదర్శితమైన ఐక్యతను సక్రమ భూసంస్కరణల ఆందోళనకు పునాదిగ పెట్టుకొని రైతు, వ్యవసాయకూలి సంఘాలు పనిచేయడం మొదలెట్టాయి.

వ్యవసాయపంటల ధరలు పెరగడంతో బాపయ్య మరింతగ డబ్బు సంపాదించి పెద్ద ధనవంతుడయ్యాడు - నాము, వడ్డీవ్యాపార పద్ధతులతో చుట్టుప్రక్కల గ్రామాల పేదప్రజలవద్దనున్న కొద్దిపాటి భూములు తాకట్లు పెట్టించు కొని అప్పులు తీర్చలేదనే నెపంతో ఆ భూములుకాస్త కాజే సాడు. ధాన్యంలో రాళ్ళు మట్టిగడ్డలుకలిపి అమ్మేవాడు. సుబ్బ య్యను చంపించడానికి చేసినప్రయత్నంతో బాపయ్య దుర్మార్గ స్వభావం వున్నతశిఖరాలు అందుకొంది. అనేకమందికి వుండ డానికి ఇండ్లస్థలాలు లేకుండ చేసాడు. భార్యలమెడల్లోని పుస్తె లుసహితం త్రెంచుకెళ్ళి బాకీలక్రింద జమకట్టుకున్నాడు. అంత పెద్దగ డబ్బు, పొలం సంపాదించినప్పటికి ఎప్పుడు ఏదో అశాం తితో బాధపడతాడు - ఆ ముఖంచూస్తే మిగతా రైతులకు ఎందుకు పొలాలు వుండిపోయాయా అని ఏడుస్తున్నట్లు కని పిస్తుంది. సామాన్యరైతు తెల్లగుడ్డలేసుకుని మంచి చెప్పులు తొడిగి పచ్చగ తిరుగుతుంటే ఓర్వలేడు. ఏదయిన వ్యవహారం మీద యింటికి సామాన్య ప్రజలువచ్చి పలకరించితే వాళ్ళు వచ్చిన అరగంటదాకా ఏసమాధానం చెప్పడు - వచ్చిన వాళ్ళు అలాగే నిలువుకాళ్ళమీద నిలబడి లోలోపల బూతులు తిట్టుకుంటు బాపయ్య సమాధానం కోసరం ఎదురుచూస్తు వుంటారు - బాపయ్య హృదయం బాగా మొద్దుబారిపోయింది - సంతోషం అనేది ఏలోకాన కన బడదు. ఆకలి కరువులతో అల్లాడే ప్రజల ఆర్తనాదాలకు అతని హృదయం ఎన్నడు కంపించేదిగాదు - దోపిడి విధా నంలో రాటుదేలడంతో బాపయ్య హృదయంకూడ రాయిలా

మారిపోయింది. ప్రజలంటే గొర్రెలమందఅని బాపయ్య అభిప్రాయం. పెద్ద పెద్ద ప్రదర్శనాలు, వూరేగింపులు చూచిన నాడు బాపయ్యకు నిద్రపట్టదు - ఊరేగింపుల్లో ప్రజల వుత్సాహాన్ని చూచి రెండు పూటలా తినడానికి తిండిలేని వాళ్ళకు యీశక్తి ఎక్కడనుండి వస్తుందా అని విస్తుపోయే వాడు. యీ అమాయక ప్రజలందరికి కమ్యూనిస్టులు పుల్లకల్లు పోయించి మజా ఎక్కించి భూస్వాములపైకి వుసికొల్పుతున్నారా అని ప్రజల వుత్సాహాన్ని నిద్రలో సహితం కలవరిస్తు అపుడపుడు మంచంమీదనుండి వెర్రికేకలువేస్తు క్రిందపడిపోయేవాడు. బాపయ్యకు బాగా బొజ్జ పెరిగింది. మానెడంత హైడ్రోసెల్లు బుడ్డకూడ దిగింది - నోట్లో పండ్లు చాలామట్టుకు రాలిపోయాయి. బాపయ్యకు ఎక్కువకాలం బ్రతకాలనిఆశ వయస్సు ముదిరినకొద్ది దైవభక్తి ఎక్కువయ్యింది. ఎక్కువ పాపాలు చేసేవాడు గొంతెత్తి పెద్దగ ప్రార్థనలాలాపించినట్లుగ బాపయ్య చివరిరోజుల్లో దైవపూజతో ఎక్కువ కాలం గడిపేవాడు.

పార్లమెంటరీ ప్రజాస్వామికం దేశంలోని దోపిడివర్గాల స్వార్థ ప్రయోజనాలు కాపాడడానికి వినియోగించుకోవచ్చుననే నమ్మకం బాపయ్యలో ఏర్పడింది. ఆ గట్టుపోయింది, యీ గనుము గదిమారు అనే ఫ్యూడల్ ఆలోచనలు, భూమిపైనుండి రాజకీయాలవైపు మరలించాడు- బాపయ్య ఏదో సరదాగా, పదవీ వ్యామోహంతోనో రాజకీయ రంగంలో దూకడానికి నిశ్చయించుకోలేదు. దేశంలో ఫ్యూడల్ భూస్వామిక విధానానికి వ్యతిరేకంగ ప్రజల్లో

నాటిన అభిప్రాయాలు బాగా గ్రహించాడు. తనలాంటి పెద్ద భూస్వాములు పార్లమెంటులోను శాసన సభల్లోను, ఎంత ఎక్కువమంది ఎన్నిక అయితే అంత మంచిదని బాపయ్య అభిప్రాయపడ్డాడు. ఎందుకంటే ప్రభుత్వమే ప్రజల కోర్కెలు అంగీకరించి ఏమైన భూసంస్కరణల చట్టాలు ప్రవేశపెడితే వాటిని తెరవెనుకనుండి ఆ చట్టాలకు వెన్నుపోటు పొడిచి అభ్యుదయ చట్టాలకు గోరీ కట్టవచ్చునని బాపయ్య నమ్మకం. తన భూస్వామ్యవర్గ హక్కుల్ని సంరక్షించుకోడానిక ప్రభుత్వ పార్టీ అయిన కాంగ్రెస్ పార్టీలో యాక్టివ్ సభ్యుడుగ బాపయ్య చేరాడు. నూతన ఖద్దరు వేషధారి అయిన బాపయ్య రాజకీయాల్లో ప్రవేశించడంతో రాజకీయాలకే తీరని అపకారం జరిగినట్లు చిత్తశుద్ధిగల దేశభక్తులు బాధపడ్డారు – ఆలాంటివాళ్ళను కాంగ్రెస్ పార్టీకి దూరంగ వుంచడానికి తమకు చేతకాక పోయిందనే దిగులుతో క్రుంగిపోయారు. దేశంలో జనరలు ఎన్నికలు జరుగుతాయని ప్రకటించబడింది. వివిధ రాష్ట్రాల్లో కాంగ్రెస్ పార్టీ అధికారాలు స్వీకరించిన తరువాత అధికారంలోకి రాబోయేముందు ప్రజల జీవితపరిస్థితులు మెరుగుపర్చడానికి ప్రజలకిచ్చిన వాగ్దానాలు నెరవేర్చలేక పోయింది. ప్రజలు తమ న్యాయమైన హక్కుల కోసరం వెలిబుచ్చిన అభిప్రాయాలు, చేసిన ప్రదర్శనాలు, జరిపిన పోరాటాలు తప్పుడుగ అర్థంచేసికున్నారు. పాలకవర్గ పార్టీనాయకులు శాంతిభద్రతలు నెలకొల్పడం పేరుతో అనేక వందలు, వేలు, రైతు, వ్యవసాయకూలి, కార్మిక నాయకుల్ని కార్యకర్తల్ని జైళ్ళపాలుచేశారు. అనేకమందిని ఎలాంటి

విచారణ జరపకుండ జైళ్ళలో నిర్బంధించింది. దేశంలోని పలుప్రాంతాల్లో ప్రజా సంఘాలను, కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది అనేక గ్రామాల్లో పోలీసు కాన్సెన్ట్రేషను క్యాంపులు నెలకొల్పి ప్రజలను విచ్చలవిడిగ చిత్రహింసలకు గురిచేసింది. వాక్, సభా, పత్రికా స్వాతంత్ర్యాలు మంటగలిసి పోయాయి. పౌరసత్వహక్కులు నామమాత్రంగవుండి పోవడంతో ప్రజలు తమ ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని బ్రతకాల్సి వచ్చింది. కమ్యూనిస్టు వుపద్రవాన్ని అణచడం పేరుతో ఒక్క ఆంధ్ర తెలంగాణరాష్ట్ర ప్రాంతాల్లోనే కాంగ్రెస్ ప్రభుత్వం వేలమంది కార్యకర్తల్ని తుపాకులతో కాల్చి చంపివేసింది. మరికొన్ని వేల మందిని జైళ్ళలో నిర్బంధించింది. ప్రభుత్వ యంత్రాంగంలో బంధుప్రీతి, ఆశ్రిత పక్షపాతం, అవినీతి, లంచగొండితనం యీకాలంలోనే బాగా పెచ్చుపెరిగిపోయాయి. ఆకలి కరువులతో చాలీ చాలని రేషనింగుతో ప్రజలు నానాయిక్కట్లుకు గురి అయ్యారు. దొంగ వ్యాపారం లంచగొండితనం విచ్చలవిడిగ సాగడంతో ప్రజల జీవితం దుర్భరంగ తయారయింది. 1952 జనరలు ఎన్నికలు సమీపించేకొలది రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని ప్రజానాయకులపై జారీచేసిన వారంట్లు నిర్బంధాలు రద్దు చేయాలని రైతు, వ్యవసాయకూలి, కార్మిక తదితర ప్రజానీకం పెద్ద పెద్ద ప్రదర్శనాలు, ఆందోళన చేయడంతో ప్రభుత్వం ప్రజల వొత్తిడికి లొంగిపోయి కమ్యూనిస్టుపార్టీ రైతు వ్యవసాయకూలి కార్మికసంఘాల్లో పనిచేసే నాయకులు, ప్రముఖ కార్యకర్తలపై నిషేధాజ్ఞలు రద్దుచేసింది. రాజకీయ

ఖైదీలలో అందరిని కాకపోయినప్పటికి అధిక సంఖ్యాకుల్ని జైళ్ళనుండి విడుదల చేయక తప్పలేదు. అన్ని రాజకీయ పార్టీలకు ప్రజలు పౌరసత్వ హక్కులకోసరం సాగించిన పోరాటాల ఫలితంగ ఎన్నికల్లో పోటీచేసే అవకాశం లభించింది. ప్రజలకు మొదటిసారిగ తమకునచ్చిన రాజకీయ పార్టీకి ఓటు చేసుకునే అవకాశం లభించింది. ఇది ఒకరకంగ ప్రజలు పరిపూర్ణమైన ప్రజాస్వామికం కోసరం సాగించే పోరాటాన్ని ప్రస్తుతమున్న పార్లమెంటరీ పద్ధతులద్వారా యీ ఓటు హక్కుతో కొంతవరకు సాధించుకోవచ్చు ననడంలో ఎలాంటి సందేహం లేదు. ప్రభుత్వం ఆశించినట్లు తను ప్రయోగించిన నిర్బంధహింసా విధానాలద్వారా ప్రజాభిప్రాయం అణచివేయ బడలేదు. అతివాదపార్టీ అయిన కమ్యూనిస్టు పార్టీబలం పలుకుబడి వూహించలేనంతగ పెరిగిపోయింది. దీనికితోడు పార్టీ రాజకీయ విధానాలు కార్యక్రమం ఎక్కువ ప్రజలను ఎర్రజెండా క్రిందికి సమీకరించుకోడానికి అవకాశమిచ్చే విధంగ రూపొందించబడ్డాయి. పార్టీకి బహిరంగ ప్రచారంచేసి బ్రహ్మాండమైన ప్రజావుద్యమాలు నిర్మించి రాజకీయాధికారాన్ని స్వీకరించడానికి దేశంలో నూతన అవకాశాలు మార్గాలు ఏర్పడ్డాయి. వాస్తవానికి ఎన్నికలు, పార్లమెంటరీ ప్రజాస్వామికం పెట్టుబడిదారీ దేశాల్లో ఒక తంతుగ తయారయింది. దోపిడి వర్గాల ప్రయోజనాలు రక్షించుకునేవిధంగ ముందుగానే రాజ్యాంగ చట్టాలలో తగిన బందోబస్తు చేసుకుంటారు. వాళ్ళ దోపిడీ వ్యవస్థను ఆపద సమయంలో సంరక్షించుకోడానికి శాంతి భద్రతల రక్షణపేరుతో ప్రజలు యిచ్చిన ధనంతో

విపరీతమైన మిలటరీని సమకూర్చుకుంటారు. ఆ మిలటరీతో ప్రజల హక్కులు నాశనం చేయడానికి ఎలాంటి నీతినియమాలు లేకుండ పూనుకుంటారు. మన దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామికం సాఫిగ అభివృద్ధి చెందడానికి ఇండియన్ యూనియన్ అధ్యక్షునికి, రాష్ట్రాలలోని గవర్నర్లకు యిచ్చిన విశేష అధికారాలు తీవ్రమైన ప్రతిబంధకాలుగ వున్నాయి - అయినప్పటికి పార్లమెంటు శాసన సభలద్వారా ప్రతిపక్షాలు ప్రజల హక్కుల్ని చాలావరకు కాపాడడానికి అవకాశాలు వున్నాయి. ప్రజలు ప్రజాస్వాకం కోసరం, ఆర్థిక సాంఘిక న్యాయాలకోసరం బయట ప్రజా వుద్యమాలద్వారా సాగించే పోరాటాలకు బహుళ ప్రచారం సంపాదించ డానికి శాసన సభలు, పార్లమెంటు తోడ్పడతాయి.



# 8

అజ్ఞాతవాస జీవితం గడుపుతున్న వెంకటరత్నం, జగ్గయ్య, శ్రీనివాసరావు సూర్యావతులపై అరెస్టు వారంట్లు రద్దుచేయడం తో ప్రజలమధ్య స్వేచ్ఛగ తిరుగుతు ప్రజాసేవ చేసే అవకాశం లభించింది. వెంకటరత్నం అధ్వర్యాన ఒక కమిటి ఏర్పాటుచేసి ఎన్నికల్లో పాల్గొని విజయాన్ని సాధించడానికి నిర్ణయించారు. భూసంస్కరణల అమలు, దేశాన్ని సామ్రాజ్యవాదుల పలుకుబడినుండి రక్షించి పారిశ్రామిక వంతం చేయవలసిన అవసరం, నిరుద్యోగ సమస్య నిర్మూలన లాంటి ప్రధాన కీలకసమస్యలపై ఎన్నికల ప్రచారంలోకి దిగారు. ఎన్నికల్లో పాల్గొనాలనే వుత్సాహం ప్రజల్లో ఎక్కువయ్యింది. పెద్ద పెద్ద భూస్వాములు జమీందారులు కాంగ్రెస్ పార్టీ టిక్కెట్టు సంపాదించి ఎన్నికల్లో నిలబడడానికి తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నారు. బాపయ్యకు రావాల్సిన కాంగ్రెస్ టిక్కెట్టు మరో జమీందారు కాజేసాడు. అందువలన మరో నియోజక వర్గంలో కాంగ్రెస్ తోడ్పాటుతో స్వతంత్ర అభ్యర్థిగ ఎన్నికల్లో నిలబడడానికి నిర్ణయించు కున్నాడు. అదే నియోజకవర్గంలో కమ్యూనిస్టుపార్టీ జగ్గయ్యను బాపయ్యకు వ్యతిరేకంగ పోటీపెట్టడానికి నిర్ణయించింది. ఒకపుడు తన పాలేరు తనతో పోటీగ నిలబడడం బాపయ్య పెద్ద నామోషిగ భావించి బాధపడ్డాడు. ఆర్థిక స్తోమతలేని జగ్గ

య్యాను వేలురూపాయలు ఎన్నికల్లో ఖర్చుపెట్టి తేలిగ్గా ఓడించగలనని సంతోషపడ్డాడు బాపయ్య. పోతే నారాయణ రావు పార్లమెంటుకు కాంగ్రెస్ టిక్కెట్టుపై పోటీకి నిలబడ్డాడు - అదే స్థానంలో ప్రసాదును తన అభ్యర్థిగ పార్టీ నిర్ణయించింది. అబ్బా కొడుకులమధ్య ఎన్నికలపోటీ బహుళ జనాన్ని ఆకర్షించింది. నారాయణరావు గుమస్తా బాపయ్య నియోజక వర్గంలో ప్రధానరాజకీయ వుపన్యాసాలు యివ్వడానికి నెలకు వందల రూపాయల జీతంమీద మూడు నెలల వరకు నియమించబడ్డాడు. భూస్వాముల ఎన్నికల ప్రచారం ఎలా వుంటుదో తెలుసుకో గోరేవారు తప్పకుండ నారాయణరావు గుమస్తా వుపన్యాసం విధిగవినాల్సి వుంటుంది. పచ్చిఅబద్ధాలు ప్రచారం చేయండంలో అందెవేసినచేయి గుమస్తా రామాచారి. రామాచారి వుపన్యాసాల్లోని కొన్ని మచ్చుతునకలు.

సోదర సోదరీ మణులారా,

"బాపయ్యమీాద పోటీకి తలపడ్డ పార్టీకి దేవుడుమీద నమ్మకంలేదు. దేవుడు లేకపోతే మనమంతా ఏలాపుట్టాము. పార్టీవాళ్ళు అధికారంలోకివస్తే దేవాలయాలు పడగొడతారు. ముసలాళ్ళను చంపుతారు .. దౌర్జన్యం హింసలంటే వాళ్ళకు బహుసరద - లెనిన్ అనే ప్రపంచ కమ్యూనిస్టు నాయకుడు ఏమిచెప్పాడో తెలుసా? ప్రతి దేశంలోను కార్మిక నియంతృత్వప్రభుత్వాలు స్థాపించమన్నాడు. "లెనిన్ కార్మిక వర్గ నియంతృత్వాన్ని నొక్కి-వ్రాసిన ఒక ఇంగ్లీషు పుస్తకం లోని కొన్ని వాక్యాలు రామాచారి చదివి యీా క్రింది

విధంగ వక్రభాష్యం చేయడం మొదలెట్టాడు. "కార్మికులంటే ఎవరో తెలుసా? మన మాదిగ గూడెంలోని కొండాయి, మాలపల్లెలోని జగ్గాయి. పార్టీవాళ్ళు చెప్పే కార్మికులంటే వీళ్ళు - రేపు పార్టీవాళ్లు అధికారంలోకివస్తే మాదిగ కొండాయి. మాల జగ్గాయి మనదేశానికి మంత్రులవుతారన్న మాట - వాళ్ళు కుర్చీల్లో కూర్చుంటే మనం చేతులు కట్టుకొని వాళ్ళముందర నిలువుకాళ్ళమీద నిలబడి అయ్యా బాబు అంటు వాళ్ళచేత పరిపాలించ బడాలన్న మాట. పోతే మన బాపయ్యవిషయం మీకు తెలియనిదికాదు - అనేక సంవత్సరాలనుండి వేల రూపాయలు వడ్డీకి, వందలబ స్తాల ధాన్యం నాముకుయిచ్చి పేదప్రజల్ని కరువు మాసాల్లో బ్రతికించి పుణ్యాం కట్టుకున్నాడు. రైతు స్వామ్యాన్ని రక్షించడానికి తన లాభాలు విడనాడి రాజకీయ రంగంలో దూకిన ప్రజాసేవా పరాయణుడు. కమ్యూనిస్టులు అధికారంలోకి వస్తే భూములు పంచుతామని బహిరంగంగానే చెపుతున్నారు. - అసలు కొంతమంది చేతుల్లోవున్న భూములు తీసి వుమ్మాయికి జగ్గాయికి పంచు తామనడం ఏమిన్యాయం. అసలు దేశంలో వున్న భూమి ప్రతివాళ్ళకు పంచితే మనిషికి అరఎకరంకూడ రాదు. అంటే ఒక ఎకరంవున్న ఆసామికూడ తనకున్న ఎకరంలో అర ఎకరం వీళ్ళు అధికారంలోకి వస్తే పోగొట్టు కోవాల్సి వస్తుందన్నమాట. అందువలన మాజీ పాలేరు జగ్గాయిని ఓడించి బాపయ్యను గెలిపించాల్సిందిగ ప్రార్థించు చున్నాను"

కాంగ్రెస్ పార్టీ టిక్కెట్లు సంపాదించిన భూస్వాములు కాంగ్రెస్ దేశాభివృద్ధికి సూచించిన ఎన్నికల ప్రణాళికలోని ముఖ్యాంశాలు ప్రక్కకు నెట్టివేసి చవకబారు కమ్యూనిస్టు వ్యతిరేకతతో ప్రజల్లోవున్న వెనకబడిన తత్వాన్ని అజ్ఞానాన్ని తమ స్వార్థ ప్రయోజనాలకు వినియోగించుకొని ఎన్నికల్లో గెలవాలని విచ్చలవిడిగ బూటకు ప్రచారంతోను, డబ్బుల సంచులతోను, గ్రామాలమీద బడ్డారు. బాపయ్య నియోజకవర్గంలో అరడజను కార్లు తిరిగేవి – ప్రచారకులంతా కూలిడబ్బులకు పనిచేసేవాళ్ళే – వూరేగింపుకుకూడ మనుషులు దొరికేవాళ్ళుకాదు. యీ ప్రచారకుల్లో కొంతమంది బాపయ్య డబ్బుతింటు రహస్యంగ పల్లెలకుపోయి జగ్గయ్యకు ఓటు చేయమని ప్రచారం చేసేవాళ్ళు.

జగ్గయ్య నియోజకవర్గంలో పార్టీ ప్రచారం నిరాడంబరంగా వుండేది. కార్యకర్తలంతా యింటింటికి తిరిగి ఓటర్లను కలుసుకొని పార్టీ ప్రణాళిక ప్రచారం చేయడం, గ్రామగ్రామాన మేగాఫోనుతో ఆడంబరంలేకుండ బహిరంసభలు పెట్టడం, నాటికలు, బుర్రకధలు ప్రదర్శించడంతో ప్రజలను విశేషంగ ఆకర్షించేవారు. ఇతర పార్టీలమీద దూషణకన్న ప్రజలకు రాజకీయాలుచెప్పి వారిని చైతన్యవంతులుగ చేయడం ప్రధాన కర్తవ్యంగ భావించారు. వందలు వేల సంఖ్యలో రైతు వ్యవసాయ కూలీలు వూరేగింపుల్లో పాల్గొని రామ దండుల్లాగ ఒక గ్రామంనుండి మరోగ్రామంపోతు ఎక్కువమంది ప్రజల్లో డబ్బు ఖర్చుకాకుండ ఎన్నికల ప్రచా

రంలోకి దుమికారు. ముప్పయివేలకుపైగా హాజరయిన ఒక బహిరంగసభలో ఓటర్ల నుద్దేశించి జగ్గయ్య యిలా ప్రసంగించాడు.

సోదరీ సోదరులారా,

మనదేశం ముఖ్యంగ వ్యవసాయకదేశం - డెబ్బయి మందికిపైగా వ్యవసాయమేతమ ప్రధాన వృత్తిగ చేసికొని జీవనంచేస్తున్నారు - అయితే పొలాల్లో కష్టించి ధాన్యరాసులు పండించే వ్యవసాయకూలి పేదరైతుల చేతిలో భూమి లేకుండ పోయింది - వందలు వేలఎకరాలు వ్యవసాయంఅంటే ఏమిటో తెలియని ఫ్యూడల్ భూస్వామ్య దోపిడి వర్గాల చేతుల్లో భూములు వుండిపోయాయి. నూటికి నలభయినుండి ఏభయిదాకావున్న వ్యవసాయ కూలీలచేతిలో భూమిలేదు. దీనిఫలితంగ వ్యవసాయ వుత్పత్తి దెబ్బతిని తిండిగింజలకోసరం విదేశాలమీద ఆధారపడాల్సి వస్తుంది. గ్రామీణ ప్రాంతాల్లోని పేదప్రజల జీవిత పరిస్థితులు బాగుపడాలంటే కుటుంబ ప్రాతిపదికపై భూమికి గరిష్ట పరిమితి నిర్ణయించి ఆపైబడ్డ భూమిని భూమిలేని పేదప్రజలకు పంచాలి. యీ వ్యవసాయ సంస్కరణలు గ్రామీణ ప్రజానీకపు దరిద్రాన్ని పోగొట్టడానికి, దేశాన్ని పారిశ్రామిక వంతంగచేసి విదేశీయులపై ఆధార పడకుండ వుండడానికి సర్వరోగ నివారిణి వంటివి. దీనికి ముందు ప్రభుత్వ అధీనంలోను భూస్వాముల ఆక్రమణలోను వున్న లక్షల ఎకరాలు బంజరు వ్యవసాయ కూలీలకు వుచితంగా పంచాలి. సంవత్సరంలో అన్నిరోజులు వ్యవసాయ కూలీలకు పనులు కల్పించాలి. వారికి న్యాయమైన కూలిరేటు

అమలు జరిగేలాగ శాసనం చేయాలి. జమిందారులకు మాజీ సంస్థానాధిపతులకు యిస్తున్న కోట్లకొలది రూపాయల భరణములు ఆపివేసి ఆ డబ్బుతో దేశంలో వ్యవసాయాన్ని పరిశ్రమల్ని అభివృద్ధి చేయడానికి, ప్రాజెక్టులు ఉక్కు కర్మాగారాలు మొదలైనవి నిర్మించాలి. చైనా రష్యాలాంటి సోషలిస్టు దేశాలతో వర్తక వాణిజ్య సంబంధాలు పెంపొందించుకొని శాంతికోసరం, సోషలిజం కోసరం పోట్లాడాలి. అంటరానితనం ఏరూపంలో వున్నదాన్ని సర్వనాశనంచేసి వర్ణాంతరవివాహాలను ప్రోత్సహించి, వెనుకబడినకులాల,వర్గాల ప్రజల అభివృద్ధికి పాటుపడాలి. రైతుల్ని ఋణభారాన్నుండి విముక్తి చేయాలి. న్యాయమైన కౌలురేటు నిర్ణయిస్తు శాసనం తెచ్చి ఆ శాసనం కౌలుదార్ల పక్షాన ప్రభుత్వం నిలబడి అమలు పరచాలి - రైతులపై మోయలేని శిస్తులభారం తగ్గించడానికి కలవారిపై పన్నులు అధికం చేయాలి. రైతులకు ఎరువులు, మంచి విత్తనాలు, వ్యవసాయ పనులకు కావాల్సిన యితర అప్పులు ప్రభుత్వం సకాలంలో మంజూరు చేయాలి. భూస్వాముల వద్దనున్న ధాన్యం ప్రభుత్వం స్వాధీనం చేసికొని కరువు మాసాల్లో చౌకడిపోల ద్వారా ప్రజలకు ధాన్యం సరఫరా చేయాలి. యీపనులన్నీ నెరవేర్చగలిగింది మాపార్టీ ఒక్కటేనని మీకు మనవి చేస్తున్నాను- అందువలన నామలు నడ్డీవ్యాపారం వృత్తిగ పెట్టుకొని ప్రజలను దోపిడిచేసే బాపయ్యను చిత్తుగ ఓడించాలని మీకు విజ్ఞప్తి చేస్తున్నాను.

ఎన్నికలు దగ్గరపడేకొలది బాపయ్య ఓటమి ఖాయమనే మాట ఎక్కడబడ్డా వినబడుతుంది. పరాజయం తప్పదని

తెలుసుకున్న బాపయ్య ముఠా బ హి ర ం గ స భ లు సమావేశాలు జరక్కుండా అల్లరిచేయడం, పీలుచిక్కినచోట దౌర్జన్యాలు చేయడం మొదలెట్టారు. దింపుడు కళ్ళెం ఆశగ వేల రూపాయలుపెట్టి ఓట్లుకొని విజయాన్ని సాధించాలని రేయింబవళ్లు నిద్రాహారాలుమాని తిరుగుతున్నారు.

ఎన్నికలనాడు బాపయ్యముఠా దౌర్జన్యం అవినీతి పద్ధతులు పరాకాష్ట నందుకున్నాయి. తమకు ఓటుచేయరని తేలిపోయిన ఓటర్లను బందిలిదొడ్లో పెట్టి నిర్బంధించి ఓటు చేసేహక్కు లేకుండ కొందరిని చేసారు. డబ్బు నీళ్ళప్రాయంగ విరజిమ్మి ఓట్లు బయటకు తెప్పించి తమ పెట్టెల్లో వేసుకు న్నారు. జగ్గయ్య పోలింగ్ ఏజంట్లకు బాపయ్యకు బాగా బలం వున్న గ్రామాలోకి రాకుండ వెళ్ళగొట్టారు.

బాపయ్య విజయం కోసరం తినరాని గడ్డంతా తిన్న ప్పటికి ఫలితం దక్కలేదు - జగ్గయ్య పెద్ద మెజారిటీతో గెలవడమేగాక బాపయ్యకు డిపాజిట్టుకూడ గల్లంతు అయి పోయింది. అబ్బా కొడుకులైన నారాయణరావు, ప్రసాదుల మధ్య జరిగిన పోటీలో తండ్రి ఓడిపోయి కుమారుడు గెలిచాడు. జగ్గయ్య, ప్రసాదుల విజయం రైతు, వ్యవసాయకూలి ప్రజల ఘనవిజయము - భూస్వామ్యవర్గాలకు గొడ్డలిపెట్టు- ప్రభుత్వ అభివృద్ధి నిరోధక విధానాలు, హింసాకాండతో కూడిన నిర్బంధవిధానాలు సరయినవి కావని ప్రజలు తీర్పుయిచ్చారు. ప్రభుత్వానికి కనువిప్పుగ యీ.ఎన్నికల ఫలితాలు తోడ్ప డ్డాయి.

జగ్గయ్య, లీల చాలాకాలంనాడే పెండ్లి చేసికోవాలని నిర్ణయించుకున్నా, జగ్గయ్య అజ్ఞాత జీవితం గడపడంవలన పెండ్లి చేసికోవడం పడలేదు. వీరిద్దరిమధ్య వివాహానికి తేది నిర్ణయమైనది. పెండ్లి సందర్భాలలో పల్లెల్లో అనేక మూఢాచారాలు, అనాగరికత పద్ధతులు మన్నించాల్సి వుంటుంది. పల్లెల్లోని పెద్దలకు కల్లు సారాయి విధిగ త్రాగబోయించి మంచి మాంసంతో భోజనాలు పెట్టాలి. పెండ్లిరోజు ఎంత బీద వాడయిన పల్లెలోనివారికి భోజనాలు పెట్టాలి. మరికొన్ని పల్లెల్లో తప్పనిసరిగ పందుల్ని వేటపోతుల్నికోసి భోజనాలు పెట్టాలి. ఎవరయిన పెట్టనని తిరస్కరిస్తే వారిని కులంనుండి బహిష్కరిస్తారు - భావిలోనీళ్ళు తోడనీయరు - ఇసుగు పొసుగు, పుట్టకుండ జేస్తారు. పెండ్లిరోజున పందికట్నాలు కట్టుగొయ్య పన్నులాంటి పన్నులు వసూలుచేస్తారు. యీ డబ్బు పల్లెలోని పెద్దలు ఎక్కువభాగం తినేస్తారు. కులపెద్దల అంగీకారం లేకుండ అనాగరిక సాంప్రదాయాలు తిరస్కరించి ఎవరయిన పెండ్లి చేసికుంటే ఆలాంటిపెండ్లి సంఘం గుర్తించకుండ ఆజ్ఞ విధిస్తారు. పల్లెలోకి కాంగ్రెస్ కమ్యూనిస్టు రాజకీయాలువెళ్ళి కొంత చైతన్యం తెచ్చినమాటవాస్తవమే. అయినప్పటికి సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగ పెద్ద ఎత్తున ప్రచారంచేసి వారిని విజ్ఞానవంతుల్నిగ చేయాల్సిన పవిత్ర బాధ్యత ఎంతయినవుంది. పెండ్లిరోజున మేళతాళాలులేకుండ అధిక సంఖ్యాకులు పెండ్లికి యిష్టపడరు. యీ దుబారా ఖర్చులకు కావాల్సిన డబ్బంతా పల్లెలోని పేదవారు భూస్వాములవద్ద విపరీతమైన,వడ్డీలకు అప్పు తేస్తారు.

పెండ్లిఅయిన మరుసటిరోజునుండే యీ అప్పులు తీర్చుకోవాల్సిన బాధ్యత నూతన వధూవరులపై బడుతుంది. అప్పులు తీర్చడంతో సతమతమయిపోయి నూతనసంసార జీవితంలోని సుఖమంటే ఏమిటో తెలియక క్రుంగి కృసించిపోతుంటారు. పెండ్లికి అయిన అప్పు తీర్చడానికి పది సంవత్సరాలు భూస్వాములవద్ద పాలికాపుతనం చేసిన ఘటనలు కొల్లలుగ పల్లెల్లో దొరుకుతాయి.

పాతపద్ధతులన్నిటిని ఎదిరించి నవీనపద్ధతులతో తమ వివాహాన్ని జరిపించుకోడానికి జగ్గయ్య లీలలు నిర్ణయించుకున్నారు. దీనితో కులపెద్దలకు కష్టంకలిగి బాధ్యుడయిన జగ్గయ్యే సంఘాచారాల్ని మంటగలుపుతున్నాడని ప్రచారం లేవదీసారు. జగ్గయ్య వీరిని అతికష్టంమీద వొప్పించి పల్లెలో ఐక్యత చెడకుండ కాపాడాడు. వెంకటరత్నం, లీల జగ్గయ్యలకు వివాహంచేశాడు. పీడితప్రజల విముక్తికోసరం పాటుపడుతు ఒకరినొకరు ప్రేమించుకుంటు ఆదర్శ కుటుంబజీవితాన్ని గడుపుతామని వధూవరులిద్దరు ప్రమాణాలుచేసి పూలదండలు వేసికున్నారు. పెండ్లి అయిపోయింది. స్నేహితులు పుస్తకాలు చదివించారు. పెండ్లికి వచ్చినవారందరికి జగ్గయ్య కాఫీయిచ్చి గౌరవించాడు.

సుబ్బయ్యను ప్రభుత్వం క్రూరంగా కాల్చి చంపిన తరువాత ఆయన జ్ఞాపకార్థం ప్రజలు పెద్ద స్థూపాన్ని నిర్మించుకున్నారు. స్థూపంపై సుబ్బయ్య జీవితవిశేషాలు పాలరాతిమీద చెక్కారు. ప్రతి సంవత్సరం మృతవీరుని వార్షి

కోత్సవాలు ప్రజలు అమిత శ్రద్ధాభక్తులతో జరుపుకుంటు న్నారు. సుబ్బయ్య హత్యకు ముఖ్యకారకుడయిన బాపయ్య ఎన్నికల్లో ఓడిపోయినతరువాత జరగబోయే యీ మృతవీరుని వార్షికోత్సవానికి ప్రత్యేక ప్రాముఖ్యతవుంది. ప్రజాకంటకుడు బాపయ్యను ఓడించిన సంతోషం ప్రజల్లో వర్ణించడానికి అలవిగానిదిగ వుంది. ఆటలపోటీలు, వైజ్ఞానిక ప్రదర్శనలు ఏర్పాటుచేయబడ్డాయి. వార్షికోత్సవంనాడు వందల గ్రామాల నుండి ప్రజలు ప్రభలుకట్టుకొని మేళతాళాలతో వూరేగింపులు చేసికుంటు మృతవీరుని ఆశయాలు సిద్ధించాలంటు నినాదాలు యిచ్చుకుంటు రెపరెపలాడే ఎర్రజెండాలతో స్థూపాన్ని సమీపించి సుబ్బయ్యకు శ్రద్ధాంజలి ఘటించారు. వందలకొలది పూలమాలలు సమాధిపై నుంచి సుబ్బయ్యకు జోహారు లర్పించారు. ఆ వార్షికోత్సవంలో పాల్గొన్న ప్రతివారు నూతన వుత్సాహం, కార్యదీక్ష, త్యాగపటిమ యినుమ డించి సుబ్బయ్య ఆశయాలు నెరవేరేవరకు విశ్రమించకూడ దని శపథం పూని వెళ్లిపోయేవారు. చరిత్ర ప్రసిద్ధిగన్న పెద్ద పెద్ద తిరణాళ్ళను సైతము యీ వార్షికోత్సవం తలదన్ని వేసింది. ఇసుకవేస్తే రాలని జనం – ఎక్కడ చూచిన భజనలు– కోలాటాలు – నాటకాలు – రాజకీయ హరికథాకాలక్షేపాలు– బహిరంగసభలో మిన్నుముట్టే హర్షధ్వానాలమధ్య సుబ్బయ్య తలిదండ్రులు, భార్య అక్కడచేరిన వేల్యప్రజలకు పరిచయం చేయబడ్డారు. వేదికపై వారిని ప్రత్యేకంగ గౌరవించారు. బహిరంగసభలో సుబ్బయ్య ఆశయాలు నెరవేర్చడానికి ప్రజ లంతా పట్టుదలతో పనిచేయాలని వెంకటరత్నం ప్రసంగించాడు.

తరువాత సూర్యావతి ఆటలు వైజ్ఞానిక ప్రదర్శనలలో గెలుపొందినవారికి బహుమతులు పంచిపెట్టింది.

జనరలు ఎన్నికలలో తండ్రితో పోటీచేసిన నాటినుండి ప్రసాదుపని పెద్ద యిరకాటాన పడింది. నారాయణరావు అన్నిరకాల ఆర్థిక ఆంక్షలుపెట్టి ప్రసాదుకు డబ్బుదొరక్కుండ అనేకబాధలకు గురిచేయడం మొదలెట్టాడు. ఆర్థికవిషయాల్లో తండ్రితో తెగతెంపులు కాకపోవడంతో కొందరు సామాన్య ప్రజలలో పార్టీవ్యతిరేకులు ప్రసాదునుగూర్చి తప్పుడు ప్రచారం చేస్తున్నారు.

నారాయణరావు దొంగవ్యాపారం, వడ్డీవ్యాపారం చేసి లాభాలు గడించడంలో ఘటికుడు. ప్రసాదుకు మైనరు వెళ్లినప్పటికి అతనికి రావాల్సిన వాటా యివ్వడానికి తండ్రి తిరస్కరిస్తువచ్చాడు. తండ్రిచాటున దాగి పరోక్షంగ తండ్రి దొంగవ్యాపాన్ని వడ్డీవ్యాపారాన్ని ప్రోత్సహించి ఆ వచ్చే లాభాలలో తనవంతు లాభాలుకూడ తండ్రిచాటున పెంచుకుంటు, ఆర్థికంగ త్యాగపటిమ చూపించకుండ, శ్రమదానంతో పార్టీపనిలో సంతృప్తి వెలిబుచ్చుతు లౌకికంగ వ్యవహరిస్తున్నాడనే పార్టీ వ్యతిరేకుల వాదనలు బజారున పడ్డాయి. ప్రజా వుద్యమాలకు అపకారం కలుగచేసే యీ అవాస్తవిక అల్లరి ప్రచారానికి తావు యివ్వకుండడానికి ప్రసాదు నిర్ణయించుకున్నాడు. ప్రసాదు తనకురావాల్సినవాటా సౌమ్యమైనపద్ధతులతో యివ్వడానికి తండ్రి తిరస్కరించడంతో వాటా పంచుకోడానికి గట్టి చర్యలకు పూనుకున్నాడు.

దీనితో నారాయణరావు లొంగివచ్చాడు. గత్యంతరంలేక ఏడుస్తు లక్షరూపాయల ఆస్తి పంచియిచ్చాడు. ప్రసాదు తనకు లభించిన లక్షరూపాయల ఆస్తిలో తొమ్మిదివంతులు పార్టీనిధుల క్రింద జమకట్టివేసాడు. ఒక హూలింయింట్లో నిరాడంబర జీవితాన్ని సాగిస్తు కార్మికవర్గపార్టీ మన స్తత్వం అలవరచుకొని పేదప్రజలకు సేవచేస్తున్నాడు. ప్రసాదు కాలేజిలో చదువుకునే రోజులలోనే శారద అనే ఒక హరిజన అమ్మాయిని ప్రేమించాడు. శారద ఆరోజులలో ఇంటర్ చదువుతుండేది. జగ్గయ్యకు దూరపు చుట్టం. శారదను పెండ్లి చేసుకుంటానని ఆరోజులలోనే ప్రసాదు మాటయిచ్చాడు. ప్రసాదు రాజకీయాలలో ప్రవేశించి అజ్ఞాత జీవితానికి పోవాల్సి రావడంతో వీరిద్దరిమధ్య కొన్ని సంవత్సరాలవరకు వుత్తర ప్రత్యుత్తరాలుకూడ లేకుండాపోయాయి. శారద కష్టపడి బి. ఏ. ప్యాసు అయి ట్రయినింగుకూడ చదువుకొని ఒక టీచరుగ పనిచేస్తూంది. తరువాత కొన్నిదినాలకు ప్రసాదు శారదల మధ్య ఆదర్శప్రాయమైన వర్ణాంతర వివాహం జరిగింది. యీ వివాహానికి ప్రముఖ రాజకీయనాయకులు, వర్ణాంతర వివాహాలకు ఆచరణద్వారా బీజాలు నాటిన గోపరాజు రామచంద్రరావు లాంటి ప్రముఖ సంస్కరణవాదులు, భూదానోద్యమ నాయకులు శుభాసీస్సులు అందజేసారు. భూకమతాలకు గరిష్టపరిమితి నిర్ణయించి ఆ పరిమితికి పైబడ్డ భూములు వ్యవసాయకూలీలకు తదితర గ్రామీణ పేద ప్రజాకానికి పంచాలనే వుద్యమం దేశంలో బాగా బలపడి

అన్ని రాజకీయపార్టీల ప్రజాపుద్యమాల ఆమోదాన్ని అండ దండల్ని పొందింది.

తెలంగాణాలో వ్యవసాయకూలీలు రైతులు కమ్యూ నిష్టుపార్టీ నాయకత్వాన భూమి పంపకంకోసరం సాగించిన సాయుధపోరాటం తరువాత యీ భూసంస్కరణల అవసరం దేశంలోని అన్ని రాజకీయపార్టీల దృష్టిలో తీవ్రంగ కనబడింది. భూమిమీద కష్టించి పనిచేసే ప్రజలలో భూమికోసరం వున్న దాహాన్ని అర్థంచేసికున్నారు. తెలంగాణ పోరాటంతరువాతనే వినోబాభావే నాయకత్వాన బయలుదేరిన భూదానోద్యమం బహుళ ప్రచారంలోకి వచ్చింది. యీ భూదానోద్యమాలు భూమికోసరం పోట్లాడుతున్న వ్యవసాయకూలీలకు నైతిక బలాన్ని పట్టుదలను ప్రసాదించాయి. చైనాలో కమ్యూనిష్టు ప్రభుత్వం భూసంస్కరణలు జరిపిన తీరు, ఆహారసమస్యను నిరుద్యోగాన్ని పారద్రోలి కార్మిక కర్షకప్రజలకు సోష లిజాన్ని నిర్మించిన పద్ధతులు మనదేశంలోని ప్రజల్లో నూతన చైతన్యాన్ని వుత్సాహాన్ని రేకెత్తించాయి. ప్రభుత్వం విధి లేక తానుకూడ భూ సంస్కరణలు అమలు జరపబోతున్నట్లు ప్రకటించుకోవాల్సి వచ్చింది.

అసెంబ్లీ ఎన్నికల్లో ఓడిపోయిన బాపయ్య పంచా యితీ ఎన్నికల్లో ఎలాగయిన గెలిచి పంచాయితి అధ్యక్ష పదవి నిలుపుకోవాలనే పట్టుదల ఎక్కువయ్యింది - పదిహేను సంవత్సరాలుగ గ్రామ పంచాయితీకి బాపయ్య అధ్యక్షుడు. స్థానికంగవున్న కోఆపరేటివు బ్యాంకుకూడ బాపయ్య చేతు

ల్లోనేవుంది. పంచాయితీడబ్బు కొన్ని వేలరూపాయలు దుర్వి నియోగపరచి లాభాలు గడించాడు. గ్రామానికి సరయిన రోడ్లు లేవు - మెటల్ రోడ్లు వేయించకుండానే వేయించానని డబ్బు కాజేసిన ఘటనలు వున్నాయి. గ్రామానికి పాయిఖాన దొడ్లు, బజార్లలో లాంతర్లు మృగ్యం - బ్యాంకు చేతిలో అట్టి పెట్టుకొని తనముతా స్వప్రయోజనాలు సాధించడానికి ప్రయ త్నించి సామాన్య రైతులకు తదితర బీదప్రజలకు బ్యాంకులో అప్పులు పుట్టకుండ చేసాడు - పంచాయితీ ఎన్నికల్లో బాపయ్యముతా గ్రామ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన ఏర్పడిన గ్రామాభ్యుదయ సమితితో పోటీకి తలపడింది. అన్ని వార్డుల్లోను డబ్బు నీళ్ళప్రాయంగ ఖర్చుపెట్టినప్పటికి, ఓట ర్లను బెదరించి నప్పటికి చిత్తుగ వోడిపోయాడు - పంచా యితీ పాలనలో బాపయ్య నిరంకుశ పెత్తనానికి గోరీకట్టి సూర్యావతి అధ్యక్షురాలుగ అయింది.

భూ కమతాలకు గరిష్ట పరిమితి నిర్ణయించి ఆపైబడ్డ భూములు పంచుతామనే ప్రకటనను భూస్వాములు చాలా తీవ్రంగ తీసికున్నారు. వందలు ఎకరాలుగల భూస్వాములు తమ భూముల్ని అమ్మివేయడము, దగ్గర బంధువులపేర పంపకాలు చేయడంద్వారా ఆచరణలో భూమి పంచడానికి మిగలకుండ భూస్వాములమధ్యే సర్దుబాటు అయిపోయింది. దీనికితోడు ప్రభుత్వం ఖరికూడ భూస్వాముల చర్యల్ని సమర్థించేదిగ తయారయింది. భూమి అమ్మకాలు, చుట్టపక్కాలమధ్య కృత్రిమంగ జరుగుతున్న పంపకాలు నిషేధించకుండ చీటికి మాటికి భూసంస్కరణల ఆవశ్యకతమీద వూకదంపుడు వుప

న్యాసాలు ప్రకటనలు యిచ్చి నిద్రపోతున్న భూస్వాముల్ని కూడ మేల్కొలిపి భూమి అన్యాక్రాంతం కావడానికి ప్రభుత్వ ఆచరణ సహాయ పడింది.

అసెంబ్లీ పంచాయితీ ఎన్నికల్లో ఓడిపోయిన బాపయ్య పల్లెల్లోని వ్యవసాయ కూలీలపై చాలా కక్ష వహించాడు. చాలాకాలం పల్లెలకు పనులున్నప్పటికి పోవడం మానేసాడు. పల్లెలమీద చచ్చినన్ని అప్పులుపెట్టి కూర్చున్నాడు. బాపయ్య మొదట్లో యిచ్చిన వడ్డీకి అసలు ఫాయిదాలతో వ్యవసాయ కూలీలు అప్పులుతీర్చే సూచనలు కనబడడంలేదు. నయాన భయాన లోకులమీదనున్న యీ బాకీలు వసూలు చేసికోవాలనే తాపత్రయంతో పల్లెకు వచ్చాడు. బాపయ్య మామూలు ప్రకారం సుబ్బయ్య యింటికొచ్చి తనకు పనిపున్న మనుషులందర్ని అతని యింటికి పిలిచి తనపనులు చక్కబెట్టు కొని పోయేవాడు. బాపయ్య యింటిముందర కొచ్చేసరికి సుబ్బయ్యకుమార్డు సాంబశివరావు మంచంమీద కూర్చొని ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు- సాంబశివరావు అప్పుడు ఇంటర్ రెండో సంవత్సరం చదువుతు సెలవులకు యింటి కొచ్చాడు - పదిగజాల దూరంనుండి "ఓరే బండోడా మీ బాబు వుండా డంటరా" అన్నాడు.

సాంబశివరావుకు ఆమాటలు వినబడ్డాయి. బాపయ్య అసభ్యపు పిలుపుకు సమాధానం యివ్వకూడదని నిశ్చయించుకున్నాడు - వినబడనట్లు అలానే చదువు కుంటున్నాడు. బాపయ్య మరికొంచెం దగ్గరకొచ్చి "అరే కుర్రాడా నిన్నేరా,

మీ బాబు - సుబ్బడున్నాడంటరా" అన్నాడు - దీనితో సాంబశివరావుకు చ్రుమంటు మండిపోయింది. అనాగరికంగ వ్యవహారిస్తున్న బాపయ్యకు తగినవిధంగా నే సమాధానం చెప్పాలని "మా నాన్నగారు లేడురా ముసలబ్బాయి" అన్నాడు. బాపయ్యనుచూచి సాంబశివరావు మంచందిగి మర్యాదచేసి కూర్చోమన లేదు - రెండవది మాలకుంక బాపయ్యను అరే అన్నాడు - బాపయ్య ఫ్యూడల్ అహంకారం నీచస్వభావానికి దిగజారింది - "వంటికేమయిన మదం పట్టిందేమిరా - దొంగసాడిదానికొడక" అంటు కర్రతో ఒకపోటు పొడిచి రెండోపోటుకు సిద్ధమవు తున్నాడు. సాంబశివరావు మంచంమీదనుండి గబాలున లేచి తనమీదకువచ్చే కర్రచివర గట్టిగ పట్టుకొని ఒకనెట్టు నెట్టాడు. బాపయ్య వెల్లికలగ ప్రక్కనున్న రొచ్చుగుంటలోకి దొర్లాడు - గుడ్డలన్ని బురదయినయి. నడుంకు బలమైన దెబ్బ తగిలింది - కాలు బెణికింది. గుడ్డ సగం వూడిపోయింది. వీటన్నిటికి మించి ఎవరయిన చూస్తే పరువు పోతుందేమోనని కలవరపడడం మొదలెట్టాడు. బలవంతాన లేచాడు - ఏమి మాట్లాడకుండ గోచి దులుపుకుంటు గ్రామంలోకి కర్రపోటిమీద కుంటుకుంటు వెళ్ళిపోయాడు. సాంబశివరావుకు రాజకీయాల గొడవ అంతపెద్దగ తెలియదు - తనకు తెలిసినది ఒకే ఒకవిషయం మానవత్వానికి సంబంధించింది- సాంబశివరావుగాని తనతోటి పల్లెప్రజలుగాని బాపయ్య అతని అనుయాయుల్ని ఎల్లవేళల గౌరవంగ ఏమండి, గారు, అయ్యా, బాబు అనిమాత్రమే పిలుస్తారు. ఇంత అణకువ, మర్యాద, నమ్రత తెలిసిన ప్రజల్ని మరలా

ఆ భూస్వాములు గౌరవంగ ఎందుకు పిలవరు - ఏదో వున్నత కులాలకు చెందిన వాళ్ళమనే కులజాతి అహంకారంతో తక్కువ కులాలవాళ్ళను నీచంగ అరే, ఒరే, ఎల్లా, పుల్లా అని అమానుషంగ పిలచేవారిని మరలా అదే పద్ధతులలో అరే ఒరే అని పిలిస్తేనేగాని వాళ్ళతిక్క కుదరదు. ఆ తరువాతగాని మర్యాదగ యితరుల మానాభిమానాలు గౌరవించబడే విధంగ పిలవడం నేర్చుకుంటారని అతని అభిప్రాయం - అంతేగాదు సాంబశివరావు బాపయ్యయింటికి చాలాసార్లు పోయాడు - ఇంట్లోవాళ్ళు మంచాలమీద కుర్చీలమీద దొర్లాడుతు యింటికిపోయిన వాళ్ళను కనీసం బల్లమీదకూడ కూర్చోమంటానికి నోరులేక ఆలాగే నిలువుకాళ్ళమీద మందేసినట్లు మందేసి వచ్చిన అరగంటకు అంటీ అంటని సమాధానంచెప్పి పంపుతారు. ఆలాంటి అమర్యాదస్తులు అహంకార పూరితులు పల్లెలకు వచ్చినపుడు వ్యవసాయ కూలీలు వాళ్ళ కులవర్గ ఆధిక్యతను గౌరవించే పద్ధతిలో మంచాలమీదనుండి వినయ విధేయతలతో దిగకూడదని, ఏవయిన పనులుంటే సమాన స్థాయిలో సర్దుబాట్లు చేసికోవాలనేదే సాంబశివరావు గట్టివాదన అభిప్రాయం. లోన యీ అభిప్రాయాలు బలంగ వుండబట్టే బాపయ్యనుచూచి మంచం దిగలేదు - అరే, ఒరే అన్న బాపయ్యను ఏమిటిరా అని ధైర్యంగ పిలిచాడు - కర్రతో తట్టిన బాపయ్యను తరువాత వచ్చేఫలితాలతో సంబంధం లేకుండ తన మానవత్వం కాపాడుకోడానికి మరలా తట్టాడు. తనను అవమాన పరచిన వ్యక్తికి తగిన విధంగ సమాధానం చెప్పాడు

అనేక సంవత్సరాలుగ సాగుచేస్తున్న బంజరు భూము లకు ప్రభుత్వం పట్టాలివ్వలేదు. అధికమైన పన్నులు, పెనా ల్టీలు బంజరు సాగుదార్లనుండి ప్రభుత్వం వసూలు చేస్తుంది. ఇంతలోనే దారుణమైన పిడుగు పాటులాంటివార్త బంజరు సాగుదారులు వినవలసివచ్చింది. సాగులోవున్న బంజరు భూములు సాగుదార్లనుండి తొలగించి రాజకీయ ఖైదీలకు యివ్వ ప్రభుత్వం నిశ్చయించింది.

దేశ స్వాతంత్ర్యం కోసరం వందలు వేలసంఖ్యలో అనేకమంది దేశభక్తులు బ్రిటిషుపాలనలో భారతదేశం వుండకూడదని ఎదురుతిరిగి జైళ్ళకు వురికంబాలకు గురి అయ్యారు. యీ దేశభక్తుల్లో కొంతమంది ఆర్థికంగ చితికి పోయి నికృష్ట జీవితాన్ని అనుభవించేవారు వున్నారు. యీ రాజకీయ ఖైదీల జీవన పరిస్థితులు మెరుగుపర్చడానికి ప్రభు త్వం విధిగ సహాయం చేయవల్సిందే. జైళ్ళకు పోయిన వారిలో రాజకీయాలు ఒక వ్యాపారంగ వుపయోగించి వేలు లక్షలు రూపాయలు దొంగ వ్యాపారంద్వార తదితర అవాంఛ నీయ పద్ధతులద్వారా సంపాదించినవారు వున్నారు. బీద, కలిగినవాళ్ళు అనే విచక్షణ లేకుండ డబ్బుగల రాజకీయ బాధితులకు లేనివారికి సహాయంచేసే ప్రభుత్వ విధానం సరి యైనదికాదు. అయితే ప్రభుత్వం యీ రాజకీయ బాధితులకు బీదల సాగులోవున్న బంజర్లు లాగి దానం చేయడం బీదలఎడ పాక్షికంగాను పక్షపాతంగాను వ్యవహరించడంతప్ప వేరు కాదు – బీదల ఆక్రమణక్రింద లేని బంజర్లు అలాగే యితర

ఆర్థిక వనరులులేని పేద రాజకీయ బాధితులకు యివ్వడంలో ఏ రాజకీయ పార్టీకి ఏ ప్రజా వుద్యమానికి అభ్యంతరం వుండదు. పేదల సాగులోని బంజరుతీసి రాజకీయ బాధితులకు పట్టాలివ్వడానికి పూనుకోవడంతో ప్రభుత్వం బీదల సానుభూతిని కోల్పోవడమేగాక వారితో తగువునుకూడ కొని తెచ్చుకుంది. రాజకీయ బాధితులకు, బంజరు సాగుదార్లకు ప్రభుత్వం లడాయిపెట్టి కూర్చొంది. మొదట్లో ఎందుకు పనికిరాని యీ బంజరు భూములు పేదప్రజలు ఎంతో శ్రమకోర్చి అనేక రూపాయలు పెట్టుబడిపెట్టి సేద్యంలోకి తెచ్చారు. రాజకీయ బాధితులకు యీ భూములు యివ్వకుండ అటకాయించి తమ భూములు తాము రక్షించుకోవాలనే నిర్ణయానికి పేదవ్యవసాయ కూలీలు రావడంలో ఆశ్చర్యం ఎవ్వరికి వుండకూడదు. ప్రభుత్వప్రకటన చూచిన నారాయణరావుకు గ్రామానికి వుత్తరాన పేదలసాగులోవున్న సారవంతమైన పది ఎకరాల బంజరుభూమిని కాజేయాలనే దుర్బుద్ధి పుట్టింది. తను తన భార్య జైలుకు పోయినందుకుగాను పదిఎకరాలు తనకు కావాలని దరఖాస్తుపెట్టడంతో ప్రభుత్వం పదిఎకరాలు నారాయణరావుకు పట్టా యిచ్చివేసింది. అసలు నారాయణరావుభార్య జైలు ముఖమే ఎరుగదు - జాతీయ వుద్యమంలో పాల్గొనవద్దని నారాయణరావును గట్టిగ మందలించి భర్త ప్రజాసేవలో లేకుండ మరలించిన స్వార్థపరురాలు ఆమె జైలుకు పోయినట్లు విచిత్రమైన దొంగరికార్డు నారాయణరావు సృష్టించాడు. నారాయణరావు కొడుక్కి యిచ్చిన ఆస్తిపోను భార్యభర్త లిద్దరిపేర రెండులక్షల ఆస్తి

వుంది. ఇది చాలదన్నట్లు మరో పది ఎకరాలు పేదల సాగులోవున్న బంజర్లు నారాయణరావు కుటుంబానికి యివ్వడంలో ఏమాత్రం విజ్ఞత పేదలఎడ సానుభూతి ప్రభుత్వానికి లేదని పేదప్రజలు గ్రహించారు. నారాయణరావుకు భూమి స్వాధీనం కాకుండ అటకాయించడానికి బంజరు సాగుదార్లు నిర్ణయించుకున్నారు.

దేశంలోని ప్రతి పక్షాలు, ప్రజా వుద్యమాలు, దేశభక్తిగల కొన్ని పత్రికలు రాజకీయ బాధితులు పేదల బంజర్లకు ఆశపడరాదని రాజకీయ బాధితుల దేశభక్తికి మానవత్వానికి విజ్ఞప్తులు చేసారు. నిజాయితీ, చిత్తశుద్ధిగల రాజకీయ బాధితులు తమకు మంజూరుచేసిన బంజర్లు సహితం తిరిగి పేదప్రజలకు యిచ్చివేశారు. నారాయణరావులాంటి ధనాశాపరులు, పచ్చి పీనాసికట్టెలు తాము పట్టిన కుందేటికి మూడేకాళ్ళంటూ బంజర్లు కాజేయడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. బంజరు సాగుదార్లు భూములపై తమ న్యాయమైన హక్కుల్ని నిలబెట్టుకోడానికి శాంతియుతంగ జరిపిన ప్రచార ఆందోళనా పద్ధతుల్ని ప్రభుత్వం ఖాతరు చేయలేదు. దీనితో బంజరు సాగుదార్లు తమ భూముల్ని నిలబెట్టుకోడానికి మరింతగట్టి చర్యలకు కార్యాచరణకు పూనుకోవాల్సి వచ్చింది. వ్యవసాయ కూలీలనుండి కాజేసిన బంజరుభూములు నిలబెట్టుకోడానికి రాజకీయ బాధితులు పోలీసుల సహాయం పొంది బంజరు సాగుదార్లను అటకాయిస్తున్నారు — అమలు జరపడం చేతగాని భూసంస్కరణల్ని గూర్చి ప్రభుత్వం రోజుకొక పొలికేక వేయడంతో భూస్వాములు తమవద్దనున్న పొలాలు

అన్యాక్రాంతాలుచేసి పంచడానికి భూమి మిగలకుండ చేస్తున్నారు. యీ పరిస్థితుల్ని చర్చించడానికి వ్యవసాయకూలి పేదరైతులు కమ్యూనిస్టుపార్టీ తదితరప్రతి పక్షాల నాయకత్వాన ఒక మహాసభ జరిపి సత్వర భూసంస్కరణాల అమలుకు, బంజరు సాగుదార్ల హక్కుల రక్షణకు కొన్ని ముఖ్యమైన నిర్ణయాలు చేయడానికి నిర్ణయించుకున్నారు. బాపయ్య బంజర్లు ఆక్రమించి సాగుచేయడంలో రాజకీయ బాధితులకు ఏమాత్రం తీసిపోలేదు - జైలుటిక్కెట్టువుంటే చాలమంది బంజరు సాగుదార్ల కొంపలు నిలువునా ఆర్పేసి వుండేవాడు. సముద్ర ప్రాంతంలోవున్న వందల ఎకరాల ప్రభుత్వ బంజర్లు వంద సంవత్సరాలకు నామినల్ కౌలుకు తీసికొని ఆ పొలాల్లో తోటలునాటి విపరీత లాభాలు సంపాదిస్తున్నాడు. కొన్ని బంజర్లు మార్కెట్టు వేలంలో స్వల్పరేటుకుకొని పట్టాలు సృష్టించుకున్నాడు - యీ విధంగ సారవంతమైన బంజరు భూముల్లో అధిక భాగము బాపయ్య కుటుంబం కాజేసింది.

వ్యవసాయ సంస్కరణలు అమలుజరపాలని, బంజరు భూములు పేదలకు పంచి పట్టాలివ్వాలని భూ సంస్కరణల యాత్రాదళాలు బయలుదేరి గ్రామగ్రామాన ప్రచారంచేసి ప్రభుత్వానికి ప్రజల అభిప్రాయం తెలియజేయడానికి ప్రజా సంఘాలు నిశ్చయించాయి. ఏభయిమంది కార్యకర్తలతో గూడిన భూసంస్కరణల యాత్రాదళాలు గ్రామాలవెంట ప్రచారంచేస్తు భూమి పంపకంయొక్క అవసరాన్నిగూర్చి ప్రచారంచేస్తు భూసంస్కరణల అమలుకు విజ్ఞప్తి పత్రాలపై

ప్రజలనుండి సంతకాలు సేకరిస్తు ప్రచారం గావించారు. ప్రజలు యీ దళాలను ఎంతో ఆప్యాయతతో ఆదరించి భోజనాలు కాఫీలు యిచ్చి ఆశీర్వదించి భూసంస్కరణల అమలుజరిపించే మహోద్యమంలో తాముకూడ పాల్గొన డానికి సంసిద్ధత తెలియజేసారు. కొన్ని వేలమంది ప్రజల్లో భూసంస్కరణ యాత్రాదళాలు ప్రచారంచేసి ప్రజల అభి ప్రాయాలు ప్రభుత్వానికి పంపాయి. ఆచరణకు సంబంధం లేకుండ వట్టిమాటలతో జనాన్ని సంతృప్తిపరచాలనే ప్రభు త్వాన్ని యీ విజ్ఞప్తులు మెమోరాండాలు ఏమీ కదిలించ లేకపోయాయి.

మరికొన్ని మాసాలకు గత్యంతరంలేక వ్యవసాయ సంస్కరణల మహాసభ వెంకటరత్నం, జగ్గయ్య శ్రీనివాస రావుల నాయకత్వాన జరిగింది. మహాసభలో అన్ని రాజ కీయాభిప్రాయా లున్నవారిని ఆహ్వానించారు. మహాసభలో పలువురు భూదానోద్యమ నాయకులు, వ్యవసాయ సంస్కర ణలు కావాలనే అతివాద రాజకీయ నాయకులు పాల్గొని, మహాసభ విజయవంతం కావాలని సందేశాలిచ్చి వ్యవసాయ కూలీలు పేదరైతులు వ్యవసాయ సంస్కరణలు అమలు జరిపించడానికి గట్టిచర్యలకు పూనుకోవాలని విజ్ఞప్తులు చేసారు. మహాసభ యీ క్రిందితీర్మానాలు ఏకగ్రీవంగ ఆమోదించింది.

– ఐదుగురుగల కుటుంబానికి పన్నెండు ఎకరాలు గరిష్ట పరిమితిగ నిర్ణయించి ఆపైబడ్డ భూములు భూమిలేని వ్యవ సాయ కూలీలకు పేదరైతులకు తక్షణం పంచాలి.

- గరిష్టపరిమితినుండి తప్పుకోవాలనే దురుద్దేశంతో భూస్వాములు చేసిన అన్యాక్రాంతాలు అమ్మకాలు ఎప్పుడు జరిగినవైన చెల్లకూడదని ప్రభుత్వం ప్రకటించాలి.

- కౌలుదార్లకు రక్షణ కల్పిస్తు శాసనంచేసి ప్రభుత్వం కౌలుదార్ల హక్కుల రక్షించడానికి పూనుకోవాలి.

- ప్రభుత్వ పరంలోవున్న బంజర్లు వెంటనే తీసి వ్యవసాయ కూలీలకు పంచి వారికి వెంటనే పట్టాలివ్వాలి.

- పేదలైన రాజకీయ బాధితులకు మాత్రం వ్యవసాయ కూలీల స్వాధీనంలో లేని బంజర్లు యివ్వాలి.

యీ సమస్యలపై సత్యాగ్రహ పోరాటం నడపడానికి ఒక కార్యాచరణసంఘాన్ని ఎన్నుకున్నారు. దానికి వెంకటరత్నం నాయకుడు. సత్యాగ్రహ వుద్యమంలో పాల్గొనడానికి వ్యవసాయ సంస్కరణల అమలుకు తోడ్పడవలసినదిగ కార్యాచరణ సంఘం పిలుపు యిచ్చింది. యీ పిలుపునందుకొని కొన్ని వందలమంది సత్యాగ్రహంలో పాల్గొనుటకు సంసిద్ధత తెలియజేస్తు కార్యాచరణ సంఘ ఆఫీసుకు వుత్తరాలు వ్రాయడం మొదలెట్టారు. పసిపిల్లల తల్లులుకూడ సత్యాగ్రహంలో పాల్గొనడానికి ముందుకురావడము ఒక విశేషము.

మొదటిరోజు పురుషులతో కూడిన రెండుదళాలు, సూర్యావతి నాయకత్వాన స్త్రీలజట్టు ఒకటి సత్యాగ్రహానికి బయలుదేరాయి. ఒకదళం సత్వరం భూసంస్కరణలు అమలు జరపాలని ప్రభుత్వ కార్యాలయాలముందు సత్యాగ్రహం

చేస్తుంది. మిగతా రెండుదళాలు బంజరు సాగుదార్ల నుండి రాజకీయబాధితులు కాజేసిన భూముల్లో ప్రవేశించి రాజకీయ బాధితుల్ని భూమిలోనుండి వెళ్ళిపొమ్మని భూమిపై నిలబడి భూమికోసరం సత్యాగ్రహం చేస్తుంది. సత్యాగ్రహులంతా ఎర్రజెండాలు, బ్యాడ్జీలు ధరించి వ్యవసాయ సంస్కరణలు అమలు జరపాల్సిన అవసరాన్ని తెలియజేసే నినాదాలు పాటలు పాడుకుంటు గ్రామాలవెంట వూరేగింపులు జరుపుతున్నారు. గ్రామస్తుల ఆనందం వర్ణించడానికి అలవికాకుండ వుంది. సత్యాగ్రహుల్ని మేళతాళాలతో వూరేగిస్తు నీళ్లు వారబోస్తు నుదుట కుంకుమబొట్లు దిద్ది మెళ్లో పూలమాలలు వేసి దీవించి ఒక గ్రామానుండి మరోగ్రామానికి సాగనంపుతున్నారు. వందల ప్రజలతో బయలుదేరిన వూరేగింపు వేల జనంతో కిటకిటలాడిపోతుంది. వూరేగింపులోనున్న వలంటీర్లు, సత్యాగ్రహులలో బీదవారయిన కుటుంబాల సహాయార్థం డబ్బు ధాన్యం వసూలుచేస్తున్నారు. స్త్రీలజట్టు పురుషుల జట్టు బంజరుపొలాలు సమీపించాయి. పోలీసులు సత్యాగ్రహుల్ని పొలాలలో దిగకుండా అటకాయిస్తున్నారు. "ఆ పొలాలు మావే - అవిమాకు దక్కకుండ ప్రభుత్వం రాజకీయ బాధితులకు కట్టబెట్టింది. ప్రభుత్వచర్యను మేము వ్యతిరేకిస్తున్నాము. భూమిమీద నిలబడి పోరాడే పోరాటమే నిజమైన భూసంస్కరణల పోరాటం." అంటూ అంతా పొలాలలోకి దుమికారు. తాము కష్టపడి సారవంతంచేసిన పొలాలలోకి ప్రవేశించడంతో వారికి పట్టలేని సంతోషం కలిగింది. కొద్దినిమిషాలలోనే పోలీసులు సత్యాగ్రహుల్ని

అరెస్టుచేసారు. మూడవజట్టు ప్రభుత్వ కార్యాలయం ముందు అరెస్టు అయింది. సూర్యావతి, లీల, జగ్గయ్య సత్యాగ్రహ దళాలకి నాయకత్వం వహించి అరెస్టు అయ్యారు. మరి కొన్ని దినాలకు వెంకటరత్నం, శ్రీనివాసరావుల నాయ కత్వాన సత్యాగ్రహంచేసి మరికొన్ని వందలమంది అరెస్టు అయ్యారు. సత్యాగ్రహపోరాటం పదిరోజులు జరిగింది. వందలమంది పాల్గొని అరెస్టు గావించబడ్డారు.

సత్యాగ్రహులందరిని కోర్టులో విచారణకు పెట్టారు. వెంకటరత్నం వ్యవసాయ సంస్కరణలు లాంటి జాతీయ సమస్యలపై జరిపిన యీ పోరాటం న్యాయమైనదని, ఆహార సమస్యను పరిష్కరించి, పరిశ్రమలు అభివృద్ధిపరచి ప్రజలకు తిండి గుడ్డ యిచ్చే యీ వ్యవసాయ సంస్కరణలు అమలు జరపలేనందుకు ప్రభుత్వాన్ని శిక్షించాలని తీవ్రంగ వాదిం చాడు. ప్రయోజనం లేకపోయింది. సత్యాగ్రహులందరు శాంతిభద్రతలకు సంబంధించిన శాసనాలు ధిక్కరించారనే నెపంపై అందరికి కఠినశిక్షలు విధించారు. సత్యాగ్రహుల్ని సెంట్రల్ జైలుకు తీసుకుపోవడానికి రైల్వేస్టేషనుకు తీసు కొచ్చారు. సత్యాగ్రహులకు వీడ్కోలు చెప్పడానికి కొన్ని వేలమంది ప్రజలు నినాదాలు యిచ్చుకుంటు స్టేషనుచుట్టు ముట్టారు. సత్యాగ్రహులందరికి పూలమాలలువేసి సత్క రించారు. పండ్లు ఫలహారాలు బహూకరించారు. స్టేషనంతా

జనసందోహంతో క్రిక్కిరిసిపోయింది. రైలుపెట్టెలన్ని ఎర్ర జెండాలతో అలంకరించారు. చివరకు రైలుయింజను మీద కూడ ఎర్రజెండాలు వెలిసాయి. నినాదాలధ్వనికి పొగలతో సెగలతో బుసలుకొట్టె రైలుయింజను దద్దరిల్లిపోయింది. గార్డు ఈలవేసి జెండావూపాడు. వ్యవసాయ సంస్కరణాలు అమలుజరపాలనే లినాదాలు మిన్నుముట్టాయి. తట్టలకుతట్టలే పుష్పాలు సత్యాగ్రహులమీద విసిరారు. ప్రజల నినాదాలను చివరకు రైలుబండికూడ అంటుకున్నట్లు వి-ప్ల-వం-వర్ధి-ల్లాలి. వ - ర్ధి - ల్లా - లి అంటు వేగంగ కంటిచూపు కందకుండా కదలిపోయింది.

స మా ప్తం.